శ్రీరస్తు

# మధుకరవిజయము

## కల్పితప్రబంధము.




శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,

కవిసార్వభౌమ బిరుదాంకిత

**శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి**

ప్రణీతము.



రాజమహేంద్రవరము

మెజస్టిక్ ప్రెస్ నందు

ముద్రితము.



కాపీరైటు రిజర్వుడు]



1955

[వెల 3-0-0

# వి జ్ఞ ప్తి

ఆఖ్యాయిక లనఁగా నవల లని యిప్పటివ్యవహారము. అవి మహాద్భుతకథాకల్పితములై యుండ వలయును. అందుఁ జెప్పఁ దగినది యొక్కకళాపూర్ణోదయమే యనుట సత్యదూరము కాదు. ఆరచన సామాన్యకవుల కసాధ్యము. మేనమామపోలికగా నైన నట్టినవల యొకటి కల్పింప వలయు నని నాకు సంకల్పము కలిగి నిజసామర్థ్యమును శంకించుకొనక నే నీ మధుకరవిజయ మచిరకాలములోనే రచింపఁ గలిగితిని. ఇది 1944 సం॥రమున రచించి మొదట ముద్రించితిని.

ఈ కథకు బీజము కన్యావివాహము. అందుపై మాతాపితలకు వివాదము. అభియోగములు, శిక్షలు, దానంజేసి వారివారికి మహా విరోధములు, దుండగులు విమానములనుండి వచ్చి తత్సంబంధుల నపహరించుట. అనేకఘోరాద్భుతదర్శనములు. ఇం దెవ రేమి కార్య మెందులకుఁ జేయుచున్నారో మొదటఁ దెలియకుండుటయుఁ దుదకు గ్రంథాంతమందు సర్వమును దేటతెల్లం బగుటయు మాలతీమాధుకరు లను కథానాయకులకు వివాహ మగుటయు రాజ్యప్రాప్తియు నిందు ముఖ్యాంశములు.

ఇందలిగుణాగుణములు చెప్పుట కన్న పాఠకమహాశయు లొక్క సారి చదివిన వారికే కరతలామలకం బగు నని విన్నవించుచున్నాను.

గ్రంథకర్త.



శ్రీరస్తు

# మధుకరవిజయము

## ప్రథమాశ్వాసము

క. శ్రీకరుఁడై లోకంబులఁ
జేకొని రక్షించుమహిమ చెన్నలరారన్
వాకొనఁగ నొప్పుదేవుఁడు
నాకృతిఁ జెంపొందఁ గా నొనర్చుత మెలమిన్. 1

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధి గా నాయొనర్పం బూనిన మధుకర
విజయం బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 2

—♦ మధురాపుర వర్ణనము ♦—

మ. యమునా తీరమునందు సౌధశిఖరప్రాప్తాంబరంబై రవిం
దుమహావీథిసమంచితప్రతిభమై తుంగధ్వజస్తంభసం
భ్రమమైశ్వర్యమునై పురంబు మధురాప్రఖ్యాతమై యొప్పు నొ
ప్పమరన్ భారతభూసతీగళమణీహారాగ్రరత్నంబు నాన్, 3

తే. గోపురము నాఁపునాపురగోపురములఁ
జెలఁగు సౌవర్ణసాలభంజికలు ప్రోలి
మేలుసింగారమును జూచి మేను మఱచి
మ్రానుపడియున్న యచ్చరచాన లనఁగ. 4

చ. మగఁ డగునయ్యపాంపతిక్రమమ్మున నెల్లొ యుదయించు నెప్పుడున్
గగనతరంగిణీమణి ప్రకాశిలి తత్పురసౌధకుట్టిమ
స్థగితవిభూషణప్రసవదదభ్రిపయస్తత మై ప్రతివ్రతా
సంగగరిమ న్నెల్లవారలును వర్ణన మూనఁగ మాన కుండెడున్. 5

మ. పౌనరన్ రాజనముల్ పయస్సులను నెప్డుం బెంచు నయ్యేళులం
దనిశక్రీడలు సల్పు స్త్రీలకు నొడళ్ళం దౌసుగంధంబు వీఁ
గి నదీతోయములందుఁ గల్వలకు నాఁగెం గాన సౌగంధికా
ఖ్యను బెంపొందెడుఁ గల్వ లట్టు లగు సత్సాంగత్య మెవ్వారికిన్. 6

మ. సకలాభ్రంకషనాళికేరమహీరుడ్జాలాతిథేయుల్ విలో
లకమార్గశ్రమ ఖిన్నుఁడై కుతపకాలంబందు నిచ్చల్ నిజాం
తికముం జేరినభాన్కరాతిథిని నెత్తిం బూని యాతిథ్యముల్
బ్రికటస్వాదుఫలోదకం బొసఁగి పత్రిస్పర్శముం జేసెడిన్. 7

చ. వరయమునానదీ పులినభాగసమంచితహంసతూలికా
స్తరణదుకూలజాలవిలసన్నవదంపతు లుష్ణరాత్రులన్.
దరఁగలు వోలె మాటికిని దక్షిణదిగ్గతవాతపోతముల్
పఱపుచు సూక్ష్మశీకరములం బయి వీవ సుఖింతు రెంతయున్. 8

క. గోవాళ్ళు రేఁబవళ్లట
నావలపై నెక్కి నూర్యనందననీటన్
శేవమెయిన్ విహరింతురు
నీవా ? నేనా ? యటంచు నెఱపుచు వాదుల్. 9

—♦ మాధవశర్మ వృత్తాంతము ♦—

ఉ. ఆపురిఁ గాపురంబుగ నిరంతర ముండు ధరామరాన్వయ
శ్రీపరిపూర్ణుఁ డర్ణవవరిష్ఠగభీరుఁడు వీర్ధమూర్తి వి
ద్యాపరవిశ్వసృట్టు తనరారును మాధవనాముఁ డాజ్ఞవ
ప్రాపితసద్యశుం డగుచుఁ పండితవర్యులు మెచ్చుమచ్చునన్. 10

క. ఆడి తప్పనివాఁడు విద్యాప్రియుండు
పలికి బొంకనివాఁడును భవ్యయశుఁడు
లే దనెడిమాట యెప్పుడు లేనివాఁడు
మాధవుఁడు వోల్పు మాఱటమాధవుండు. 11

క. తినఁగం బెట్టఁగఁ జాలిన
ధనము గలట్టిండు నెట్టిదానము లేనిన్
గొనఁ నిచ్చగింపఁ డెప్పుడుఁ
దనపొలములు పండుచుండు ధాన్యము లెల్లన్. 12

ఉ. మాన్యుఁ డతండు దుండిసుత మాధవిఁ బెండిలియాడి యమ్మహా
మాన్యచరిత్రయందుఁ గని మాలతి నాఁబడుకన్యకామణిన్
ధన్యవరాహ్వయంబునఁ బ్రథం గలపుత్రుని మిత్రు లెన్న మే
*ల్మన్యువు లాచరించుచుఁ బ్రమం గొనె సంసృతిసాగరంబునన్. 13

ఉ. మాధవి మున్ను మున్ను కడు మన్ననఁ గల్గి మెలంగుచుండియున్
మాధవు మాధవుం బలెను మానసమందుఁ దలంచునట్టిదై
బోధముఁ గల్గి యుండియును బుట్టినయింటి ప్రవర్తనంబునన్
బోధితయై క్రమం బఱి సముద్ధతిఁ జూపెడునట్టిదై తగెన్. 14

మ. తినఁ బెట్టం గలఁడై యతిఁ డనిశమున్ దేవార్చనాతత్పరుం
డును విద్యారతుఁడున్ వ్రతస్థుఁ డగుచున్ రూపింపఁగా నొప్పియున్
దనచిత్తంబును బట్టి యుండ కెపుడున్ దబ్బిబ్బుగా నాడు నా
తినిఁ జేపట్టుటఁ జేసి వాసి చెడ నెంతే వంతలన్ వందురెన్. 15

క. జపము తపంబును స్వాధ్యా
యపిత్రతిథిపూజ లాదు లగుసత్క్రియ లో
పి పొనర్చుట కేనియు న
వ్విపులామరుమదికి శాంతి వెలయని దయ్యెన్. 16

క. కూఁతురు కొడుకును బడిలో
నాతరుణమునందు విద్య నభ్యాసంబుల్
ప్రీతి మెయి సలుపుచుండిరి
భూతలజను లెల్లఁ గాంచి పొగడుచు నుండన్. 17

---

*మన్యువు—యజ్ఞము; ప్రమ—యథార్థజ్ఞానము.

తే. అంత గర్భాష్టమాబ్దమునందు విధివి
హితముగా నుపనయనము సుతున కల్ల
జనకుఁ డొనరించి మించి ద్విజత్వసిద్ధి
గలుగునట్లు పౌనర్భ్వ నకాలమందు. 18

—మాధవి మగనితోఁ గూఁతు పెండ్లివిషయము నుచ్చటించుట.—

క. మగనిం గనుఁగొని మాధవి
తగున ట్లాడుచును నొక్కతరుణమునందున్
వగ మీఱి నిట్లు పలికెన్
దెగువ మెయిన్ గన్నవారి దెస కూర్మిపసన్. 19

క. మనమాలతికిం బరిణయ
మొనరింపఁగ నీడు వచ్చి యున్నది నాథా!
తినఁ బెట్టఁ గట్టఁ గలిగిన
జనునకు నిడి పెండ్లిసేయఁ జనియెడుఁ గాదే. 20

మ. ధనవంతుం డగునాదుతండ్రి యెదియుం దాఁ జూడ కీరీతి నర్థ
దినఁగం గట్టఁగ లేనియింటి కిడుటన్ దీనత్వముం గాంచి నే
వనటం గుందుచు నుంటి నిట్టు లయి పోనం జూడ కింతన్న ముం
డిన వారింటికి బిడ్డ నీయు మనముం జేయంగ నర్థించెదన్. 21

శా. నాకుం దమ్ముఁడు లోకమాన్యుఁడు వసంతఖ్యాతనాముండు తా
మీకున్ శ్యాలకుఁ డాతఁ డెట్లు మనకున్ మే లెంచి కావించునో
వాకో నేటికి మీమనోగతికె తోఁప న్వచ్చు లక్ష్మీశుఁ డా
లోకైకస్తవనీయవైభవుఁడు పోలున్ మీకుఁ గీర్తింపఁగన్. 22

క. వానికి మకరధ్వజుఁ డను
సూనుం డొకఁ డతఁడు లోకసుందరుఁడు ధన
స్థానమున కైనవాఁడు స
మానవయస్కుండు మనకొమారిత కరయన్. 23

చ. కొలిచి వివాహముల్ సలుపుకొన్నటులై కుతుకంబుఁ గూర్చి వెం
గిలి యది లేదు నోటికినిఁ జేలికిఁ గట్నము లెవ్వి యేసి యీ
వలె ననుబాధ లేదు మనబాలిక వానికి నిత్తు మేని వార్
చిలుకము గోరువంకయును జేరి వసించెడునట్ల యుండెడిన్. 24

ఆ. ఏను మీకుఁ జెప్ప నింతయుఁ బని లేదు
మీకుఁ దెలియుఁ గాని మీమనంబు
భ్రమరిగానిమీఁదఁ బడియున్నయట్లు నేఁ
దలఁచి యిప్పు డిట్లు పలుకుచుంటి. 25

మ. జలకం బాడినయగ్గి వోలె నగుమైచాయం బ్రదర్శించి యో?
పిలజుట్టుం గనియో? "ఇషేత్వ" యనుచున్ బెల్లార్చుటం జూచియో?
చలివెల్గున్ మఱి వేఁడివెల్గు గుడిసెన్ సాక్షాత్కృతిం జేయుటల్
దెలియన్ వచ్చియొ వానికిన్ మనసుతన్ దేవేరిగాఁ జేయుటల్. 26

క. తెలిసియుఁ దెలియనిరీతిన్
మెలఁగునో మీచిత్త మనెడు మిణకరమున నేఁ
దెలిపితి నిట్టులు నాలోఁ
గలదానిన్ గన్నప్రేఁగు గావున మీకున్. 27

— మాధవుఁడు భార్యకు వ్యతిరేకముగా నాడుట. —

వ. అనిన మాధవుండు మాధవిదిక్కు మొగం బై. 28

క. నీయన్న వెల్ల నిజములె
నాయుల్ల మెఱుంగు నెల్ల న్యాయములు సతీ
వే యేల చెప్పఁ గన్నియ
కేమొడఁ జను మనము నట్టులే చన నొప్పున్. 29

ఉ. ఈ వనుమాట నిక్క మని యేను వచింతును నిన్నుఁ గన్నవార్
కేవలముల్ ధనాఢ్యు లని కీర్తి గలా రని నీవు చెప్ప నే

---

భ్రమరిగాడు = మధుకరుడు. (నిందను దెలుపుచు భ్రమరశబ్దమునకు మధుకరుఁ డని చెప్పెను) జలకం బాడినయగ్గి = మసిబొగ్గు; ఇషేత్వ – యజుర్వేదాదిది.

లా వసుధాజనంబె తెలియ న్వచియించెదుఁ గాని విత్తముల్
నీ వనునంతఁగా నెడఁద నేను ప్రధానము సేయ నెప్పుడున్. 30

తే. వృత్తము ప్రధాన మెప్పుడు వెలఁదిమిన్న
దుష్టవృత్తులఁ గూర్చినదుష్టధనము
గొప్పతన మీయ దెప్పుడు కోవిదు లగు
గుణగరిష్ఠులె శిష్టులు గొప్పవారు. 31

♦ ఉ. నీకులగోత్రనామములు నేను నెఱుంగుదు రత్న మంచు నిన్
గైకొనినాఁడఁ గాని మనకన్నియ నీయఁ దలఁపుసేయుటల్
లోకము దూఱునట్టికి్రియలోని దగున్ దలపోయ శ్యాలకుం
డోకడుఁ గూరుఁ డయ్యుకును నొజ్జ యనం దగువాఁడె యన్నిటన్. 32

మత్త. ధూమపానము సేయు వేశ్యలఁ గోడఁ బోవును జూదమం
దేమఱిల్లఁడు మద్యమం దధికేప్సితం గొనుఁ గన్నగాఁ
డై మెలంగును మాలమాదిగ లన్న నెగ్గుఁ గొనండు దు
ష్కాముఁ డాసహజాత్మజుండును జాలుఁ జెప్పితి వొప్పులన్. 33

తే. సకియ వానిపై ర్వెన హరిశ్చంద్రు స్మరణ
మొనరుపం దగుఁ బో మఱియును సచేల
ముగను స్నాన మొప్పును వానిఁ బొగడుమాట
తేకు మిఁక నాకడన్ విట్సదృశుఁడు వాఁడు. 34

వ. అని ప్రతిఘటించి పలికినం గలికి యలుకం జెందినమనంబునం దన
సంకల్పం బె ట్లీడేరకుండు ననునహంకారంబున మెలఁగుచు నొక్క
చందంబునఁ గాపురంబు సేయుచుండె నంత. 35

సీ. మగఁడు కొంద మటన్న మగువ యమ్ముద మను
నతఁడు కా దన్న నౌ ననెడు నాపె

♦ రత్నమంచు నిన్ గైకొనినాఁడ — "స్త్రీరత్నం దుష్కులాదపి" అనుటంజేసి నిన్ను స్వీకరించితిని గాని నేను నాకన్నియ నీయ నని యభిప్రాయము.

యిది సేయుద మటన్న నది సేయ రా దను
నది దోష మనినఁ బుణ్యంబె యనును
నేటికిఁ బోవుద మే యన్నఁ బతి సతి
కాటికిఁ బోదము కదలు మనును
బురుషుండు శుభవాక్యములు వల్కఁ బోలఁతుక
యశుభవాక్యంబుల నట్టె పలుకు

తే. అన్న మన్నను సున్న మన్ గ న్నటన్నఁ
గాలనుం గొంత యీరీతిఁ గత్తి వేయు
ద మనఁగను బద్ద వేయుద మచట ననుచుఁ
గలహ మొనరించు చుండె నక్కాలమందు. 36

చ. దినము లతిక్రమించుకొలఁదిన్ ముదిరెం గలహంబు వారికిం
దినుబడులందు భేదము జనించెను నించినకిన్క నొండొరుల్
కనుటయు మానినైచుటయ కాక దురుక్తులు దూషణంబులుఁ
జను లెవ రైనఁ జీ యనఁగ సల్పుచు నుండిరి వారు కొంతలోఁ. 37

సీ. మంత్రముల్ వేయించి మరులు కొల్పుదు నని
మాంత్రికులం బిల్చి మాట లడుగు
మందులు వేయించి మది విఱిగించెద
నని తుచ్ఛవైద్యుల నరసి తెచ్చు
వేళ్లు వెల్లంకులు వెదకించి తెచ్చి పా
గలు వేయు వాసనల్ గలయఁ బర్వ
బైరాగులను బిల్చి బసుమంబు చల్లించు
నతఁడు మెలంగెడునట్టిచోట్ల

తే. వెఱ్ఱి యెత్తంగ గన్నేరు వేరు పెట్టఁ
జచ్చినం గాని తనకు మే ల్వచ్చు ననుచు
మాధవీసతి పతిపట్ల మాన కిట్లు
దుష్ప్రవర్తనముల నుండె దుష్ట యగుచు. 38

క. దినదినగండంబుగ న
మ్మునిజాయాపతుల కట్లు పోరై నానాఁ
టను బెఱేఁగి పెద్ద దై కన
విన నేరికి నే నసహ్యావిధిమైఁ బ్రబలెల్. 39

వ. అట్లు కొంత కాలంబు కడచిన యనంతరంబ. 40

తే. తనదు సంకల్ప మిట నున్నఁ దప్పి చనునొ
యెప్పు డేరాత్రిఁ గన్నియ నేరి కిచ్చి
పెండ్లిసేయునొ మగఁ డని బీతుఁ జెంది
దాసిలక్ష్మిసాహాయ్యము దాను వడసి. 41

—* మాధవి పిల్లలతోఁ బుట్టినింటికిఁ బోవుట *—

తే. అపుడు మాధవి త్యజియించి ప్రాణనాథుఁ
గన్నబిడ్డల వెంట గైకొన్న దగుచుఁ
బితృగృహంబునకు న్జనెఁ బెర లెఱుంగ
నటు లోకనిశీథినీసమయమునయందు. 42

తే. కన్ను మిన్నును గన రానికరణిఁ జిమ్మ
చీఁకటులు గ్రమ్ముకొని భీతిఁ జేయునట్టి
యపు డమాసరాత్రిఁ దళ్కు మనెడిమెఱుము
సాయమునఁజేసి చనియె నాజంత కాంత. 43

వ. అట్టియెడ గృహంబున నొక్కచో శయనించిన మాధవుండు. 44

ఆ. నిదురనుండి లేచి గదు లన్నియుం జూచి
సతియు సుతయు సుతుఁడు సదనమందు
లేమి నిశ్చయించి లేపియు! బరిచార
కులను వెదుకఁ బుచ్చెఁ దలము లెల్ల. 45

ఉ. వారలు దాసిలక్ష్మి కగువాసగృహంబున కేఁగి చూచి యా
నారినిఁ గాన కచ్చటను నాలుగువంకల కేగి నల్వురున్

వారల లేమినిం దెలిసి వచ్చి గృహేశ్వరుతోడఁ జెప్పుడున్
బోరుఁ దతండు నూతులును బావులు గోతులు రోసి రోయుచున్.

ఆ. వెదకుచుండ నొక్కవీథిలోనఁ దలారి
యొకఁడు కాన వచ్చి సకలవృత్త
మడిగి తెలిసికొనియు నాతఁడెఱింగిన
తెఱఁగ దెల్ల నిట్లు తెలియఁ జెప్పె. 47

ఉ. రాత్రిరెండుజాము లయి రాజగృహంబున గంట మ్రోఁగున
స్త్రీతలనుండి మందగతి నేగుచు నుండిరి యిద్ద ఱాఁడువాం
డ్రీతఱి నడ్డి నే నెవరొ యాచనువా రన నం దొకర్తు వి
న్నీతరళాక్షి మాధవమహీసురపత్ని యపత్య మిద్దఱున్. 48

ఆ. ఏను దాసి నుండి గృహమునకే నేగు
చున్నవార మనుచు నుత్తరంబు
చెప్ప నేను వారిచేవ్రాలు గొని యట్టె
విడిచి పుచ్చినాఁడ విడిద కరుగ. 49

చ. అనుడుఁ దలారిఁ గాంచి ద్విజుఁ డాతఁడు పాతరలాడు చిట్లనున్
వనితల నెంతె? వారికడ వస్తువు లారసి యుంటె? బిడ్డ లే
మనిరి భవత్సమాఖ్య విన నాస యొనర్చితిఁ జెప్పవే యనన్
వినిచె నతండు సర్వమును వింటిని గంటిని నేను సోముఁడన్. 50

ఆ. కొమరుఁ డొక్కమాటఁ గూడఁ బల్కఁగ లేదు
కాని యాఁడుబిడ్డఁ గంట నీరు
పెట్టుకొనుచు నీమ పేర్చెప్పి యేడ్చెను
దల్లి మందలించెఁ దగ దటంచు. 51

ఉ. ఏ విడనాడ వార లపు డేగిరి దుండిగృహంబుఁ జేరఁగా
నీ విప్పు డిట్లు రోయుటకు నేమి కతం బని పల్కె మాధవుం
డా విధ మెల్లఁ దెల్పి తనయుం డటుతోడ వసంతమాలనై
తేవ నెసంగు నాశ్వాసుని లెంకికి నేగె మహాగ్రహంబునన్. 52

—*దుండిగృహవర్ణనము*—

సీ. చుట్టునుం బ్రాకార మట్టె చూచినఁ దల
పాగ నేలం బడుపగిది నెదుగు
నేడుఁ బంగారితో నేగఁ జాలినపెద్ద
బారుతల్పులతో హజార మెసఁగు
నెఱ్ఱడాల్బొమిడిక లేర్పడ నగుమేడ
వైజయంతముఁ బోలునోజ నొప్పుఁ
జంద్రకాంతోపలస్థగిత తదూర్ధ్వభాగ
మలపాలవెల్లి యన్ లలిఁ దలిర్చు
తే. సౌధరక్షకపరివారసంఖ్య గాక
వచ్చుచును బోవుచుండెడివారిసంఖ్య
పరిగణింప నసాధ్యమై పరఁగుచుండుఁ
దోరపున్సిరితో నొప్పి దుండిగృహము. 53

క. మొగసాల నిలిచి వాఁకిట
నగువానికిఁ జెప్పిపుచ్చె నాతఁడు చనినం
తఁ గన న్వచ్చె వసంతుఁడు
మొగమున మృత్యుస్వరూపమును జూపుగతిన్. 54

ఉ. వచ్చినమాధవుం డతనివాసిఁ గనుంగొని పల్కరించుచున్
వచ్చెనె నీదునక్క యిటు వచ్చుట వింటి గృహంబు వాసి నా
ముచ్చట రోసి రోసమును ముంగలఁ డాయఁగ జేసి నాపుడున్
జిచ్చున కెత్తు వచ్చి కడుఁ జీఁదఱ రేఁగ నతండు గండ్రయై. 55

శా. ఓరీ! రాక్షస! నాసహోదరిని నేమో చేసి యీవాసినైఁ
బ్రారంభించితె యెన్నియేని నగ లేమాయమ్మకుం బెట్టె యె
న్నేరత్నంబులునున్ సువర్ణములునున్ హెచ్చిల్లఁ గా నిచ్చి నిన్
జేరం బుచ్చితి మెట్లొ చేసి వెదుకం జిత్తంబు గావింతువే. 56

తే. జగతిలోన ధనాశ యేతగనికార్య
మైనఁ జేయించుఁ గడుబేద వైననీవు
మాధనంబు హరింప నీమాది పన్ని
చేసితివె ఘోరకార్య మోదోసకారి! 57

క. స్త్రీహత్య చేసి వచ్చితి
ద్రోహి యెటులు చేసిన నిను దోసము రాదా
హాహా! రాజు గలం డని
యూహింపవు ధనము మిగుల నూహింతు వహో. 58

క. పో పొమ్ము రాకు లోనికి
నీసని పట్టెదను నడుము నిను నివ్వేళం
గాపాడఁ గలుగు నట్టిం
డేపురుషుఁడో చూతుఁ గాక యింతటిలోనన్. 59

వ. అని గర్జించి పలుకుచు లోనికిం బోయె మాధవుండును జేయునది లేక నిజపరివారపరివృతుండై స్వగృహంబునకుం జనియె నని చెప్పిన శ్రోత లవ్వలివృత్తాంతంబు చెప్పు మని కథకు నడుగుటయును. 60

ఆశ్వాసాంతము.

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ
కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ,
వేదవిద్యావిశారదాది బిరుదవిరాజమాన
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతం బయిన
మధుకరవిజయం బనుప్రబంధంబునఁ
బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు

# మధుకరవిజయము

## ద్వితీయాశ్వాసము

వ. అక్కథకుండు శ్రోతలకిట్లనియె నట్లు మాధవుండు నిజగృహం
బునకుం జని యొక్కచో నొక్కరుండ కూరుచుండి. 1

—※ మాధవుండు భార్యావిషయము విచారించుట. ※—

సీ. ప్రాణనాథునకుఁ గైవల్యసంప్రాప్తికి
సదనమైనది ప్రాణసతియె సూవె
మగనికి నీరేడుజగములందును నిద్ధ
మగుయశం బిడునది మగువ సూవె
పతి కనంగదశాప్రతతి దాఁక కుండ ని
రతసౌఖ్య మిడునది రమణి సూవె
ఇంటియాతనికి ననేకాపదలు వాపి
యలరించునట్టి దిల్లాలు సూవె
తే. పనుల దాసి కరణములఁ బరమమంత్రి
భోజ్యములఁ దల్లి రతి రంభ భూమి క్షమను
రూపునను లక్ష్మి యనఁగఁ బేర్కొనుచు నిల గృ
హస్థు నేలెడునది గేస్తురాలు సూవె. 2

చ. బ్రతికిన యప్డు నీడవలెఁ బ్రాణవిభున్ విడకుండునట్టి పై
సదమలచిత్తము న్గలిగి సంతతసేవ యొనర్చు గేస్తురా
లెదియును వెంట రాదు తను వీగి గమించెడునప్పు డొక్కయు
య్యదియె చితాగ్ని మే న్విడిచి నట్టిదయై వెనువెంట నంటెడున్. 3

క. కన నఖిలదుఃఖరోగా
    స్తనకున్ బరమహౌషధంబు స్తుతమతి యగుచున్
    జనుభార్య యని వచించిరి
    మును లనఁ బదునైద్య్వె ల్ల మును గ్రంథములన్. 4

చ. స్తుతమతి యైనభార్య యగుచో నిది యంతయు నిశ్చయంబ యౌఁ
    బతికి సగంబుమే ననుచు భార్యను జెప్పదు రెల్ల సౌఖ్యముల్
    సతి యగు నన్న వాకు శ్రుతిసమ్మత మట్టిది నాదు జన్మమం
    దతుకు ననంగ రా దరయ నయ్యది యే విష మయ్యె నయ్యయో. 5

సీ. బ్రహ్మరాక్షసి యయి పట్టి మాధవశర్మఁ
        బెండ్లాము వేధించి పెం పడంచెఁ
    గాలసర్పం బయి కామిని మాధవుఁ
        గఱచి పుచ్చఁగ నుండె వెరవు వేచి
    కాలకూటం బయి కడుపులోపలి కేగి
        మాధవు మాయింప మగువ దలఁచె
    మాధవుపాలింట మాధవి పిల్లల
        పిడు గయి నెత్తిపైఁ బడిన దయ్యొ

తే. నాఁడు నాఁడును పెద్దగండంబు వలెను
    రాజయక్ష్మామయము వలె ఱంపము వలె
    నెత్తిపై బగ్గు మనిమండుకిత్తి వోలె
    మాధవుం జంపునది యయ్యొ మాధవి కట! 6

ఉ. పిల్లలఁ గన్న దైన నది పెద్దపిశాచము వీడిపోయె నా
    నుల్లము పల్లవించు నన నొప్పును గాని కులంబుతంతువుల్
    పిల్లలు వారి కెట్టిగతి పెంపెసలారఁ బొసర్ప నుండునో
    యిల్లది గుల్ల చేసికొని యేగె విచారము దీన నయ్యెడున్. 7

సీ. ఘనుఁడు మాతాత శంకరమూర్తికిన్ మెచ్చి
        కొస రా జిడిన మేటి కుండలములు

మాతండ్రి హరిశర్మ మనుజేంద్రుకడఁ బ్రాజ్ఞు
లను గెల్చి కైకొన్న ఘనపదకము
విద్వత్ప్రభ న్నాకుఁ బృథ్వీశుఁ డిచ్చిన
వెలలేని కవిగండపెండెరంబు
కూఁతుపెండ్లికి నేను గూర్చి పెట్టినవెండి
బంగారములును నాభరణములును

తే. రిత్తఁగాఁ జేసి యిల్లెల్ల నిత్తటిఁ దన
వెంటఁ గొని పోయెఁ గనుబ్రామి యింటిలోని
వారి నందఱ వంచించి వల్లడిఁ గొని
యేమిచేయుదు నింక నా కేది దిక్కు. 8

వ. అని చింతించుచు నంతలోఁ గూఁతుం దలంచుకొని. 9

—♦ మాధవుఁడు కూఁతునిగూర్చి విచారించుట ♦—

సీ. పల్కుపల్కున ముద్దు లొల్కఁ బల్కెడుఁ బల్కు
కల్కి నా మాలతి కన్నెమిన్న
మేలు మేలనఁ గాయకాళి రాగాలాప
మొనరింపఁ జాలు నాకనినబాల
కవు లెల్ల రవు ననం దవిలి కవన మల్ల
నవుకవయిత్రి నాయనుఁగుఁ బుత్రి
చిత్ర చిత్రముగాఁగఁ జిత్రముల్ చిత్రించి
యెన్నికం గన్న నాచిన్ని బుడుత

తే. మంచిమంచి యాలోచన లెంచి చెప్పి
నన్ను మెప్పించుచుండెడు నాదుబిడ్డ
యన్నమును బున్నె మెఱుఁగని సన్నుతమతి
కన్నకూఁతురు తా నెట్టు లున్నదో కద. 10

సీ. అనిశంబు దైవచింతనయు నాచింతన
యును దక్కఁ బెరచింతనను నెఱుఁగదు

ననుఁ జూడ కింతమాత్రి నిలంగనేరదు
పరుసంబు లెన్నఁడుఁ బలుకఁ బోదు
తల్లి యేమే నన్నుఁ దగులంగ నాడిన
కాదని వారించు వాడు వెంచి
దాని నుత్తమునకు నే నిచ్చి పెండిలి
సలిపి పితౄణముఁ దలఁగ నుంటి
*తే. అట్టినాకూతుఁ గూరాత్ముఁ డైనయట్టి
మారునకుఁ గట్టిపెట్టు నమ్మాత యనెడి
కూరరాక్షసి వల దన్న కూఁతుమాట
తోసిరాజను నా కేది తోప దకట. 11
చ. కొడు కవిమర్శకుండు తనకున్గల జ్ఞాన మొకింతమాత్రి నా
నుడివినయట్లు లూఁ యనుచు నోట వచించియుఁ దల్లిమాట నా
నెడఁద నయంబున న్నడుప నెంచును గా నిది కాదనంగఁ బో
డడఁకువ లేదు పెద్ద లన నాగడకాఁ డతఁ డేమి చెప్పుదున్ 12
క. పండితపుత్రుం డిల మూ
ర్ఖుండని పండితులు చెప్పుకొనువాక్యము నా
యొండగు పుత్రునియెడలన్
నిండుగ సత్యంబ యయ్యె నేఁటిఁ బరికింపన్. 13

—* మాధవుఁడు మిత్రునితో నాలోచించుట *—

తే. అని విచారించి తనమిత్రుఁ డైన మిత్రుఁ
బిలువఁ గా నంచి యంతయుఁ దెలియఁ జెప్పి
యిట్టిచోఁ గార్యతంత్రము నెట్లు నడుపఁ
బోలునో చెప్పు మనుఁడు నబ్బుధవరుండు. 14
ఉ. నీసతిసోదరుం డతనినిం గనినాతఁడు క్రూరు లిప్పు డే
దోసము నైనఁ జేయుటకుఁ దూకొన నుందురు నీ నెలంతయుఁగా

---

* మారుండు — ఇట మకరధ్వజుఁ డని చెప్పుకో వలయును.

రాసి వచించు వారలకు రచ్చల కెక్కఁగ వచ్చు నందునన్
మోసము సంభవించెడిని ముందు విచారము సేయ కుండినన్. 15

వ. కావున నోయిమాధవా! మనము వారికన్న మున్న క్రొన్నన నభియోగం బొండు తెచ్చుటయ పరమోత్తమంబు తత్ప్రకారం బెఱింగించెద నాకర్ణింపుము. 16

—♦ మాధవుని యభియోగము ♦—

సీ. తనసోదరునితనయునకు నాతనయ ని
మ్మనియోఁ గా దనుచు నే ననినమాత్రి
నాతోడఁ గలహించి నానెలంతుక పృథ
గ్భాండాశనము సేయఁ గా మొదలిడి
తనసొమ్ము లే గాక మునునాడు తాతతం
డ్రులు గడించినవెల్ల దోఁచుకొనుచు
మొన్నరాతిరి సగమునకుఁ బై నయినప్డు
చిమ్మచీఁకటిలోనఁ జెప్పకుండ

తే. బిడ్డలను దోడుకొని యిల్లు విడిచి తనదు
కన్నవారింటి కేగె నాకన్నబిడ్డ
లిద్వురకు శాస్త్రమునఁజేసి యోన కర్త
నగుట వారి నా కిప్పింపుఁ డనియు మఱియు. 17

చ. తలపరి సోముఁ డానిశను దారి నెదుర్కొని నానెలంత సొ
మ్ములను బరీక్ష చేసెఁ బ్రభుముఖ్యులు వాని నెఱింగి నాదు సొ
మ్ములను హరించినందులకు మున్మును శిక్షవిధించి నాకు సొ
మ్ములు నితరార్థముల్ ప్రజలు మోద మెసంగ నొసంగఁగోరుచున్.

* తే. నాదుకన్యక నీలోన నయను మాలి
యొరులకుం గట్టిపెట్టక యుండునట్లు

---

మారుఁడు – ఇట మకరధ్వజుఁ డని చెప్పుకోవలయును.

లాంక్షు విధియించి యుత్తరు వంప వలయు
ననుచుఁ బ్రార్థించుచుంటి నో మనుజనాథ. 19

వ. అనుచు న్యాయస్థానంబున నభియోగంబుఁ దెత్తుమని సంభాషించు
కొనుచున్న సమయంబున నొక్కభటుండు వచ్చి సమనుకాగితమ్ము
తెచ్చి మాధవున కిచ్చుటయు నతండు దానిం బుచ్చుకొని వాని
నంపిపుచ్చి మిత్రునిం గాంచి. 20

ఆ. సమను కాగితంబు చనుదెంచె న్యాయస
భాస్థలంబునుండి పండితేంద్ర
వినుత ! మనము వ్యాజ్యమును వేయుటకు నిట్లు
తలఁచుచుంటి మిట్టితరుణమందు. 21

క. వా రభియోగముఁ దెచ్చిరి
నైరంబునఁ జేసి సమను వచ్చెను వ్యాజ్యం
బేరీతి నుండెనో విను
మారంభించెదను జదువ నాద్యంతముగన్. 22

—✻ మాధవి దెచ్చినయభియోగము ✻—

సీ. పెరచవులం జిక్కి పెండ్లాముఁ జూడక
　　కొన్నినాళ్లలనుండి కూ్రరుఁ డగుచు
నాభర్త ధూర్తుఁడై నన్నుఁ జావం గొట్టె
　　నాతల్లి దండ్రులు నా కొసఁగిన
తాలిబొట్టాదిగా మేలిమినగ లెల్ల
　　లాగికొనియు నన్ను లాఘవముగఁ
బో పొమ్మనుచుఁ ద్రోచి పుచ్చె నే నొక్కతెఁ
　　జిమ్మచీఁకటి నెటు సేయుటకును
తే. దోఁప కేడ్చుచు నటు నిటు తూఁగు లాడు
చుండ నాకన్న పిల్లలఁ బిండిపెట్టె

అభియోగము - చార్జీ; ఆంక్షు - ఇంజంక్షను;

తెచ్చి పడవైచి పా మ్మెల్లఁ దీసికొనుచుఁ
పొమ్ము పొ మ్మని పడగెంటెఁ బోతరమున. 23

క. నే నాఁడుదాన నగుటన్
వానికి బదులాడ లేక భయమున నెట్లో
కాని ఏచింపఁగ లే నపు
డానిశ మాతండ్రియింటి కరిగితి నకటా! 24

క. తల బ్రద్ద లయ్యె నొమ్మున
జలజల రక్తంబుఁ గారె సంజ్ఞయుఁ జెడియెన్
గలిగెం బ్రాణాపాయము
ఖలుఁ డగుపతివలన నాకు క్ష్మాతలనాథా. 25

తే. నాశరీరప్రకారము నాశరిల్ల
నుండె నని యోగ్యతాపత్ర మొకండు రాజ
వైద్యునివలన గైకొని వచ్చి యిందు
తో నివేదించుకొంటి సోమానవేంద్ర. 26

శా. దాసీలక్ష్మియు నాదుబిడ్డలును నాతమ్ముండునుం దండ్రియున్
నాసాక్షుల్ తగ వీరి నీ వడిగి యే నానాథునిం దండితుం
గా సల్పం గలఁ వై మదీయము లలంకారంబు లిప్పించి నా
గ్రాసార్థంబు భృతిన్ దినంబును నిడంగాఁ దీర్పు నిప్పింపుమా. 27

వ. అని యిట్లు మాధవి తెచ్చినయభియోగం బని మాధవుండు చదివిన
న్విని నివ్వెఱపడి కొండొకవడికి మిత్రుండు మాధవునిదిక్కు
మొగం బై. 28

ఉ. మిత్రమ! చింతసేయకు మమిత్రులవారితలలోన నెన్ని యో
పాత్రతఁ గాంచనట్టి వెడసంస్తులు పెక్కులు వాని నింతలో
ధాత్రితలాధినేత యస్పృశంబు లటంచు నెఱుంగఁ జాలి నీ
పుత్రికఁ బుత్రు నీకు నిడుఁ బొ మ్మభియోగముఁ జేయ నీవునున్. 29

వ. అని మిత్రుండు పలికిన మాధవుం డతనితో న్యాయవాదికడకుం
జనియె నంత నక్కడ. 30

—✻ మాధవి బావను బెండ్లియాడుమని కూఁతునకుం జెప్పుట ✻—

ఉ. తల్లియు మేనమామయును దాతయుఁ దమ్ముడు తల్లితల్లియున్
దెల్లము గాఁగ నం దొక ప్రదేశమునందు సుఖప్రవిష్టులై
సల్లపనం బొనర్చుతఱిఁ జక్క మెలంగుచు నుండుమాలతిన్
దల్లి ప్రియంబునం బిలిచి దగ్గఱకు న్వచియించె నిగ్గతిన్. 31

ఆ. అమ్మ నిన్నుఁ గన్నయయ్య పో మ్మని నిన్ను
నన్ను గెంటి వైచె బన్న మయ్యె
నీకు నాకు నింక నీతమ్మునకు దిక్క
నన్నుఁ గన్నవారె కన్నమిన్న. 32

శా. నిన్నుం గన్నయ కొయ్య యాతనిపహ్రాది న్నిర్మించె గుండ్రాత నా
పన్నుం డావిధి నుంత యేనికృప తత్ప్రాంతంబునన్ లే దయో
నిన్నుం దమ్ముని నైనఁ బ్రేముడిఁ గన న్జిత్తంబుఁ గావింపఁ డే
మన్నన్ సైఁచియ యున్ననాదుగతి యి ట్లయ్యెం దలం పేటికిన్. 33

క. ని న్నొక్కముష్టికొయ్యకు
నన్నకసన యిచ్చి పెండ్లి సలుపఁ దలంచెన్
గన్నెరో! నా కది సమ్మత
మెన్నండును గాకపోయె నే మని యందున్. 34

తే. ఎప్పు డేవేళ నిను వాని కిచ్చి పెండ్లి
సేయునో తండ్రి యని యిట్లు చేయి దాఁటి
పోకయుండఁగ జతనించి నీకు మేలుఁ
గూర్పఁగా నెంచి యిటఁ దెచ్చికొంటిఁ దల్లి. 35

ఉ. నీ వొకభాగ్యలక్ష్మి వయి నిత్యశుభంబుల నొందుచుంటకున్
భావము సేయుచుణ్ణ సతము స్వాంతమునం దిటు భాగధేయవుం

జేవను దేఁగఁ జాలితిని జేసెదఁ బెండిలి నీకు నిచ్చటన్
బావకు నిచ్చి నీకుఁ గలవాంఛితముల్ సఫలంబు లయ్యెడున్. 36

క. మకరధ్వజుండు కేవల
మకరధ్వజుఁ డనఁగ నొప్పు మహీతలమందున్
సుక మనఁగ నీదె సుక మగు
నిఁక నీభాగ్యంబుఁ జెప్ప నేటికి బిడ్డా. 37

చ. రతి వలె నీవు మన్మథు నిరంతరముం గయిచేసి సంపదం
చిత వయి భాగ్యభోగ్యముల శేవధులుం గలదానవై మహో
న్నతిఁ గొని యుండఁ జూచుటకు నెమ్మది సేయుచు నుంటి మేను నీ
హితు లగు నెల్ల బాంధవులు నీముదుసళ్ళును మేనమామయున్. 38

వ. అనినం జెవులు మూసికొని హరస్మరణంబు సేయుచు మాలతి మాత కి ట్లనియె. 39

—✻ మాలతి తల్లిమాట నిరాకరించుట ✻—

చ. అకట కటా! సహోదరునియట్టిఁడు గాఁడఁటె మేనబావ వా
నికి మనధన్యమూర్తికిని నీమతి భేదము సేయ నొప్పునే
యొకయుదరంబునం దయితిరో కద నీవును నీదుతమ్ముఁ డి
ట్లొకఁడుగఁ బుట్టినట్టిరు సహోదరు లంచనఁ బాడియౌఁ గదే. 40

తే. తల్లిచెల్లెలికొడు కైనఁ దమ్ముఁ డనుచుఁ
దల్లితమ్మునికొడు కైన ధవుఁ డటంచు
నెంచు టది తగు నని నాదుహృదయ మొప్ప
దెన్ని చెప్పినఁ గాని యోకన్నతల్లి! 41

ఆ. ఆంధ్రదేశమందు నాచార మిట్లుండె
నంచు వేమొ దాని యందు నాకు
నమ్మకమ్ము లేదు నడవడి యది నేను
దగ దటంచు నెంచు దాన నెడఁద. 42

ఆ. ధన్యమూర్తి నాకుఁ దమ్ముఁడు మకరధ్వ
జుఁడు తలంప నన్న సుమి జనిత్రి
హితవు గాదు నాకు నింక నీ వీరీతిఁ
బలుకఁ బూన కమ్మ పాప మమ్మ. 43

ఆ. జాతిగుండెవాఁడు నాతండ్రి కూ్రరుఁడు
నన్ను ముష్టికొయ్య యన్నవాని
కీయ నుండె ననఁగ నే నెద నమ్మను
వానిఁ బోలువారు వసుధ లేరు. 44

వ. చెప్పెద సావధానచిత్తవై యాకర్ణింపుము. 45

—• మాలతి తండ్రిగుణంబు లభివర్ణించుట •—

సీ. జపతపస్స్వాధ్యాయచతురుండు వేద శా
స్త్రాదిక వివిధవిద్యా ప్రవీణుఁ
డఖిల విద్వన్మండలాఖండలుఁడు సత్య
వాచానిరూఢుఁడు వసుమతీంద్ర
వందిత చరణుండు వాణీమనోహార
వంశరత్నము జగత్పావనుండు
పరమకారుణ్య సంభరితాంతరంగుండు
బంధుప్రియుఁడు లోకబాంధవుండు

తే. ఏకపత్నీ వ్రతుండు ప్రజ్ఞాకలితుఁడు
సాధుసజ్జనవినుతుండు శాంతమూర్తి
సర్వసముఁ డుత్తమోత్తమచరితుఁ డట్టి
నాజనకు నిట్లు దూషింప న్యాయ మట్టె. 46

క. పతికన్న సతికి దైవము
క్షితితలమున వే ఱొకండు చెప్పఁగ లే దే
శ్రుతియును సతి వై నీ విటు
లతినీచునిఁ గాఁగ నతని నాడం దగునే. 47

మ. తనప్రాణంబుల నొక్కప్రాణముగ నన్ దా నెప్పుడుం జూచుచున్
దనవక్షస్స్థలమందుఁ బెట్టుకొని నానాశాస్త్రసత్సంప్రదా
యనిబద్ధార్థము లెల్లఁ జెప్పుచును దివ్యజ్ఞాన మేపాఱఁగాఁ
బొనరింపం గలఁడై కృపాళుఁ డగుచున్ బోషించు నన్నెప్పుడున్. 48

క. న న్నీ వన్నట్టులు సే
యు న్నెఱి విడనాడి యనుచు నుల్లము సేయన్
న న్నే మొ చెప్పి తెచ్చితి
విన్నగరికి నతనిఁ జూడ కే మనఁ జాలన్. 49

—* వసంతునకు వారంటు వచ్చుట *—

వ. అని పలికినం దల్లియుఁ దల్లివంకవారును డిల్లపడి తమయుల్లంబుల దానిమాటలు సరకుఁగొనక తమయుద్యమంబునఁ బరాఙ్ముఖులు గాక కాని మ్మిది వంటయింటికుందే లెందుఁ బోఁగల దవ్వలఁ దర్జన భర్జనాదుల నైనఁ గార్యసాధనంబుఁ గావించుకొందమని యుండి రంతలో న్యాయస్థానంబునుండి బంటు వచ్చి సమనుం దెచ్చి వసంతునిచేతి కిచ్చి తనవెంట నంటియున్న మిత్రనికతంబున మాలతి నెఱింగి నీమె కాంక్షఁ గావించితి నిదె యాంక్షాపత్రం బని చూపి మీపై నభియోగంబు వచ్చె న్యాయస్థానంబునఁ దన్నిర్ణయం బగు నంతకు నీమెకు వివాహము సేయ నొప్ప దని చెప్పె నప్పుడు మాలతి మిత్రునిం గాంచి దుఃఖించుచుం బఱచి వచ్చి వానిం గ్రుచ్చి కౌఁగిలించుకొని. 50

ఉ. మిత్రుఁడు లోకబాంధవుఁడు మిత్రుఁడ వీవును లోకబంధు వో
ధాత్రిసుపర్వవంశమణి! తావకదర్శనభాగ్య మబ్బుటన్
నేత్రయుగంబు చల్లఁబడె నేను గృతార్థను ధవ్య నైతి నా
పితృభితిః ప్రదేశము లభించిన య ట్లగు నామనంబునన్. 51

తే. రాజసేవకుఁ డపుడు వారంటునందు
నున్నమచ్చిన మాలతిన్ గన్నెమిన్న

మిత్రినిన్ వెంట నిడుకొని మేదినీశు
కడకుఁ గొనిపోయి యర్పించె నడకువ మెయి. 52

శా. న్యాయస్థానమునందు రా జపుడు నానాన్యాయవాదుల్ భటుల్
ప్రాయఃప్రక్రియ వ్రాయువారు నితరుల్ వాదుల్ ప్రతీకారులున్
రోయం జాలినసాక్షులుం బ్రబలి వారు న్వీరునుం గూడి కో
నాయాచోటుల వారివాదము వినన్ వ్యాహారముం జేయఁగన్ 53

—♦ న్యాయస్థానమునందు విచారణము ♦—

సీ. ఉభయవాదులవాద మొగి విమర్శింప నై
న్యాయవాదులు నిల్వ నట్టు నిట్టు
లాలుమగల్లపో రరయుపాంటెం బ్రజ
లెందఱో యిఱుకు గా నందు నుండ
నడుము విరియఁ గట్టి నలుమూలలందును
బిళ్లబంట్రొతులు కేకలిడు వారు
వారు వీరును జేయువాదముల్ ప్రభునకుఁ
దెలుప ద్విభాషులు మెలఁగఁ జెంత
తే. నున్నతాసనమునయందు నుండి న్యాయ
కర్త భూభర్త ధర్మరక్షణ మొనర్చ
చిత్తమునుఁ జేసి యీశ్వరచింతనంబు
సలిపి సర్వసన్నద్ధుండై సన్నగాఁగఁ
* ప్రాడ్వివాకులపైఁ గన్ను వైచె నపుడు. 54

వ. ఆసమయంబునఁ బ్రతిహారిసంప్రేషణంబున మాధవి వచ్చి ధర్మ స్థానంబున నిలిచి బాస చేసినపదంపడి న్యాయవాది నీ వేమి చెప్పఁ గోరెదవో చెప్పుకొను మనిన నామె మధుసూదనుం డను న్యాయాధిపతి దిక్కు మొగంబై కోపంబునం జేసి పాపంబు శంకింపక.

---

* ప్రాడ్వివాకులు – తగవరులు.

సీ. వెలిచవులం జిక్కి వెలఁది నన్ గాదని
తల పగులం గొట్టి ధవుఁడు నెట్టి
నాతల్లిదండ్రులు నా కొసంగిననగల్
పెనుకువమై లాగుకొనియు వెడలఁ
గొట్టి బిడ్డలతోడఁ బట్టి తోలె న్నేను
బ్రదికి యెట్లో కూడఁ బడితి నిట్లు
రాజవైద్యుఁడు మేనివ్రణములు వీక్షించి
వ్రాసి యిచ్చెను నభిప్రాయ మవుడు

తే. నానగలు నాకు నిప్పించి నాకు నాదు
బిడ్డలకు మనువృత్తినిం బెట్టఁ జేసి
కన్యపెండ్లికి విత్తము కట్టడ యిడి
వానికిన్ శిక్ష విధియింప వలయు నందు. 56

వ. అంత రాజేంద్రుండు రాజవైద్యుం బిలిచి నీ వేమి చెప్పెద వీమె దేహంబున దెబ్బ లీవు పరీక్షించితివా? యనిన నతండు తొట్రుపడుచు. 57

తే. దేహమందున దెబ్బలా? దేహమందు
దెబ్బలా? యంచు మిగుల సందేహముననుᱸ
గలిగి యుండెన్ మన మ్మది గళవళవడ
వినిన వారల కది వట్టి దనుచుఁ దోప. 58

వ. అంత మధుసూదనుండు మాధవశర్మం బిలిచి ధర్మపీఠంబున నిలువరించి ప్రమాణంబుఁ జేయించి యేమి చెప్పెదవు శైవముఖంబుఁ జూచి చెప్పు మనుటయు నతండు. 59

—• మాధవశర్మ వాఙ్మూలము •—

సీ. కలదాన నని గర్వకలన నన్ ద్వేషించి
దూషించి నాసతి తొలఁగె నన్ను

వెలిచవులం జిక్కి మెలఁగఁ గోవాఁడను
గా నాహితాగ్నిని గాని తేఁడ!
నా తండ్రితాతల సగలును దవనగల్
తనవెంటఁ గొనిపోయెఁ దండ్రికడను
దానిఁ గొట్టను లేదు తల పగులను లేదు
కాయమునన్ లేవు గాయములును

తే. * తలవరి పరీక్ష చేసె నాతరుణమందు
నాతనయ నుత్తముని కీయ నాతలంపు
తనదుతమ్ముని సుతున కీ దానితలఁపు
దాన నాతోడఁ గలహించి తరలి పోయె. 60

తే. కన్నబిడ్డలకుం గర్త యెన్నఁ దండ్రి
నాకొడుకు కూఁతు రెపుడును నాదుకడన
యుండ నొప్పెడుఁ గాన నోయుర్వినాథ!
వారి నా కిచ్చుటకు నాదుప్రార్థనంబు. 61

ఉ. అంతఁ దలారిసోముఁ డనుసాక్షి నిఁ బిల్వఁగఁ బంచి యిందు నీ
వెంత యెఱుంగుదో తెలుపు మేర్పడ నావుఁడు నాతఁ డిట్లనున్.
వింతగ నెల్లవారు విన వీనుల; నీయమ దాసి పిల్లలున్
సంతమసంబుఁ గ్రమ్మికొన శర్వరి సామయినంతఁగొంతలోన్. 62

క. నాదారిఁ దారసించిన
భూదేవతపత్ని నీమె పోలించియు నీ
వేదెస కేగెద వెవ్వతె
వో దాఁపక చెప్పు మిప్పు డోడని మదితోన్. 63

వ. అని నేను గద్దరించి పలికినంత. 64

---

* తెలారి, తలవరి - రాత్రిసంచరించు దొరతనంపుబంటు.

—♦ తలారి లోనగువారి సాక్ష్యము ♦—

క. ఈమెయు నప్పుడు నాతో
నేమియు దాపక వచించె నే నీమెకడన్
ఏ మేమి కలవొ చూచితి
నామెయి నే వ్రాసికొంటి నన్నియుఁ దెలియన్. 65

తే. కుండలమ్ములు పదకముల్ గండపెండె
రముఁను బంగారువస్తువుల్ రతనములును
శంకరునిపేర హరిపేర నంకితముగఁ
బెక్కు లున్నవి యీయమ్మపెట్టెలోన. 66

క. నావుడు రా జాతని కను
నీవెలఁదుకమేన నఱకు లేమేఁ గానీ
భావింప వచ్చునే యన
తే వని సోముఁడు వచించి లిఖితముఁ జూపెన్. 67

ఆ. దాసిలక్ష్మిఁ బిలిచి దానితో రా జను
నీమెపెట్టెలోన నేమి కలవొ
తనువునందు రక్తధారలు గాయముల్
కలిగెనో వచింపు కలికి నిజము. 68

చ. అనవుడు దాసిలక్ష్మి యను నయ్యా నిజంబు వచింతుఁ బెట్టెలోఁ
గనకము సొమ్ములున్ మణులుఁ గంకణము ల్మణినూపురంబు లా
చనియెడునాఁడు నాకడన చందుకలోఁ గల వామె మేన నె
త్తురును నఱకుల్ కనుంగొనఁగఁ దోఁపపు పాపము లాడ నేటికిన్. 69

వ. అనిన మధుసూదనుండు మఱియును 70

తే. కల్లతో మాధవుఁడు దీనిబుజ్జ పగులఁ
గొట్టె నని చెప్పుచుండి రీ వెట్టుచెప్పు
దో యనఁగ లక్ష్మి చెప్పెద నీయఁమతలఁ
బగులఁ గొట్టుట సత్యం బనఁగను దగదు. 71

తే. కూఁతు మాధవుఁ డొకని కీఁ గోర్కె సేయ
నీమ తనతమ్ముకొడుకున కీఁ దలంచె
దాన నించుక పొర లయ్యె దంపతులకు
నింత కెక్కువ యెఱుఁగ నే నింత యేని. 72

మ. కొడుకుం బిల్చి నరేశ్వరుం డనియె నీకున్ సాక్ష్యముం జెప్ప నొ
ప్పెడు నీవ్యాజ్యమునం దెఱింగినది నీపిత్రర్థముల్ దెల్పు నా
వుడు ధన్యం డను దల్లిదండ్రులకు నెప్డుం బోరె సిద్ధింప న
య్యెడు నొండొక్క రసాధ్యు లెవ్వరికి నేమే మే మనం బోలునే. 73

తే. తల్లి యేమేమొ యను దండ్రి దాని కింత
సైఁపఁ బోవక క్రోధంబు సూప నెంచు
దానఁ గలహంబు వారికి దాపురించి
పెఱిగి పెద్దదియై యిట్లు పరిణమించె. 74

వ. అనిన రాజి ట్లనియె. 75

తే. రక్తముం గార మర్దించి రవణములను
నీదుతండ్రి హరించుట నిశ్చయంబె?
చెప్పు మనఁ గ్రోధి యేమేనిఁ జేయు రవణ
ముల నెఱుఁగ నేను నాతండ్రి పొందె నేమొ. 76

వ. అనిన రాజు వెండియును. 77

చ. ఒకనికిఁ దండ్రి కూఁతు నిడ నుల్లము సేయుచునుండఁ దల్లి దా
నికి మది సేయ కాసుతను నెయ్యము మీఱఁగ దమ్ముకుఱ్ఱ కీఁ
గకవిక లై పడం దలఁచి కన్నను నిన్నను వెంటఁ గొంచు ద
ల్లికడకు వచ్చె నంచుఁ బొదలె న్నుడి సత్యము చెప్ప నొప్పెడిన్. 78

వ. అనినఁ గుమారుండు కన్ను లెఱ్ఱఁబడ మేను చెమరింప ని ట్లనియె. 79

చ. ముదుసలి తండ్రి ఛాందసుఁడు మున్ వెనుకల్ గమనింప నేరఁడొ
క్కదినము తిండికిం గఱవు గల్గి దరిద్రుల కాదిలెక్క కై

కుదిరినకూళ కయ్యానుఁగు గూఁతు నొసంగఁ దలంచెఁ దల్లి లో
నది సయిపంగఁ జాలక ధనాఢ్యుల కీయఁ దలంచు టొప్పదే? 80

మ. ధనవంతుం డెవఁ డన్నదుండియు వసంతస్వామి యన్ పేరు గాం
చిన మాతామహవంశమందు దనుజన్ జేర్పంగ మాతల్లి యెం
చినదానన్ మముఁ దెచ్చె నిచ్చటికి నీచె య్యోన్న మాయున్నకున్
మనమం దొప్పనిదంచుఁ దోఁచె నిది యేమో వారి వాదార్థముల్.81

—* మాలతి సాక్ష్యము *—

వ. అనిన విని ధర్మాధికారి ధర్మపీఠంబునుండి వాని దిగి పొమ్మని మాలతిం బిలువం బంచుటయు నంతలో నామె మిత్రునితోడఁ బేరోలగంబునకు వచ్చి యచ్చట నొక్కచోఁ దన్నుఁ జూచి కంట నీరుపెట్టుకొనుచున్న కన్నతండ్రిం గాంచి మొక్కలంబుగ నొక్క లంగ వానిచెంతకుఁ జని పైఁబడి వడిగ నేడ్చుచు. 82

క. నిన్నుం జూడక నే నిట
నన్నంబును నీళ్ళు మాన నై యడలుదు నో
నన్నుం జూడక నీ వట
నన్నంబును నీళ్ళుమాన నై యడలు దయో. 83

వ. అని తండ్రిం గట్టుకొని బెట్టువాపోవునక్కన్నియం దన చెంతకుం జేరం బిలిచి మధుసూదనుండు తల్లీ! ॥ ల్లడిల్లకుము భయంబు దక్క స్థిమితం బూని నే నడిగినవాని కుత్తరంబులు సెప్పుము నిన్ను నీ తండ్రి కప్పనంబు గావింతు నని యిట్లనియె. 84

శా. నీతల్లిం బ్రిహారించి నీదుపిత ని న్నీతమ్ముని న్వీధిలో
భీతిం గొల్పునిశీథినిన్ విడిచి తా విచ్చే సెసే లోబికన్
నీకోఁ జెప్పెనె? నీదుపెండ్లినుడుగుల్ నీతల్లి యె ట్లేని నీ
మాతృభ్రాతృకుమారునిం గొనుటకున్ మాటించె తె నీచిత్తమున్. 85

వ. అనినం గన్నియ నరనాథునిం గని. 86

తరువోజ.

నాతండ్రి నాతల్లి నలగింప లేదు నాతమ్ముని న్నను నడిరేయి వెడలు
రీతిఁ జేయఁగ లేదు రేకెత్తు కిన్క బ్రీతినై పెండ్లిపే ర్చెప్పలే దపుడు
భూతలేశ్వర నాకు పురుషుఁ డాతండు పోలండు నామామ పుత్రుఁడు గాన
భ్రాతఁ బోలినవాఁడు పరిణయమెట్లు? భావ్యంబు గా దని భావంబు నాకు.

తే. అనిన రా జను నోకన్నియా ! త్వదీయ
పితృచరిత్ర మెఱింగించి పిదప నామె
వెడలఁ గొట్టుట లోనగువిషయము లవి
నీ వెఱింగినచోఁ దెల్పు నిక్క మిపుడు. 88

వ. అనుటయుం గన్యకయు. 89

తే. ఏకపత్నీవ్రతుండు ప్రజ్ఞాకలితుఁడు
సాధుసజ్జనవినుతుండు శాంతమూర్తి
సర్వసముఁ డుత్తమోత్తమచరితుఁ డైన
నాజనకుఁ డాగ మొనరించు నాఁగ నగునె? 90

తే. ఇద్ధచరితునకు న్నన్ను నీయ నెంచెఁ
దండ్రి దానికి నొల్లడు తల్లి దానఁ
గలతమైఁ గల్గెఁ గలహంబు కాని యాతఁ
డామెఁ బరిహరించె ననుట సత్యంబు కాదు. 91

మ. వెడలం గొట్టెను మాధవుండు సుతతోఁ బెండ్లాము నం టొప్ప ద
క్కడ నున్నం దనకోర్కె వమ్మగుచుఁ బోకల్ గల్గు నం చెంచి యి
క్కడకున్ వచ్చెను వచ్చునప్పు డెవియో కల్పించి వ్రాకుచ్చి నా
కెడమై యుండినతండ్రిఁ జూచుటకుఁ బో నీ దాజ్ఞ యీనాఁటికిన్.

వ. అని చెప్పిన నమ్మనుజేంద్రుం డమ్మా! మీయమ్మ మఱి యొక్కప్పు
డైన నిన్నుఁ బెండ్లికిం బ్రోత్సహించెనా? తద్వృత్తాంతంబు సవిస్త
రంబుగం జెప్పు మనిన బాలిక యి ట్లనియె. 93

"క. నిన్నొక్క ముష్టికొయ్యకు
సన్నకసన యిచ్చి పెండ్లి సలుపఁ దలంచెన్
కన్నరొ! నా కది సమ్మత
మెన్నండును గాక పోయె నే మని యందున్. 94

తే. ఎప్పు డేవేళ నిను వాని కిచ్చి పెండ్లి
సేయునో తండ్రి యని యిట్లు చేయి దాఁటి
పోక యుండఁగ జతనించి నీకు మేలుఁ
గూర్పగా నెంచి యిటు తెచ్చికొంటిఁ దల్లి! 95

ఉ. నీ వొకభాగ్యలక్ష్మి వయి నిత్యశుభంబుల నొందు చుంటకున్
భావము చేయుచున్ సతము స్వాంతమునం దిటు భాగధేయపుం
జేవను దేఁగఁ జూచితిని జేసెదఁ బెండిలి నీకు నిచ్చటన్
బావకు నిచ్చి నీకుఁ గలవాంఛితముల్ సఫలంబు లై తగన్." 96

వ. అని యెన్నో మాతల్లి చెప్పినది చెప్పినప్పుడు నేఁ జెవులు మూసి
కొని శివస్మరణంబుఁ జేయుచుం గొన్ని మాటలు చెప్పి. 97

ఆ. ధన్యమూర్తి నాకుఁ దమ్ముఁడు మకరధ్వ
జుండు తలఁప నన్న సుమి జనిత్రి!
హితవు గాదు నాకు నింక నీ పీరితిఁ
బలుకఁ జూడకమ్మ! పాప మమ్మ. 98

వ. అని చెప్పితిని. 99

—※ రాజు చెప్పిన తీర్మానము ※—

సీ. అని మాలతీకన్య తనసాక్ష్య మీ రీతిఁ
జెప్పిన భూమీంద్రుఁ డొప్పి యితర
సాక్షివిచారణాద్యఖిలమున్ విడిచితిఁ
దీ ర్పొసంగెద నిష్ఠ నే ర్పెసంగ
వెలిచవులం జిక్కి పెండ్లామునుం గొట్టి
నగలు హరించి పోవఁగ నొనర్చె

మాధవుం డనియెడుమాట యసత్యము
వైద్యుఁ డొసంగినవ్రాఁత తప్పు
తే. సోముఁడు తలారి యారాత్రి చూచి వ్రాసె
భర్తృభూషలు గొని భార్య పాఱిపోయె
దాసి సత్యము వచియించెఁ దనయుఁ డమ్మ
మీఁదిపేరిమ ననత్యమే పోరిది చేసె. 100

ఉ. కూఁతురు కన్నతల్లి యని కొంచెము నే మది నెంచఁ బోక యే
రీతిని దల్లిదండ్రుల కరిత్వము గల్గెనో యెల్లకార్య మే
రీతిని జెల్లెనో సకలరీతులును న్వివరించి సత్యమున్
బూతవచఃప్రసంగతులఁ బోహణ చేసి వచించె నెంచఁగన్. 101

క. కావున మాధవువాదము
కేవలము న్సత్యసరణికిం దగి యుండెన్
జేవం గల్పించిన దై
భావింపఁగ నయ్యె సుదతివాదం బరయఁగా. 102

తే. సొమ్ములు హరించి తనభర్త దిమ్మదిరుగ
నేసి యిలు వాపె నని వాని యెల్లసొమ్ము
లును హరించెను దానికి వనజముఖికి
నొక దినము శిక్ష జరిమాన యొక్కనూఱు. 103

తే. మఱియుఁ దలవరి వ్రాఁతలో మనకుఁ దెలియు
మాధవునిసొమ్ములెల్ల నమ్మానధనుని
కప్పనము సేయున ట్లితం డతివభృతికి
నేకరూపిక దినమున కిచ్చు నట్లు. 104

తే. శాస్త్రమునఁ జేసి తండ్రికి సంతతియెడఁ
గలుగు నధికార మది గానఁ గన్నతల్లి
ననుకొనక బిడ్డలం దెచ్చి తనవిభునకుఁ
జెలి సమర్పణముం జేయ వలయు నిపుడ. 105

మత్త. రాజునన్నము నారగించుచు రాజవైద్యుఁ డితండు నాఁ
డేజు గాంచినవాఁడు కాలము తీఱియుండినవాఁ డిటన్
రాజు గల్గు నటంచుభీ విడి వ్రాసి యిచ్చెను దప్పవ్రాల్
రాజదండన మొంద నష్టుఁ డరాతిపూరుషుఁడుం బలెన్. 106

తే. వానియుద్యోగ మార్నెలల్ వదలుకొనెడు
నట్లు నిర్మూరురూప్యము లచ్చియున్న
యటు పరిభుత్వమునకు నిచ్చునట్లు కఠిన
శిక్ష విధియించినాఁడ నే నీక్షణమున. 107

వ. అని తీర్మానము వ్రాసి మాధవునకు మాలతీధన్యవరులాని నెల్ల వస్తువులు నిప్పించి కొలువు సాలించి చనియె మాధవుండును మిత్రుని తోడం గూడి నిజవస్తుభూషాదికంబును నందనులం గైకొని నిజ గృహంబునకుం జనియె నంతఁ గుమారుండు తండ్రికడ నుండ నిచ్చ గింపక తండ్రిం గాంచి. 108

—♦ కొడుకు తండ్రిని విడిచి తల్లికడకుం బోవుట ♦—

మ. నెల లార్మాఁడును మోసి నన్నుఁ గని యెన్నేఁగష్టముల్ బొంది నా
కెలమిం గూర్చుచుఁ బెంచి మంచినతల్లిఁ బీక్షింప కే నిందు వ
ర్తిలఁగా నేరను దల్లి పిమ్మట నె యేదేవళ్ళ నేతండ్రి! నీ
సెల వైనన్ విడనాడి సర్వమును బోఁ జిత్తంబుఁ గావించితిన్. 109

ఆ. అనినఁ దండ్రి యిట్టు లను నర్భకుఁడ వీవు
విడిచి పితృ మవలఁ గడు వగతువు
కానఁ జెప్పుచుంటిఁ గష్టంబులకు బాలు
పడకు మెఱుఁగ వీవు బుడుత వగుట. 110

మత్త. లేదు కోపము నీపయి న్నిఁకళించిపుచ్చుచునున్న న
న్నెదియుం దెలియంగ నేరఁడు హీనబుద్ధి గలాఁడు తా
నే దినంబులు వోయినప్పుడు నేని సద్గుణవంతుఁడై
నాదుచిత్తము నంటి పోయెడు నల్వురు న్వచియించుటన్. 111

క. అగ్నిసాక్షిగ నుంగ్రసనసత్యము
లను బలికితి న్యాయసభను ల్రాంతి తెలియగున
న్నను గర్హించితి వైన
న్నిను విడనాడంగఁ దలఁప నిక్కము తనయా! 112

వ. అని తండ్రి పలుకుచున్న సమయంబున మాలతి తమ్మునిం గాంచి యి ట్లనియె. 113

—* మాలతి తమ్ముని మందలించుట *—

ఉత్సాహము. ఆఁడుబుద్ధి యగుటఁ జేసి యమ్మ యొంటి జెలుంగ లే
దాడి పోసి వాసి పోయె నమ్మగారియింటికిన్
నేఁడు పొంగి పోవఁగాదు నిత్యదుష్టు లైనవాం
డ్రేడ యీమె కచట సాఁగు లేడ రెండునాళులే. 114

ఉ. అమ్మకు సాఁగ దక్కడ దినార్ధము నేనయు నింతలోన నే
నమ్మతిఁ జేసి వచ్చి మనచక్కికి నిక్కము చెప్పుచుంటి నో
తమ్ముఁడ! నాదుమాట విను తండ్రినిఁ బాసి గమింపఁ బోకు మే
యమ్మయు నింతకూడు నిడ నక్కడ నుండదు నీకుఁ జెప్పితిన్. 115

తే. పితృపితామహార్జిత మయి వృద్ధ మయిన
ధనము నీవశమున నుంచు జనకుఁ డీవు
నీకుటుంబము దిన శ్రితలోకమునకుఁ
బెట్టఁ జాలుదు నీ కింత వెఱ్ఱి యేల. 116

ఉ. తమ్ముఁడు పెండ్లి యాడి కులధర్మముల న్నెఱవేర్చుకొంచు సౌ
ఖ్యమ్మున నుండి పుత్రులను గాంచి గృహస్థుఁడు నై వెలుంగుచో
నిమ్మహి నెల్లవారలు ననేకవిధంబుల మెచ్చుచుండ నే
నమ్మతిఁ జేసి వచ్చి మది సంతస మందఁ దలంపు సేయుదున్. 117

ఉ. మాఱట లక్ష్మిమ్మయో యనెడు మాటకు వచ్చినకన్నె మిన్న నీ
యూరికి నింతిదప్పవన యుండినయూర వసించు మేటి నీ

కీరహీ నీయఁ జెప్పి చనె నేము వధూటినిఁ జూచి వత్తు మా
సారసనేత్రఁ బెండ్లి యయి సంసృతిసౌఖ్యము నంద నుండుమా. 118

వ. అని యనేకవిధంబులం జెప్పుచు బుజ్జగించి బోధించిన నతండు
వారిమాటలు సరకుఁగొనక తనదు సర్వస్వమ్మును విడిచి వడి వడిం
దల్లికడకుం జనె నంత మాధవుండును. 119

—♦ మాధవుండు మిత్రునిసకుటుంబముగ నింట నిల్పుకొనుట ♦—

తరళ. సహకుటుంబము గాఁగ మిత్రు నజస్రముం దనయింటిలో
బహుళగౌరవ మేర్పడం గొని వచ్చి నిల్పుకొనంగ నా
సహజసన్నిభుఁ డైనమిత్రుఁడు సర్వకార్యములందు న
న్వహ మభిజ్ఞత మై చరించుచు వాసిఁ గాంచెఁదదిష్టుఁడై. 120

ఉ పద్మిని నాఁగ బేర్పడినభామిని మిత్రునిధర్మపత్ని త
త్పద్మమునందు మాధవవిచక్షణు నన్నఁగ నెంచి సర్వదా
ఛద్మము లేని వర్తన మెసంగఁ బొసంగినభక్తి యుక్తి వా
త్పద్మమునన్ భజించుచును వాస మొనర్చెను దాను బిడ్డలున్. 121

మ. అపు డామాలతి చెంతనే మధుకరాఖ్యాకుండును న్మల్లియున్
గృప దళ్కొత్తఁగ నుండుటల్ దెలిసి తండ్రి న్మెచ్చుకొం చెప్పు డ
వ్యపదేశస్థితి వారితోఁ గలసి విద్యావ్యాసకత్వంబులన్
సుపరిష్కారములం బొనర్చుకొనుచున్ శోభిల్లెఁ దెల్లంబుగన్. 122

తే. మల్లికామధుకరులతో మాలతి కడు
నెనరునం జేసి మెలఁగుచు ననిశము గురు
వులను దమయింటి కరుగుదే సలుపుకొనుచుఁ
దగఁ గఱచె నెల్లవిద్య లనుఁగులఁ గూడి. 123

—✻ మాలతి విద్యాభ్యాసము ✻—

మ. ఉరము న్మోయఁగ నేటవాలుగను వామోద్యంగకాంసంబుపై
శిరము న్నిల్పి యితస్తతశ్చలనముం జేయించుచున్ హస్తముల్

సరిగాదిస్వరసంవిధానమున నాలాపంబు రాగంబులన్
బరఁగన్ మంగళగీతము ల్మగువ దా వాయించు జంత్రమ్మునన్. 124

మ. చతురత్వంబున రక్తి నుక్త మొదలాషడ్వింశతిచ్ఛందముల్
ప్రతివారంబును బ్రిస్తరించి తెలియన్ భావించి వృత్తాకృతుల్
సతి సాహిత్యము మేలు మే లని కవుల్ వర్ణింప సర్వేశ్వరుం
బ్రతిపాదించుప్రబంధముల్ సలిపెడుం బద్మాస్య పద్మాస్యనాన్. 125

చ. గరితలు చుట్టువారుఁగొనఁగాఁ గొని కేలఁ బురాణ మొందు నీ
శ్వరుని గణేశునిం బలుకుచానను వేఁడి యనంతరంబ భూ
సురముఖవర్ణధర్మములు సూర్యముఖామరసర్గమున్ జగ
త్సరణియు సజ్జనాళిచరితంబుఁ బఠించి వచించు నెప్పుడున్. 126

వ. ఇ ట్లిల్లవారికి నెల్లవిధంబుల నల్లారుముద్దుగా నెసంగు నామాలతి దయాసత్యశౌచనిరతయు గురుజనభక్తి భరితయు నై నిరుపేదల నాదరించుచు దిక్కుమాలిన వారి కొక్కలాగున దిక్కుఁ గల్పించి పోషించుచుఁ గలంనైనం గలుషంబులం బొరయక సకలజనసంస్తవనీయచరితయై వర్తించుచు గురుల సేవించుచుఁ దండ్రికిం దలలోని నాలిక నా ననుసరించి చరించుచు నిరతంబుఁ దనమనంబున. 127

—* మాలతి మధుకరుని ప్రేమించుట *—

సీ. పున్నమచందురుఁ బోలు మొగమువాఁడు
తొవల కీడగు కన్నుఁదోయివాఁడు
కరుణారసం బొల్కఁ గలహృదయమువాఁడు
వివిధవిద్య లెఱింగి వెలయువాఁడు
పంచమస్వరమునఁ బాడ నేర్చినవాఁడు
కవికులతిలక విఖ్యాతివాఁడు
శాంతస్వభావుఁ డీశ్వరభక్తి గలవాఁడు
క న్నెత్తి పెరకాంతఁ గననివాఁడు

తే. బుద్ధిమద్వరుఁ డెప్పుడు నాపొంత నుండి
చదువుచుండెడువాఁడు నాహృదయవర్తి
నన్నుఁ బ్రేమించి మధుకరుఁ డున్నవాఁడు
వానిఁ బ్రేమించి నే నున్నదాన నెపుడు. 128

ఆ. నవ్వుమొగమువాఁడు నయనంబులం దళ్కు
దంతపఙ్క్తి బెళ్కు కాంతిలోన
మెఱపు మెఱసినట్లు మెఱమెఱలాడు మేన్
పరిమళించుజాళువా పసిండి. 129

మ. అతనిం గాక మ తెవ్వనిం గనఁగ నే నాశింపఁ దత్కార్యమం
దితరు ల్విఘ్నము సేయఁ బూనినను లో నింతేని శంకింప నే
నతఁడుం గూడిన నెవ్వరిన్ సరకుసేయం బ్రాణముల్ దీయ నా
గతమై యుండిన కాలసర్ప మెదురం గా నోడ నొక్కింతయున్. 130

క. నాకాయ మతని కప్పన
గా కొరులకుఁ గాదు నాకుఁ గలసౌఖ్యంబుల్
వాకొనియెద నతఁడే యని
లోకమునన్ దైవ మతఁడె లోఁ దలపోయన్. 131

వ. మాలతి యిట్లు ప్రవర్తించుచున్నంత. 132

—✻ మధుకరుఁడు మాలతిని వరించుట ✻—

మ. బడికిం బోయెడునాఁటినుండియు మదిన్ బాలామణి న్మాలతిన్
గడు ప్రేమించి మధువ్రతుండు మెలఁగుం గా నెప్పు డెవ్వారి కే
ర్పడ నిచ్చ న్వెలిబుచ్చఁ డే మగునొ యిట్యత్వంబు లేనట్టిదన్
బడుచుం దండ్రిలు భాగ్యవంతులకు నీ వాంఛింతు రన్చింతమై.

సీ. మాధవుచిత్తంబు మాలతీకన్యక
మధుకరునకు నిచ్చి విధివిధమునఁ

బెండ్లి సేయఁగ నెంచుఁ బిన్నతనమునుండి
మిత్రునకును వానిమెలఁతుకకును
మాలతి కోడలుగా లభించిన భాగ్య
మబ్బిన ట్లని కల దాశయంబు
కన్యకాపరులకుఁ గలకాలముననుండి
కలిగియుండినవాంఛ తెలియఁగ నగు

తే. మానవులయత్న మీరీతిఁ గానఁ బడును
దైవచింతన మనుకూలతం దగిలిన
మాలతీమధుకరులకు మహా మెసఁగుట
నిశ్చయం బని యెంచుట నీతియ కద. 134

వ. ఇట్లు మాలతీకన్య ప్రవర్తిల్లుచున్నంత మాధవుండు తనమనంబున రానున్నవసంతంబున మాలతీమధుకరులకు వివాహమహోత్సవంబు సేయ నిశ్చయించుకొని యుండె నని చెప్పిన శ్రోత లవ్వలి వృత్తాంతంబుఁ జెప్పు మని కథకు నడుగుటయును. 135

ఆశ్వాసాంతము.

గ ద్య ము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ,
వేదవిద్యావిశారదాది బిరుదవిరాజమాన
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిప్రణీతం బయిన
మధుకరవిజయం బనుప్రబంధంబునఁ
ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు

# మ ధు క ర వి జ య ము

## తృ తీ యా శ్వా స ము

వ. అక్కథకుండు శ్రోతలకిట్లనియె నట్లు మాధవశర్మ మాలతిని మధు
కరున కిచ్చి వివాహంబు సేయ నిశ్చయించి యున్నసమయంబున. 1

—* వసంతర్తువర్ణనము *—

మ. చిరకాలాప్తవనాంగనావిరహముం జిత్తంబునం సైఁప లే
కురుసంతాపమును న్నోలార్చుటకు నై యొండొక్కచో నుండి స
త్వరుఁడై సర్వవరూధినీసహితుఁడై ప్రద్యుమ్నుడుం దోడు రా
సరగన్ మాధవుఁ డేగుదెంచి కదిసెన్ క్ష్మామండలం బంతటన్. 2

సీ. మావిపూఁదేనెల మత్తిల్లి యళిగాయ
కాళి సుస్వరముల నోలిఁ బాడె
శుకశారికాది సచ్ఛకునసంతానమై
తాళికాళి ఘనశబ్దములఁ బలికెఁ
జివు రాని జివ గల్గి చిఱరవంబున వన
ప్రియకోటి కాహళిఁ బ్రీతిఁ బట్టె
ఱెక్క లల్లార్చుచు నొక్కొకటఁ గోలఁకుల
హంసకాంతాళి నాట్యంబు లాడె

తే. అట్టి యామని సంతస మావహిల్ల
మన్మథోత్సాహజనకుండు మాధవుండు
సొగసులకు నెల్లఁ దానక మగుచు నెపుడు
వెలయుచున్నట్టి వనలక్ష్మిఁ బెండ్లియాడె. ౩

ఉ. కమ్మనిమానిపూవులను గాలువఁ గట్టెడు తేనె లాని జుం
జుమ్మని తేంట్లు పాడెఁ గడుసొం పలరారఁ జిగుళ్ళు మేసి కో
కొమ్మని గండుకోయిలలు గూసెను జిల్కలు గోరువంకలున్
ముమ్మఱ మైన పండ్లు దిని మొత్తముగా వగఁ బల్కె నత్తఱిన్. 4

వ. అట్టివసంతాగమంబున మాధవుం డొక్కశుభముహూర్తంబు కార్తాంతిక వినిశ్చయంబునఁ గావించి తత్తదుచిత సంభారంబు లెల్ల సమకట్టుకొనుచుండె నవ్వృత్తాంతంబు చారులవలన విని యక్కడ వసంతుండును దుండియును మకరధ్వజుండును ధన్యవరుండును మాధవియు నొక్కవివిక్తస్థలంబునం గూరుచుండి కార్యాలోచన తత్పరులై యుండి రయ్యవసరంబున మాధవి వసంతుని దిక్కు మొగం బై. 5

— * మాధవి తనవిచారమును వెలిబుచ్చుట * —

ఉ. ఓరి వసంత నీ వనిన నుర్వి చలించెడు నంచు విందు నీ
పేరు స్మరించుకొం చిటులు వెంగలి నై చనుదెంచి యిగ్గతిన్
గారియ నొంద నైతిఁ గద నల్వురలోపల నవ్వుఁబాట్లు నా
కారయ నయ్యె రాజసభయం దటు దండిత నైతి నక్కటా. 6

క. ఏ మొగముతోడ నే నీ
భూమండలమందు దుండిపుత్రిక ననుచున్
నా-మమున మెలఁగఁ గలనో
నామనికత మెల్లఁ గలసె నష్టేట నయో. 7

ఉ. పోలఁగ వచ్చె నీదయినపూరుషతాబల మెల్ల నయ్యయో
జీలుగుబెండు వంచు నినుఁ జెప్పక చెప్పెడి లోకు లెంతకున్
జాలినసారముం గలఁడు సాహసవంతుఁడు మీవసంతుఁ డం
డ్రాలిలి యెల్ల వ్యర్థమయి యాఅడివోయె నిఁ కేమి చెప్పుదున్. 8

మ. ధనవంతుల్ బహుధాన్యవంతులును మేధావంతులు న్నేను బు
ట్టినవంశంబున నున్నవా రనుచుఁ బాటిం దప్పి భాషింతు నా

మనమందుం గలగర్వ మంతయును నిర్మాల్యంబ మై పోయె నే
నానరింపం గలకర్జ మెద్దియును లే కుండెం గదా యిం కిటన్. 9

క. నిను నమ్మి నీదుసుతునకుఁ
దనుజాత నొసంగ నెంచి ధైర్యం బెసఁగన్
గొని వచ్చి యుంటి నర్థము
చనియె న్సర్వస్వ మేమి సలుపుదు నింకన్. 10

ఆ. కూఁతుతోడ ధనముఁ గొల్లఁగొట్టె నతండు
చెప్పినట్లె నాకు శిక్ష పడియె
నామనోరథంబు నాయుద్యమంబును
నేటఁ గలసె నింక నేమి యందు. 11

వ. అనిన లజ్జించుచు వసంతుం డక్కలికి కి ట్లనియె. 12

—♦ వసంతుండు మాధవితోఁ బ్రసంగించుట ♦—

శా. ఈ వె న్నన్నను వాని కన్నిఁటికి నే నీ డోఁట కన్గొండ నే
దైవం బగ్గతి నుండె దాని నెవరుం దప్పింప లే రైన నిం
దే వాచించెద నాదుదోష మిసుమంతే లేమి నిక్కం బగున్
నావాక్యంబుల నాలకింపుము మది న్వర్జించి క్రోధం బిటన్. 13

తే. మనము తెచ్చినవ్యాజ్యము మంచిగతి నె
పొంది యున్నది కాని నీపుత్రికయును
దాసిలక్ష్మియు సాక్ష్యముం దగుఁ బెట్టె
మనకుఁ బ్రతికూలముగఁ జెప్పి రన నగుఁ గద. 14

వ. అది య ట్లుండ ని మ్మంతమాత్రన వారి కాధిక్యంబును మనకు న్యూనతయును వచ్చి యుండు నని యూహింపకుము నీసహోదరుం డిపుడు నీ వనినట్లు గాక సర్వసంతుష్టుం డని యెఱుంగుము నీయభిమతం బేమియో యెఱిఁగింపు మెఱింగి దానికిం దగిన తెఱంగునం బ్రవర్తించెదు నని నమ్ము మనిన నయ్యమ్మ యెండియు. 15

—* మాధవి తన మనోరథము చెప్పుట *—

సీ. సకుటుంబముగ మిత్రు సదనంబునం బెట్టి
　　　మన్నించుచుండె నామాధవుండు
　దాని కుత్సర్గముం బూని చేయుట కాక
　　　వానిపుత్రుని నష్టుఁగా నొనర్చు
　టయు మాధవునిఁ బట్టుటయుఁ దద్ధనం బెల్ల
　　　లలి హరించుటయు మాలతినిఁ బట్టి
　తెచ్చి నీకొడుకున కిచ్చి పెండిలి సేయు
　　　టయు నీవు చేయంగ నయినపనులు
తే. ఇట్లు చేసిన నాయుల్ల మింత శాంతి
　నొందు నవ్వల మల్లిక నందనునకు
　ధన్యునకుఁ బెండ్లి సేయంగఁ దలఁపు గలదు
　నాఁగ నో సనియె వసంతనాముఁ డపుడు.　　16

వ. అంత దుండి కూఁతుం గాంచి　　17

క. నీశోకఁబుట్టు నలంతిగఁ
　జేశోపీథిం దలంపు చేయుదు వాతం
　డేతీఱుఁగ జెప్పం గ్రియ
　లాతీఱుఁగఁజేయఁ జాలు నని యెఱుఁగు మదిన్.　　18

వ. చెప్పెద నాకర్ణింపుము.　　19

మ. మనయన్నంబును దించు నున్నజన మీమాత్రంబు గా దేను జె
　ప్పినఁ బ్రాణంబుల నైన వీడను నిట న్వీక్షించుచుండంగ నీ
　మనమందుం గలసర్వవాంఛితములుఁ మానొందఁగాఁ జేసి నిన్
　ఘనసంతోషసముద్రమందు మెలఁగం గావించు నిక్కంబుగన్　　20

వ. అంత ధన్యవరుండు తల్లి కి ట్లనియె.　　21

మ. జనకుం డంచు నొకింత సంశయమునన్ సాఁగించితి న్నాళ్ళు నా
　జననిం జిక్కులపాలుచేసి సకలస్వంబున్ బరాధీనమై

చనఁ గావించి పరిత్యజించె నను వాంఛంజేసి ప్రేమించిన
ట్లు నటించెన్ సుత లేనిదేబెలకు నీ లో నెంచె నాతం డయో. 22

ఆ. అతని నెట్లు వేసి యైన నాచెలియలిఁ
దెచ్చి మేనబావ కిచ్చి పెండ్లి
మనము చేసి దానిమనికి రక్షింపంగ
వలయు ననుచు నిట్లు పలుకుచుంటి. 23

వ. అనునంతలో మకరధ్వజుండు వచ్చి యెల్లను విన నిట్లనియె. 24

—✻ మకరధ్వజుండు తనయుద్యమం బెఱింగించుట ✻—

శా. నామేనత్త కుమార్తె నా కిడుటకున్ సంకల్పముంజేసి న
న్నే ము న్వెంటిని గాని దాని పయి నా కిష్టంబు లేకుండె నే
నీమాడ్కి న్వచియింప లే దెవరి కేదె ట్లానో యన్ బుద్ధినై
మీమాటల్ వినినంతనుండియును నామీనాక్షిఁ గాంక్షించితిన్. 25

చ. మఱి యొకమాటఁ జెప్పెదను మాలతి నన్ గ్రహియింప నిష్టతన్
దొఱఁగి సుధాకరాహ్వయునితోఁ జెలిమిం బొనరించి వానినే
పరిణయ మాడ నెంచె ననుపల్కు చెవిం బడినంతనుండి యే
వెరవున నైన దానిఁ గొని పెండిలియాడఁగ నంటి వింటిరే. 26

మత్త. అత్తచిత్తమునందుఁ గల్గినయట్టికోరిక లన్ని నే
నిత్తఱిం జని యొక్కరుండన యెన్నియేనియుఁ బన్ని య
మ్మత్తకాశినిఁ బెండ్లియాడెద మాను కెల్లవిధంబులం
జిత్తశాంతి యొకింత లే నటు చేసి వచ్చెదఁ జెచ్చెఱన్. 27

తే. తాలిఁ గట్టియు దానికిఁ దగినశాస్తి
చేసివచ్చెదఁ దల్లిపై నీసుఁ జేసి
తండ్రిపక్షమ యై నాదుదగుల మొల్ల
కలుసు చేసినదాన నాపలుకు వినుఁడు. 28

ఈవెన్నన్నను – నీవెన్నియన్నను;

వ. ఇట్లుందఱు సన్నిచందంబులం బలుకుచున్నంత వసంతుండు లక్ష్మిం బిలువ నంచి నీవు మాదాసి వయ్యును మాపక్షంబునకు వ్యతిరేకముగ సాక్ష్య మిచ్చితివి కావున నీకు శిక్ష విధించుట లొప్పు నని శిరోముండనంబుఁ గావించి దీనిన్ విడిచితి మేని మన రహస్యంబు లెల్ల వెల్లడించు నని శృంఖలాబద్ధం గావించి యొక్కచో విజనస్థలంబునం బెట్టించె నంత వా రెల్లఁ దమతమకార్యంబులకుం జని యుండి రిట్లుండ నక్కడ నొక్కనాఁడు మల్లిక పరిచర్య సేయు చుండ మాలతీమధుకరు లిరువురుం గవితాగోష్ఠిం దవిలి యుండి రప్పుడు. 29

—• మాలతీ మధుకరులకడకు జ్యోతిషికుండు వచ్చుట •—

సీ. నీర్కావివస్త్రంబు నెఱిమీఱఁగాఁ గట్టి
భస్మత్రిపుండ్రముల్ పరఁగఁ దాల్చి
రాంకవం బొండు శిరంబునం జుట్టి వే
ఱొండు భుజంబుపై నొప్పఁ దాల్చి
వలకేలఁ దాటియాఁ కుల గ్రంథము ధరించి
పెరకేల గొడుగు పై వేసికొనుచుఁ
గుండలంబులకాంతి గండస్థలంబుపైఁ
బర్వ దంతపుమెట్లపావలు దొడి
*తే. చట్టు లెందఱో తనవెంటఁ జుట్టినడువ
శాంతరస ముట్టిపడునట్టి చందమునను
నాతపంబున వచ్చుట నలసి సొలసి
నట్టిదై పురుషుం డొక్కఁ డట్టె వచ్చె. 30

ఉ. వచ్చిన వానిఁ గాంచి భయభక్తులతో నెదు రేగి తెచ్చి వా రచ్చటఁ జిత్రనిర్మిత శుభాస్తరణం బమరించి నిల్పి మీ

* చట్టులు – విద్యార్థులు; రాంకవము – సాలువు;

రిచ్చట విశ్రమింపుఁ డని యింతటిలోపల నర్ఘ్యపాద్యముల్
గ్రచ్చఱఁ దెచ్చి యిచ్చుటయుఁ గైకొని యాతఁడుఁ గూరుచుండుడున్.

తే. తాళవృంతముఁ బూని యామాలతియును
మధుకరుండును మల్లిక మఱియు మఱియు
విసరి విశ్రాంతి కలిగించి విప్రవర్య!
మీర లేదేశమునుండి చేరితి రిట. 32

శా. ఏయేవిద్యల మీర్ ప్రవీణు లిట రా నిష్టార్థమే మానా పే
రేయత్యుత్తమవర్ణముల్ గలదొ మా కేర్పాటు గాఁ జెప్పుచున్
మాయందున్ దయచేయ రే యనుఁడు నామాన్యుండు విశ్రాంతుఁడై
శ్రేయం బేర్పడ దీవెనల్ సలిపి యాగీతి న్వచించె న్వగన్. 33

తే. మెలఁగుచుందుము కాశ్మీరములను మున్ను
నిపుడు కాశ్యాదితీర్థము లెల్లఁ దిరిగి
కృష్ణుసేవించి పోనంగ నిచ్చఁ జేసి
వచ్చినార మిచ్చటికి నో బాలురార. 34

* శా. నా పే రీశ్వరశర్మ జ్యోతిషమునన్ బ్రజ్ఞాన మెంతేనియుం
రూపింపం దగి యుండె నాకు ధరణీందుల్ లాంకవంబు ల్మహా
ద్వీపాంతర్భవరత్నహారములు సందీపించు కేదారముల్
నాపట్టం గలప్రజ్ఞకుం దనరి సంధానించి రెన్నేనియున్. 35

చ. మధుకర! నీవు మాలతియు మల్లికయున్ సుఖులై వసింతురే!
బుధులకడన్ భవత్ప్రతిభ పాల్పడునట్లు కవిత్వసంపదన్
గథనముఁ జేయుచుండితిరె! కాంచ మాల వచించినట్లు స
ద్విధివిహితంబుగాఁ గళలు తేటపడం బొనరింతెరి చిత్రముల్. 36

ఉ. మల్లికపద్యమందు యతి మంచిది కా దని నీవు వల్క నీ
పల్లవపాణి లక్షణము పాఱఁ గనుంగొని పాదీ యంచునుం

---

* రాంకవము=సాలువు : కేదారము = వరిచేను;

జెల్లెడు నంచునుం దెలియఁ జెప్పి సఖుం బొదలించె నన్న నా
యుల్లము పల్లవించె నొహహొహో యని మాలతి మెచ్చె నిచ్చమై.

క. ప్రేమించె నిన్ను మాలతి
ప్రేమించితి వీవు దీని ప్రియు లిద్దఱు మీ
ప్రేమలకు నంతరాయం
బేమాత్రము కలుగకుండ నెసఁగుత మెపుడున్. 38

వ. అనిన నిర్వాఱపడి వారు వానిజోస్యంబు మెచ్చుకొనుచు సంశయించు
చుండి రప్పు డీశ్వరుండు వెండియును. 39

శా. నాజోస్యంబున వేరు సంశయము నొందం బోల దీసందునన్
మీజోడు న్విడఁ దీయునిచ్చమెయి నేమేఁ దంత్రిముం బన్ని నీ
కాజీవుం డనువాఁడు చెప్పినను డుల్ స్వాంతమ్మున న్నమ్మి నీ
వీజాంబూనదగాత్రితోఁ దెలిపి త ద్దేమయ్యె నీచెయ్దముల్. 40

—* జోసి మధుకరునికి సర్పగండము చెప్పుట *—

క. అని మాలతిపైఁ గ న్నిడి
వనజానన నీదుగతికి వగ పయ్యెడి నే
మని చెప్ప నోరు విప్పదు
ననఁ బోయిన నాకె దుఃఖ మయ్యెడు నయ్యో. 41

వ. అనిన మాలతి కడుంగడుఁ బరితపించుచు నయ్యా నీమాటంజేసి
నాయుల్లంబు తల్లడించెడిని నాకు రానున్న విపత్తు నాతోడం బోయి
నది యైన దాని కంత చింతింపం బని యుండదు. కాని యది
యొండు తెఱంగు గా నుండునో యని గుండెలు కొట్టుకొనుచున్నవి.
చిత్తంబు తత్తఱించుచున్నది. నోట మాటరాకున్నయది కన్నీరు
మున్నీ రగుచున్నయది. కన్నతండ్రీ ! నాకది యెట్టిదో యెఱుంగం
జెప్పి నాయుష్షుఁ దీర్పం గలవాఁడ వైనం దీప్పు మని ప్రార్థించుచున్న
దాన నని జాలింబడి పలుకుచున్నమాలతిం గని యీశ్వరశర్మ
యి ట్లనియె. 42

ఉ. రాఁగలకీడు మేళ్ళకుఁ గరంబుఁ దలంకుచు గుందు టొప్పునే
యోగియు నైన సంచితము నొందెడు నెల్లరుఁ గర్మబద్ధులై
రాగము గల్గి వేఁగెదరు రాజముఖీ! మన కైనకర్తృతల్
సాఁగవు సాఁగుచుండెడిని సర్వము దైవముపేర్మి పెంపునన్. 43

ఆ. కాక మనము వగచి కావించునది లేదు
గాన వగపు మాని నేనుఁ దెలియఁ
జేయునంశ మెల్లఁ జెవి యొగ్గి విని ప్రతి
క్రియ యొనర్పఁ జూడు మయసుఁ దలఁచి. 44

మ. అయయో! యే మని చెప్పుదు న్మధుకరాఖ్యాకుం డితం డింతలోఁ
బ్రియ మొప్పన్ విహరించుచుండెడుతఱిన్ మృత్యూపమంబై విలే
శయ మొక్కం డరుదెంచి కాటు వయిచున్ జచ్చెన్ క్షణార్థంబులో
నయముం దక్కె నిజంబుఁ జెప్పితిని నావ్యాహారము న్నమ్ముమీ. 45

ఆ. అనుచు నుడువ నామె హా! పరమేశ్వరా
యనుచు నఱకినట్టియరఁటి వోలె
నేలఁ గూలె మల్లికాలతాంగియు దుఃఖ
భారమున మునింగె హారు మనుచు. 46

—♦ మాలతి చింతింప మధుకరుఁ డూరార్చుట ♦—

క. మధుకరుఁ డించుక మాత్రము
వ్యధఁ జెందియు సేదఁ దేర్చె బాలామణులన్
వృథగా మీ రిటు దుఃఖము
న ధరం గూలుటలు పోలునా? తలపోయఁగా. 47

వ. మాలతిన్ లేవ నెత్తి శైత్యోపచారంబుల సేదఁ దేర్చియిట్లనియె.

మ. పురుకుత్స ప్రభుతుల్ ధరాతలము సంపూర్ణప్రభావంబునన్
బరిపాలించి యెడల్ త్యజించి దివముం బాలింపఁగా నేగి రో
క్కరుఁడున్ శాశ్వతవిష్ణుకల్పకముగాఁ గన్పట్టిరే! నేల్లపై
వరకీర్తిం జనువారు చచ్చియును జావం బోవ రెప్పట్టునన్. 49

చ. తెలియఁగ నెంతవారు నిలఁ ద్రెళ్ళిర కాని యొకండు మిత్రిక
న్నుల మనఃబ్రాన్తిమి పొల్పుటఁగనుంగొనియే వినియే మెఱుంగ మీ
పొలిసెడు నంతయుం గనియు బూమె లెఱింగియు నుట్టిగట్టి యు
య్యెల లిటు లూఁగుచుందు మని యెంచుట వెఱ్ఱితలంపు కాదొకో.

పంచ. పిపీలికాద్యజాంతమై పరివృత్తమై యెసంగునీ
ప్రపంచ మీశ్వరేచ్ఛమై రవంతలో నివృత్త మా
నుపాయ మెద్దియేని పన్ని యొక్కజంతువేని పృ
థ్విపైఁ దిరం బెసంగుచుండ వింటిమే నెలంతుకా. 51

క. కావున నాకై శోకము
భావంబున విడుము నీవు బాల్యమునందే
నావంకఁ బ్రేముడించితి
నేవా రెటు లన్న దీని కే ముదితుండన్. 52

క. ఈయెడ లిప్పు డెట్లైనన్
నాయాత్మ యి దెక్కడుండినం గాని సఖీ
నీయాత్మ నంటి యుండిన
దే యని వగ పుడిగి యుంట కే నర్థింతున్. 52

చ. మఱియొక మాటఁ జెప్పెదను మానవకోటికి మేనఁ బ్రాణము
ల్వాఱలెడునంతదాఁక సకలం బనుభూతము గా నెసంగుటల్
కరము హితంబు ధర్మ మగుఁ గావున నాదుప్రబోధనంబు నే
మరక వివాహ మాడినను మామక చిత్తము సంతసించెడున్. 54

ఉత్సాహము. వలచి యున్నవాఁడు మేనబావ వాని కీయ నీ
తలి తలంపు నన్ను వలచి తద్విధాన మంతయున్
వెలలఁ ద్రోచి తిప్పుడు నన్ను విడి వాని కాల నై
యిల సుఖించుచుండు మంచు నే వచింతు నుగ్మలీ. 55

వ. అనిన నప్పలుకులు ములుకులై చెవులు నాడిన ట్లయిన మాలతి
గుభుల్లున నేలంబడిమూర్ఛ మునింగె నంత మల్లికయు మధుకరుండును

గరంబు శైత్యోపచారంబులు సేసి తాలవృంతంబుల విసరు చుండి రంతలో మెల్లన మేలుకాంచి లేచి కూరుచుండి కంటికిం గడవెడునీళ్లుగా వలవల వలపోయుచు మధుకరుని దెస దృష్టి నిగిడించి.

—♦ మాలతి మధుకరునిమాటలకు దుఃఖించుట ♦—

ఆ. అయయొ గోరుచుట్టుపయిని రోఁకటిపోటు
పడినయట్లు నీదు పలుకు లయ్యె
జోసిపలుకుబడిని శోకించున న్నిట్లు
చంపఁ బాడి యగునె? సదయహృదయ. 57

ఉ. తొల్లిఁటిజాముననం దయినదోషమొ పుణ్యమొ చెప్పఁ జాల నా
యుల్లము నీపయిం బడియె నొండొకవానిపయిం బడంగఁ బో
దెల్లజగంబు సాక్షిగను నే వచియింతును నీవుఁ ద్రెళ్ళినన్
ద్రెళ్ళుదుఁ గాని నే బ్రదికి దేబెల నొండ్లను గట్టుకొందునే. 58

వ. అని వెక్కి వెక్కి వెక్కసంబుగాఁ బొక్కుచున్న సమయంబున నయ్యార్తరవంబు విని మాధవుండును మధుకరుని తల్లిదండ్రులును వచ్చి మల్లికవలన సర్వము నెఱింగి గొల్లుమని రోదనము సేయు చుండి రప్పుడు మాధవుం డీశ్వరశర్మ చెంతకుం జని. 59

—♦ మాధవుం డీశ్వరశర్మతోఁ బ్రసంగించుట ♦—

చ. ఎఱిఁగినవాఁ డొకోఁ యనఁగ నేర్పడుచుంటివి నాదుకంటి కే
ధరణి వసించుచుండెదవొ దాఁపక చెప్పుము నీదుజ్యోత్స్న మే
సరణిది? సర్పదష్టుఁ డయి చచ్చు మధుప్రతుఁ డంటి వంట యె
త్తెఱఁగులు చూచి నీ వటులు తెల్పితొ తెల్పుము పండితోత్తమా!

ఆ. అనుడు నాతఁ డనియె నయ్య నే నెవఁడనో
తెలిసికొనక యిట్లు తెగి వచింపఁ
దగునె? నే వసించుధరణి శ్రీనగరము
నన్ను మీరు చూడ రెన్నఁడేని. 61

సీ. నీభార్య గయ్యాళి నిరతమును న్నిన్నుఁ
　　గోసిపెట్టుచునుండు దోసకారి
కలవారిబిడ్డ నన్ గరువంబున న్నిన్నుఁ
　　గా దని తనకన్న కన్నె మిన్నఁ
దమ్ముని సుతున కీఁ దలఁచె నీతలఁ పది
　　చెల్లకుండఁగఁ జేయుఁ జెల్లుబడిని
దండ్రియున్ దమ్ముఁడు తమ్ముని తనయుండుఁ
　　గడుసమర్థులు నీకు నిడుమ లిడఁగ

తే. నీ వొనర్చినదానికి నిష్కృతివలన
నీకుఁ బ్రతిసేయ నెంచిరి నీకొమరిత
నెట్టులే నెత్తుకొనిపోవ నెంచినారు
చెప్పితిని జాగరూకత నొప్పు మెలఁగ.　　62

వ. అని యొప్పఁ జెప్పి యిప్పు డీసర్వంబు విషయంబుఁ జెప్పెద వినుండు.

శా. పారాశర్యములోని వాక్యముల నేఁ బల్మారు వీక్షించి త
త్సారంబెల్ల గ్రహించి చెప్పితిని సత్యంబుం బ్రదర్శించునా
చారంబుం గలవాఁడనై వితిగ నస్మద్వాక్య మై పోవుటల్
వేషం జూచి యెఱుంగ రీజగమున న్వోయేటికిం జెప్పఁగన్.　　64

తే. రాఁ గలయనర్థములకు శాస్త్రములు చెప్పు
శాంతు లందున నేదేని శాంతి దీని
కగునో యని సర్వశాస్త్రము లరసినాఁడఁ
గాన వచ్చెను గొన్ని నిక్కముగ గావా.　　65

వ. నిశ్చయించి పలుకం జాలఁ గాని తద్విధిం బ్రవర్తించిన నీమధు
కరుం డు మృతికిం దప్పి పో వచ్చునని మఱియు వానినామమునుంబట్టి
మఘాదిక గుణించి విజ్ఞానం బభినయించుము.　　66

—♦ జోషి నీలకంఠుఁ డను యోగి వచ్చుననుట ♦—

ఉ. నేఁటికి నేడునాళ్లపయి నీలగళుం డనునొక్క యోగి మీ
చోటికి నింగినుండి చనుచుం జనుదెంచెడు సిద్ధుఁ డాతఁ డే
మాటలొ చెప్పి మంత్రములమాడ్కి నొనర్చి మధువ్రతున్ జగ
న్నాటకసూత్రధారి యయి నల్వురు మెచ్చ గ్రహించి మించెడున్. 67

ఆ. నీలకంఠయోగి నేర్చెను గశ్యప
బ్రహ్మ కజుఁ డొసఁగినపరమమనువు
దానఁ దక్షకాహిదగ్ధవృక్షము పుట్టి
పెఱిఁగె మధుకరుండు పరఁగుదాన. 68

క. వ్రతములు జపములు తపములు
సతతముఁ గావింపుఁడు దగ సత్రమునందున్
స్థితి కగు నస్త్రీకుని సం
చితగతిఁ బూజింపుఁ డెగ్గు చెడి శుభ మెసఁగున్. 69

వ. అని చెప్పి మిత్రునిం గని నోరు మెదలుపుచు వ్రేళులు లెక్కపెట్టు
కొనుచు నవల నీకు రానున్న దినంబు లనర్థదంబులు దానికిం బ్రతి
క్రియ నీలకంఠయోగి నడిగి యతండు చెప్పిన చొప్పునం జేయుము.
నా కనుష్ఠానావసరంబుఁ గావున నేను బోయి వచ్చెద నని సహ
శిష్యుండై వారి నామంత్రించి యమునాద్వీపవతీ తీరంబువైపునకుం
జనియె నంత నిక్కడ మిత్రప్రభృతు లెల్లరు నల్లకల్లడంపడుచుండిరి
మాలతి యనశనవ్రతంబు పట్టె నట్టియెడ మాధవుండును. 70

—♦ మాధవుఁడు శాంతికస్వాస్తికంబులు చేయించుట ♦—

సీ. పూర్ణదీక్షలతోడఁ బూజలున్ వ్రతములు
జపములు తపములు సలిపె మిగుల
గ్రహశాంతులును నవగ్రహశాంతులున్ దివ
స్ణమస్కృతులు చేయించె మఱియు

వేదపారాయణ విప్రార్చనాదులు
శర్వాభిషేకముల్ పర్వఁ జేసె
రామాయణాదిపారాయణములు విష్ణు
సాహస్రినామముల్ చదువ నిలిపె

తే. అనుదినంబును సర్వపూజాదికమును
గరుడపూజయు నస్త్రిక పరమపూజ
రేయిఁ బవలును విడువక వేయిమంది
ఋత్విజుల నెలకొల్పి చేయించె నపుడు. 71

వ. ఇట్లు దేవపూజానమస్కారాదులు జరుగుచున్న కాలంబున నొక్క నాఁడు మధ్యాహ్నసమయంబున నందఱు నాకాశంబున శబ్దంబు విని చూచుచు. 72

—* నీలకంఠుఁ డాకాశమునుండి దిగి వచ్చుట *—

సీ. అల్లదె చూచాయ నభ్రమండలమున
మెఱుఁగులపోఁ వేమొ మెఱయుచుండు
మెఱుఁగులపోఁ యైన మెఱమెఱ లాడెడుఁ
జంద్రోదయం బగుజాడ యేమొ
యది పట్టపగఁటింటఁ బొడలెడునే తెల్ల
మ బ్బిట దిగి వచ్చుచుచ్చు దోఁచు
నా కల్లలాడనియపు డేల దిగి వచ్చు
వినువాక తెఱఁ దేరు ఫేన మేమొ

తే. ఫేనమును గీనమును గాదు మేనినిండఁ
బండువెన్నెలఁ బుజుణించు భస్మ మలఁది
దిగుచునున్నాఁడు చూడుఁడీ దివ్యపూని
యొక్కఁ డదె తేజు దిక్కులఁ బిక్కటిల్ల. 73

తే. లాతవుంగోల కకపాల భూతిపూత
నాగబెత్తము మందులఁ దోగుపాత్ర
మొరిమ గసిపట్టు జడచుట్ట యోగపట్ట
మరయ వరయంగ దోఁచెడి నదిగొ కనుఁడి. 74

వ. అని యందఱు నన్నిచందంబులఁ బ్రశంసించుచుండ విమానంబుడిగ్గి యొక్కసిద్ధుండు మాలతి మధుకరు లున్న సభాస్థలంబునకుం జను దెంచుచు నెదురుపడి స్వాగతంబు పలుకుమాధవునిం గని నీపేరు మాధవశర్మగాదా ? నే నిపుడు నీకుఁ గాఁబోవునల్లునకుం గలుగఁ బోవునావడిని విని కని పోవచ్చితి నే ననంతపురవాసిని నాపేరు నీలకంఠయోగి యనిన నెల్లరు వానిపాదారవిందముల కభివందనం బాచరించి రపుడు మాధవుండు ప్రత్యుత్థానాభివందనంబులు సమ ర్పించి సుఖాసనాసీనుంజేసి యర్ఘ్యపాద్యంబు లొసంగి యిట్లనియె.

చ. మునివర జోసి యీశ్వరుఁడు మున్న సమాగతుఁడై వచించె మీ ఘనతర యోగశక్తి యది కన్గొన నయ్యెడు మాకు నమ్మహా ముని చనుదెంచి "మీ కిపుడు పొంపిరివోయెడు నార్తివోఁ గృపం గనియెడు నంచు" ధన్యులమె గా భవదీయసమాగమంబునన్. 76

క. జోసి సమర్థుఁడు వృద్ధుఁడు
వీసమునే నతనిమాట వీసర వో దో
భాసురమతి నీహృదయం
బాసాధువు హృదయ మొక్కఁ డని యెన్న నగున్. 77

తే. అనిన నాయోగి యను జోసి యనఁగ నెవ్వ
రో యనుచు మున్న సందేహ మొందినాఁడ
శ్రీనగరవాసి యతఁడు నాశిష్యవరుఁడు
దైవవిద్యామ్యుఁ డరయ నాధునికుఁడు. 78

తే. అతఁడు నాకడఁ జదువుట నతఁడె నేను
గా మెలంగుచు నుంటి మెక్కరణిఁ గాని

మా కడన్ భేదభావ మేమనుజుఁ డైనఁ
దలఁప జ లఁ డటంచు నేఁ దలఁతు నిపుడు. 79

వ. అని యంత లోన. 80

క. ఏడీ మధుకరుఁ డిచటికి
రాడేమి యటంచుఁ బలుకు రా నాలోనన్
మోదుప్పుఁగో ల్వాలంబునఁ
గూడం జనుదెంచి యతఁడు కోదుగక మ్రొక్కెన్. 81

వ. అంత నాతం డతనిశిరంబుపై గరంబుఁ బెట్టి నీవు చిరంజీవి వగుదు వని దీవించి మాధవాదులం గాంచి మాజోసి చెప్పిన సర్వంబు తేటంగఁ జెప్పెద వినుం డని యి ట్లనియె. 82

—* సర్పవృత్తాంతము *—

సీ. అల్కపై బుసకొట్టి నాల్క లాడ్చుచు నున్న
వినతాసుతున కైన వెఱపు పుట్టు
గినుక ఘట్టినయేని వెనుక ముం దరయక
పెట్టుఁ దోఁకపై నిట్ట నిలుచుఁ
గాటు వైచినయేని మేటిపర్వత మైనఁ
గనుచుండ నీ అయి కఱఁగి పోవు
మెలి పెట్టు చింతలోపల వాయువేగము
పర్వంగ నేలపైఁ బాఱుచుండుఁ

తే. గాలకూటము కన్నను గాలవహ్ని
కన్ననుం దానివిష మెన్న మిన్న యగుచు
సర్వనాశన మొనరించు క్షణములోనఁ
గృష్ణనాగాంగ మాసరీసృపవరంబు. 83

శా. నేఁడే వీనికి మృత్యువాసరము రానే వచ్చె సర్పంబు నా
పాదుంగొన్యైను జూచుచుంటి నదె యీపర్యంతవల్మీకమం

దాడుం గాన మధువ్రతుండు ధరపైఁ దా నంఘ్రిల న్మోప రా
దీడన్ వాని విమానమందుఁ గొనిపో నెంతు న్నభోవీథికిన్. 84

వ. ఇట్లు సేయుట మీకు మంచి దని తోఁచినయెడ నట్లు చేసెద
ననిన నెల్లరు నో మ్మని సమ్మతిం బలికి రవుడు మధుకరుండు తల్లి
దండ్రులకును మాధవునకును మాలతికిని మల్లికకుం బోయి వత్తు
నని చెప్పి విమానం బెక్కి నీలకంఠుడును విమానంబుపైఁ గాలు
వెట్టుచు నే నీబాలు ననంతపురంబునం గల నాయాశ్రమంబు
నకుం గొనిపోయి వీనికిగారుడమంత్రం బుపదేశించి యొక్కపక్షంబు
లోనం దెచ్చి యిచ్చెద మీ రింతయును జింతింప కుండు నది
యని మిత్రునిం జేరఁ బిలిచి నీకు నీకుటుంబమునకుం దీఅనికష్టంబు
రా నున్నది నీవు నాకుఁ బూర్వజన్మంబున సోదరుండవు గావున
నీయందలి ప్రేమమునంజేసి చెప్పుచుంటి నని చెప్పి నే నిపుడు
కార్యాంతరవ్యగ్రుండ నై పోవుచుంటి నాశిష్యుండు పింగళకుం
డనువాని నీకడకుం బుచ్చెద వాఁడు చెప్పినచొప్పునం జేయు మని
విమానం బెక్కి మరఁ దిప్పు నంతలో నది మీఁది కెగసె నప్పు
డెల్లరు దానిం దిలకించుచు. 85

—♦ నీలకంఠుఁడు మధుకరుని గొనిపోవుట ♦—

సీ. గాలియోడ యనంగఁ గదలుచు నేలదా
పుగ నీదులాడుచుఁ బోవుఁ బయికి
ఱెక్కలుం గాళ్లును ముక్కునుం దోఁకయుఁ
గలిగి గరుడపక్షి గతి గమించు
గాలిపడగ నాఁగ నోలి గింగురు వుట్ట
నంతరిక్షంబున గంటి పఱచు
స్తనయిత్నువులదరి దాఁ పయి నల్లని
పురువునాఁ గనుదోయి కరయ వచ్చు

తే. అంతరిక్షమునం దంటి యవ్విమాన
మదిగొ చూడుఁడు మేఘసముద్రములయందు
సనుచుఁ బలుకుచు నుండ మాయమ్మ యగుచుఁ
గానరా కుండెఁ జూపఱుకన్నుఁ గవకు. 86

వ. విమానగతుండగు మధుకరుండు నీలకంఠునిదిక్కు మొగం బై
నివ్వెఱంబడుచు నాహా! యీదేవయానము. 87

చ. కనకమణీగణద్యుతులు కన్నులకున్ మిఱుమిట్లు గొల్పుచున్
ఘనతరకింకిణీధ్వను లఖండములై దివ మెల్ల మ్రోయ నె
మ్మనమున కైన వేగమున మానసవీథికి నబ్బురంబుగాఁ
గనుఁగొన వచ్చె నచ్చటను గన్గొన నెన్నఁడు నిట్టిచిత్రముల్. 88

మ. కడుదూరంబున నుండుటం గసవునాఁ గన్పించెడిన్ వృక్షముల్
ముడిబంతుల్ బలెఁ బోలఁదోఁచెడి మహాభూధ్రంబులున్ జూడ మి
న్నెయ్యెడ నభ్రం బటు కానవచ్చు నది నీ వేమందువో కాని యె
ల్లెడల న్నిండెడినీరువామి యని యే నెంతున్ మహాత్మా! మదిన్. 89

క. భూజనులు చీమల్ట్లులు
రాజిలుచున్నారు గోపురంబులు గుడులున్
రాజగృహంబులు బొమిడిక
లో జగతికి నాఁగఁ దోఁచు లోకస్తుత్యా. 90

ఆ. చూచి చూడరాని చొప్పున నిది తప్ప
పాటుఁగోన దేశభాగములను
దాఁటి గాలికన్న మేటివేగంబున
నేగు నిట్టుచూడ మెన్నఁడేని. 91

వ. అట్లు కుమారుం డాకాశం బంటి పోయిన యనంతరంబ మిత్రుండు
దుఃఖాక్రాంతచిత్తుం డై. 92

చ. కొడు కరిగెన్ దివంబునకుఁ గొంచెములోపలఁ గాన వచ్చుటల్
జడునకు మందభాగ్యున కసంభవ మింకిట నేను మేనిలో

నిడి కొని ప్రాణవాయువులు పృథ్విపయి న్నిలుపంగఁ జాల నో
బుడుతఁడ! నేను వచ్చెదను భోకము పోకుము మీఁదిమీఁదికిన్. 93

వ. అని పత్నిం పట్టుకొని పుడమిం బడి మూర్ఛిల్లెఁ బత్నియుం జచ్చిన మచ్చిన జచ్చవడి వెట్టిచూపునం జూచుచుండె. మల్లిక కంట నీరుఁ బెట్టుకొనుచుఁ గల్లిఁదండ్రిల నాశ్వాసించుచుండె మాల తియు మాట లేక మరణోద్యోగంబున నుండి మనఃకాంతు నుద్దేశించి. 94

—✻ మాలతి దుఃఖించుచు వనశనవ్రతము పట్టుట ✻—

సీ. తనకు విజ్ఞానము జనియించినది మొదల్
నామీఁదఁ బ్రేముడి నాఁట నిలుపు
ననుఁ జూడకుండ నెన్నఁడుఁ గాని తనయింట
నిలువఁడు నామీఁద నిలుపు నుసుఱు
బడికి న న్గొనిపోవుఁ బ్రత్యహంబును వచ్చి
రాకున్నఁ గారము నాకుఁ జెప్పు
నేను దినకయున్నఁ దానును దిన నని
వ్రతము పట్టినవాఁడు నుతచరితుఁడు

తే. నన్నుఁ బ్రేమించి నీతండ్రి నా కొసఁగిన
నిన్నుఁ బెండ్లాడుదు నొసంగకున్న నేను
బ్రహ్మచర్యవ్రతంబును బట్టియుందు
ననుచు శపథంబు పట్టె నాప్రాణవిభుఁడు. 95

ఆ. నేను నిన్నుఁ గాక పైఁ నేరినిం బెండ్లి
యాడ నన్నమాట కతఁడు సంత
సించి పొంగిపోవు నెంచ ని ష్టి ట్లయ్యె
నేమి సేయుదాన నేది దిక్కు. 96

ఆ. అరిగె దివికిఁ గొమరుఁ డనుచు నస్సీలము
పలికెఁ దండ్రి తాను బలికినట్లు

మరల నతఁడు వచ్చి మనకంటఁ బడునది
వట్టిమాట యనుచు వగతు నేను.

మత్త. కాలసర్పము కాటువేసినఁ గాలధర్మము నొందెడిన్
బాలకుం డని బీతునం బెరవాని బాఱికిఁ జిక్కి పో
నీలలిం బొనరించి రిందఱు నేమిసేయుదు నింక నా
శీలవంతునిఁ జూచుభాగ్యము చెప్పఁ జాలని దయ్యోఁ బో. 98

ఆ. ఇట్లు పోకకన్న నిచ్చటం జచ్చిన
మేలు వానితోడ మేము చచ్చి
యిట్టిదుఃఖ మంద మే మందు నా ్రబదు
కిట్టు లయ్యెఁ గట్ట! కట్ట! కట్ట! 99

వ. అని ప్రాణత్యాగంబునఁ గృత నిశ్చయ మై యుండె నప్పుడు మాధ
వుం డెల్లవారి నూరడించుచు దుఃఖోపశమనంబు సేయుచు లేవఁదీసి
కూరుచుండంజేసి మిత్రుంజూచి సంబోధించుచు నిట్లనియె. 100

—* మాధవుండు మిత్రాదుల నూరార్చుట *—

చ. చదివితి వేదముల్ మఱియు శాస్త్రములున్ సకలప్రపంచమున్
విదితము నీకు నేలఁ బ్రభవించిన జంతువు లెవ్విగాని మే
నది విడనాడ కున్న యవి యూరయ వచ్చునె? నీదునందనుం
డిదె చనుదెంతు నంచుఁ జనె నింతటిలోపలఁ జింత యేటికిన్. 101

వ. అని యందఱ నూరార్చి గృహకృత్యంబులకెసం బోవువారిగ నొనర్చె
వారును మధుకరుం డొక్కపక్షంబులోనం దప్పక వచ్చునని దురా
శంజేసి కొన్నినాళ్ళు గడవనీదుచుండి రప్పుడు మాలతియును. 102

సీ. జలకమాడుట మాని కలప మలందుటం
దలఁపక యన్నపానములు విడిచి
కవితయుఁ జిత్రలేఖనమును విడనాడి
గాంధర్వ మనుమాట కడకుఁ ద్రోచి

సర్వదా పల్యంకశయనంబు చేయుచుఁ
బవలు రేయియు నిద్రఁ బరిహరించి
పలవరించుచు సారె నులికిపడుచు మధు
కర ! మధుకర ! మధుకర ! యటంచుఁ

తే. బలుకు గొనుచును గంట నీ ళ్లొలుక మాటి
మాటి కుహ్హా యనుచు నూర్పు మలయుచుండఁ
గనులు మోడిచి మృత్యువున్ మనమునందుఁ
బెట్టుకొని నన్నుఁ గను మని వేఁడుచుండు. 103

ఆ. కనులు మోడ్చి వలపుకాని లో నిడుకొని
యతఁడు వచ్చె ననుచు నట్టె లేచి
కవుఁగిలింపఁబోయి కన కేమియును హారు
మనుచు నేడ్చె నీళ్లు కనుల నుఱల. 104

క. గ్రహ మావేశించినగతి
స్పృహ యింతయు లేక వెక్కి వెక్కి వనరుచున్
దహతహపడుచున్ గన్నీర్
బహుళంబై జాలువాఱ బమ్మెఱిలెఁ గడున్. 105

—♦ మిత్రాదులకడకుఁ బింగళకుఁడు వచ్చుట ♦—

వ. ఇ ట్లున్నసమయంబున నొక్కనాఁడు సాయంకాలంబున నీలకంఠ స్వామి చెప్పినచొప్పున నొక్కకాషాయాంబరధారి పద్మినీమిత్రులు పరితపించుచున్నచోటికి వచ్చి నేను బింగళకుండ నని త న్నెఱింగించు టయు వారు వానివృత్తాంత మంతయుం దెలిసి వానితోడ మాలతీ మల్లికామాధవు లున్నచోటికిం జని పింగళకుని నివేదించుటయు మాధవుండు వానిం గాంచి యి ట్లనియె. 106

తే. నీలకంఠయతీంద్రుఁడు నిన్నుఁ బుచ్చె
నోయి ! నీవు పింగళకుండవా ? యతండు

మాకు నే మని చెప్పఁగా నీకుఁ జెప్పి
పుచ్చెనే ! యన నయ్యోగిపుంగవుండు. 107

మత్త. ఏను బింగళకుండ వచ్చితి నిట్లు మాగురునానతిన్
బూని మీాకు వచింపఁగాఁ దగుబూా మె లెన్నియొ యున్న వ
వ్వాని నవ్వలఁ జెప్పుదు న్విన వచ్చు మీారు తదాది మీా
కీనెఱిం గొని తెచ్చితిం గొడు కిచ్చె జా బిది చూడుఁడీ. 108

వ. అని మిత్రున కిచ్చిన నతండు దాని మాధవశర్మచేతం బెట్టుటయు నాతండు దాని న్విప్పి చూచి యెల్లరకుం జూపి యేకగ్రీవంబుగా నవి మధుకరునియక్షరంబు లని నిశ్చయించి యి ట్లని పఠించె. 109

—* పింగళకుండుఁదెచ్చిన మధుకరునిజాబు *—

శా. నాకుం గూర్చెదుతల్లిదండ్రులకు విజ్ఞానంబునం బుత్రుఁ డ
స్తోకప్రాంచితభక్తి మ్రొక్కి వచియించు న్విన్నపం బిచ్చమై
నాకర్ణింపుఁడు నీలకంఠముని న న్నారీతి నాకాశయా
నైకప్రాప్తినిఁ గొంచుఁ బోయి తనదివ్యాస్థానమున్ జేరిచెన్. 110

మ. యతిరాజాశ్రమ మంచుఁ దోఁప దది రాజాస్థానమం చెంతునే
నతివేగంబున నేగుయానములు రత్నాలంకృతుల్ పెక్కుయం
త్రితతుల్ స్వర్ణవిచిత్రచిత్రములు నుద్యానావృతాగారముల్
నుతపల్యంకములున్ మహాసనములున్ జూపట్టునప్పట్టునన్. 111

సీ. నీటియంత్రంబులుం దీపపు యంత్రము
లావిరియంత్రము లందు గలవు
చిత్రకంబళములు చిత్రాసనంబులు
"మొకమల్ తివాసీలు" ముద మొసంగు
వసనలు దీరు నుప్పరిగల మాణిక్య
కాంతు లంబర మెల్లఁ గ్రమ్ముకొనుచు

రత్నభిత్తికలపై నూత్నరుచుల నీను
చిత్రము లెన్నని చెన్నమీఱు

తే. నాకు భూలోక మది యని కాక దేవ
లోకమో యిది యనుభ్రమ లోన నయ్యె
నం దడుగుపెట్టి త్రిదివేశుఁడైనఁ గాని
యొండుచోటికిఁ బో నెంచఁ డుల్లమందు. 112

—* ఉద్యానవర్ణనము *—

సీ. కోకిలరుతములఁ గోమరోప్పులేమావి
గున్నలఁ గమగొన్నఁ గన్ను లలరు
నలినాదముల నధికాహ్లాద మొనరించు
మల్లికల్ గన మది పల్లవించు
మొగిఁ గ్రపపుదుమారమును గప్పుననఁటిబో
దెల సొంపుఁ దిలకింప నలరుమేను
బంగారుమేడల రంగారు సంపంగి
యీారముల్ మది కిచ్చు లూరఁ జేయుఁ

తే. కేసరంబులఁ దగునాగకేసరములు
మంజులచ్ఛవి నొప్పెడు వంజులములు
పొగడఁ దగుతావి నెగడెడు పొగడగములు
నరయ నరయ మేన్ పరవశ మ్మౌఁ దలంప. 113

చ. విరహుల వేటలాడుటకు వేడుకఁజేసి త్రిలోకయాత్రికున్
జరిగెడు శంబరారికి నొసంగ వసంతుఁడు మేలుబంతు లౌ
శరములు చేసి ప్రోవు లిడె ఘ్రాతలమం దనునట్టు లామ్రముల్
విరియఁగఁ బూచె నల్లడల లేఁజిగురేఁ గనరాక యుండఁగన్. 114

తే. మల్లిపూవులపొదలపై మధుపపంక్తి
వ్రాలి జుమ్మని మొరయుచోఁ బంచశరుఁడు

నారిసవరించి శరములఁ గూరిచె నని
మొలచు భయ మెంతయే వియోగులకెడంద. 115

మ. పసపుంబయ్యెద లొప్పు పుష్పపొడిగముల్ పాలిండ్లు పూగుత్తు లు
ల్లసదంగంబులు ప్రాకుదీవలు కురుల్ పైనాడు తేం ట్లంఘ్రిలున్
గిసలంబుల్ నగవుల్ సుమంబు లగుచుం గీర్తింపనై యొప్పుచున్
బసమీఱు వనలక్ష్ములు వనితలు వర్తింతు రేకాకృతిన్. 116

సీ. తమగాత్రములఁ గావఁ దగుపత్రముల దుల్చె
నని కారుపై నీసు నాని ననఁగఁ
దమమనోహరునితోఁ దమిఁ గూడికొనఁ గల్గె
నని కెంపుజీరలు గొనియె ననఁగఁ
దమకు నొండొరుల కుత్సవసమయం బని
కొని కుంకుమముఁ జల్లుకొనె ననంగఁ
దమకు నాథునితోడ సమయకేళి లభించు
నని సీధురసము ద్రావిన వనంగఁ

తే. నఖిలధరణీతలంబున నావరించి
లేఁజిగురుజొంపములతోడఁ దేజగిల్లి
కన్నుపండువుఁ గావించుచున్న వెన్న
వివిధతరుగుల్మములతోడఁ దవిలి వనులు. 117

—※ నీలకంఠాశ్రమ ప్రభావవర్ణనము ※—

మ. ఇట బంగారము సేయుసాధనము లెన్నే నుండె నానాఁటికిన్
బుటముల్ తీఱి పదారువన్నెగల దై పోలింప నొప్పైడి మి
క్కుటమై మళ్లను బుట్లు బారువులుఁబోఁగుల్ పోయఁగాఁ జాలునం
తటిదై యోగులచేతఁ జేయఁబడు నత్యంతాద్భుతప్రక్రియన్. 118

క. దినదినము రోగు లిచటికిఁ
జనుదెంతురు వేనవేలు సన్మునుల కృపం

గొని పరమారోగ్యంబునఁ
జనుచుందురు నతు లొనర్చి స్వాముల కెపుడున్. 119

క. కలవు తిరస్కరణీప్రియము
ఖలసద్విద్యలును గాయకల్పంబులు సి
ద్ధులు నణిమాదులు మంత్రం
బులు మందులు వేనవేలు పొలిచెడు నిచటన్. 120

సీ. పసరు వ్రాసినయంత బహుయోజనంబులు
క్షణములోఁ జని వచ్చు జనుఁడు మరలి
కనుదోయి కంజనమును బెట్టుకొనినచోఁ
గన వచ్చు నెల్లలోకములు నిచ్చఁ
జెవి నొక్కరసము వోసిన సర్వజగముల
పలుకులు వినవచ్చుఁ బజ్జను బలె
ఘుటిక యొక్కటి పట్టుకొనిన నెదుట నున్నఁ
గనరాఁడు మనుజుఁ డేజనున కేని

తే. వివిధరోగము లింతలో వెలలు నూది
చిటిక వేసిర యేనియుఁ జెప్ప నేల
చచ్చిపోయినవారలు క్షణములోన
బ్రదుకుచుం డ్రిట సిద్ధులబహుళశక్తి. 121

మ. మృతసంజీవని శుక్రునొద్ద మును గీర్తింపంగనై యుండె గీ
ష్పతిపుత్రుం డది నేర్చె నొం డ్లెవరు నేర్వం బోవ రిం డెందులో
మృతినిం బొందినవారికిన్ బ్రదికి పేర్మిం గాంచఁగాఁ జేయుటల్
బ్రతిఘస్రంబును జూచుచుంటిని మునీడ్భవ్యప్రభావంబునన్. 122

ఆ. పాలవెల్లి వేయివత్సరంబులు త్రచ్చి
కడకు నమృత మందె నలసురాళి
సిద్ధ లిచటివారు సిద్ధౌషధం బెదొ
సంగ్రహించినారు చావకుండ. 123

చ. త్రిదశులు వోలె యౌవనము ద్రెళ్లక యుండఁగఁ జా వొకప్పుడున్
గదురక యుండ విద్య లవి గల్గఁగ నెట్టిమనోరథంబులున్
ముదమునఁ దీర్చ్చకోఁ గలుగఁ బూజ్యులు సిద్ధు లిట న్మహౌషధుల్
బొదలఁగఁ జేసికోఁ గలిగి పొంపెస లారుచునుందు రందఱున్. 124

వ. అని మఱియును. 125

—♦ మధుకరుని సందేశము ♦—

తే. నీలకంఠయతీంద్రుఁడు నెమ్మి మూఁఱు
నాకుఁ దనతోడనే భోజనమును శయన
మొనరఁగా జేసి కన్నపుత్రుని విధమునఁ
గనుచు నున్నాఁడు మిగుల నక్కటికమునను. 126

శా. నాకున్ గారుడమంత్రరాజము ప్రసన్నస్వాంతుఁడై యిచ్చి నీ
వేకాలంబు జపింపు దీన సకలాభీష్టంబులుం జేకురున్
గాకోలం బెది గాని నీయొడలి కెక్కం బోదు ని న్మట్టి పా
మే కాలుం గొలువంగ నేగు నని వా కిచ్చెం బ్రియం బేర్పడన్. 127

క. నను నీపింగళకునితోఁ
జను మని సెల విచ్చెఁ గాని జనకా! నే నిం
కను గొన్నినాళ్ళు లిచటన్
మని వెనుకన్ వత్తుఁ జూడ మాతాపితలన్. 128

చ. వినుఁ డొకమాట నా కిచట వీనులకు న్విన వచ్చె నవ్వసం
తునిమకరధ్వజుండు నను ద్రుంపఁ దలంచి చరించుచుండె నం
చును దనవారి నెందఱినొ దారులు గావఁగఁ బెట్టె సంచునుం
గనుకలి మాగురూత్తములు గానఁగఁ జేసిరి నాకు నగ్గతుల్. 129

మ. పులి సింగం బెలుఁగేదు పాము జెఱి తేల్ ముట్టంగ బోకుండున
ట్టులు ముట్టక్ మృతి రానియట్టులును బిడ్గుం బడ్డఁ జాకుండున
ట్టులు శస్త్రంబులు నస్త్రముల్ దరికి నెప్డుం గాని రాకుండున
ట్టులు మంత్రంబులు తంత్రముల్ దెలుప నుండు న్నాగురుఁ డింతలోన్.

శా. ఆయాసిద్ధు లెఱింగి వచ్చెదను నే నస్మద్విచారంబు మీ-
రేయేకాలములందునున్ సలుపకుం డీపింగళాఖ్యుండు చే
ధాయుక్తుండు గురుప్రియుం డితనికిన్ దంత్రంబు లెల్లన్ దృణ
ప్రాయంబుల్ గను గీటినంతటన సర్వంబున్ సమర్థించెడిన్. 131

తరువోజ

ఏమిరోయాకష్టము లేతెంచు నంచు నెఱింగించె నీలకంఠేశ్వరుఁ డప్డు
కావున నవి యెల్లఁ గడతేరునట్లు గావింప నీవినిఁ గరుణామై నంపె
నీవిబుధుం డేమిరోయేఁ జెప్ప నమ్మి యీపు మాయమ్మయు నీతనిం దగిలి
పోవుట శ్రేయమ్ము పో యిట్లు చెప్పఁ బూనితిఁ గొడుకనై పుట్టినదాన.

చ. మనమధురాశ్రమంబున సుమం బొకఁ డొక్కలతామతల్లికిన్
జననము నొంది కాలగతిఁ జక్కఁదనంమును సౌరభంబునుం
గొన నయియుండె దానిపయిఁ గోరికఁ జేసి మధువ్రతం బొకం
డనిశము తన్మరందమును నానఁ దలంచెను మాధవాదృతిన్. 133

క. తేటికిఁ బూఁదేనియ యది
మాటికి లభియింపకున్న మాటయె నిజమై
తేటపడె వేని మేనిం
బాటింపదు వ్రాల దొంటిపయి నది తెలియన్. 134

తే. తల్లిదండ్రుల కీరీతిఁ దనయుఁ డైన
మధుకరుఁడు వ్రాసె దీనిని మాధవుండు
మాలతియు మల్లికయుఁ జూచి మానసముల
నాదరముఁ జూప నాదు సంప్రార్థనంబు. 135

వ. అని యున్నజాబుం జదివిన నెల్లరును విని మఱియు, నిది మధుక
రుఁడు వ్రాసినదియే యనియు నిందు మోసంబు సుంతయును

---

"ఇందు మధురాశ్రమంబన మధురాపుర మనియు, లతామతల్లియు బద్మిని యనియు, సుమంబనిన మాలతి యనియు, మధువ్రతం బన మధుకరుండనియు, మాధవుఁడన మాధవశర్మయనియు, తేటియన మధుకరుండేయనియు నంతరార్థము తెలియం దగు.

లే దనియు నిశ్చయించి ఖేదంబులోఁ గొంత మోదంబు నొంది పింగ
ళకుం బ్రశంసించిరి. మాలతి మాట లేక భూతలంబునం బడియె
నపుడు తండ్రియుఁ దక్కినవారును నామె నూరడించి సేదదేర్చిరి.
పింగళకుండు మిత్రునివలనం గాంచి నే నింకఁ బోయి వచ్చెద ననిన
నతం డి ట్లనియె. 136

ఉ. వచ్చితి వేటి కేమిటికి వచ్చినమచ్చునఁ బోవ నుంటివో
సచ్చరితస్తుత్రపతిభ ! సంయమిచంద్ర ! మదీయకష్ట మే
మచ్చున నుండునో తెలిసి మార్గము గల్గినఁ గాచి ప్రోవఁ గా
నిచ్చ పొనర్పవే యనుచు నే నిదె నీశరణంబు నొందుదున్. 137

—* పింగళకుండు కొన్ని నిదర్శనములఁ జూపుట *—

వ. అనినఁ బింగళకుం డి ట్లనియె. 138

తే. గురువరుఁడు వచ్చి పోయిన మఱుదినమున
నీకడకు నొక్కపురుషుఁడు నెత్తిఁ గంతి
గలుగువాఁ డరుదెంచి నీకెలన నుండి
కొన్ని మాటలు చెప్పె నీకు న్మఱచితె. 139

తే. నీకొడుకు నొక్కమాయావి నీలకంఠుఁ
డనెడుకాపాలికుఁడు మీకు నదియు నిదియుఁ
జెప్పి కైకొనిపోయె మీ రప్పు డెదియు
నరయ కాతనితోఁ బంపితిరి కుమారు. 140

క. ఆతనిగతి యే మగునో
చూతురు మీ రింక మీఁదఁ జూచుచునుండన్
ఘాతుకుఁడు వాఁడు సత్తికి
నాతని బలివెట్టు సత్య మని చెప్పెఁ గదా. 141

వ. అతం డెవ్వండో మీ రిప్పటికి నెఱుంగరు చెప్పెద వినుండు. 142

సీ. మిత్రునిపైఁ గలమిత్రతఁ జేసి మా
ధవశర్మతప్పక తనకుమారి
మాలతీకన్యను మఱి యెవ్వరికి నీక
యతనిపుత్రున కిచ్చి కుతుక మెసఁగఁ
బరిణయోత్సవమును బచరించుఁ గావున
నట్లు గాకుండఁ జేయంగ నెంచి
దుండియు దుండిపుత్రుండును ఘాతుకు
లం బుచ్చి కూరకార్యం బొనర్ప

తే. నిశ్చయించిరి ఘాతుకు లెవ్వఁడో రేపు
వచ్చి యిచ్చట నిన్ను నీవనితఁ బట్టి
హింస యొనరింప కుండ రేసంశయంబు
లేదు నీలకంఠుఁ డెఱుంగు నీదోసంగు. 143

*వ. ఎఱింగియే తా నట్లు వాఁడు నీకు సూచించె నీలకంఠునిఁ గాపాలికుం డన్నవాఁ డెవ్వఁడో తెలిసెనే వాఁడు దుండిప్రేరితుం డగు వేఁగుల వాఁడు వాఁ డిందుఁ గొన్నిదినంబులనుండి సానుచరుండై యున్న వాఁడు కొన్ని సాధనంబులు సమకూర్చుకొని యొలికి మిట్టకడన్ దాఁచియున్న వాఁ డచ్చటినుండి నీయున్న చోటికి సారంగంబుఁ ద్రవ్వఁ జూచుచున్న వాఁడు మొన్న నాసహాధ్యాయి యగు దాల్భ్యుండు వచ్చి వాఁడు వానిపరిజనులలోనివాఁడై వర్తించి సర్వంబును గుర్తించె మీ కది యంతయుం దార్కాణఁ గావించెద నిపుడు దాల్భ్యుండు ధర్మశాలదాపునం గలమఱ్ఱివృక్షంబునీడం గూరుచుండి భగవద్గీతా పారాయణంబు సేయుచున్న వాఁడు వాని నన్వేషించి నేఁ జెప్పినట్లు చెప్పి యిప్పుడంబున కిప్పుడ తెప్పింపుఁ డనిన వాఁ రొకక్కడూతం బుచ్చి దాల్భ్యుం దెచ్చి రతండును బింగళకుండు చెప్పిన చొప్పున

* ఒలికిమిట్ట = శ్మశానవాటిక; ఇది చిత్రములోని చిత్రము.

దుండిపరిజనులపరమప్రియత్నం బంతయు మాధవాదులకుం జూపి యొప్పించె నప్పుడు మాధవశర్మ మిత్రునిం గాంచి యి ట్లనియె. 144

మ. మనయీపింగళకుండు చెప్పిన దసామాన్యప్రకారంబున
స్థన వచ్చెం జుమి జాగరూకతమెయిన్ మర్త్యుండు వర్తించినన్
గనుఁగో నేమఱిపాటు గల్గెడిని గానన్ నీవు నీవామయున్
జను లెవ్వారికిఁ గానరానియటు సంఛన్నంబుఁగా నుండ నౌ. 145

వ. అనిన మిత్రుండు పింగళకునిదిక్కు మొగంబై నావిషయంబున నీల కంఠుం డేమి చేయు మనియె నీ వేమి చేయ నుంటివి న న్నేమిచేయు మనియెదవు చెప్పుమనిన నతం డతని కి ట్లనియె. 146

—♦ పింగళకుఁడు మిత్రదంపతులఁ గొనిపోవుట ♦—

క. రా నున్నయనర్థంబులఁ
కేనరుఁడును గాని మున్న యేర్పడఁ గా నే
దేని యుపాయం బరయుట
లౌ నని కావ్యుండు చెప్పినట్టిద కానన్. 147

శా. నిన్ను న్నీసతి నొం డ్లెఱుంగనిగతిన్ దె మ్మించు నాదేశికుం
డెన్నో చెప్పెను నీకుమారుఁడును నే నిందుంటి నన్ గన్నవా
రిన్నా చెంతకుఁ దెమ్ము మే మిచట నార్తిం బాసి వర్తించుచుం
గొన్నా ళ్లుండి గమింతు మింటి కని నాకుం జెప్పఁగా నొప్పెడిన్.

తరళము. అని వచించిరి గానఁ జెప్పెద నార్య! నే నిపు డీవు నీ
వనితయున్ మునివేషముల్ గొని వన్యభూములదారినిం
జని యొరుల్ గనకుండ నీతనుజన్ముఁ డుండినచోట నా
మునికులేశునఁనుగ్రహంబున మోదముం గొన నొప్పెడిన్. 149

వ. అని చెప్పిన మాధవుం డిది యొప్పు ననియె నంత. 150

♦సీ. బోడి మై మే నెల్ల బూది పూతలు పూసి
కొని కుట్టుఁబోగులు కూడఁ దీసి
కాషాయవస్త్రముం గట్టి గోచిని బెట్టి
యోగదండం బొందు నొడిసి పట్టి
జంకనుఁ ములితోలు లంకెను దగిలించి
తుంబిచెంబుం జేతఁ దూఁగఁ బట్టి
కకపాల లాతామునకుఁ వ్రేలఁగాఁ గట్టి
పావకోళ్ళం గాళ్ళ పట్టి మెట్టి
తే. తలకుఁ గంఠమునకును జేతులకును రుదు
రాకపేరులు చుట్టి శోరమ్ముగఁ గుడి
కేలివ్రేళుల జపమాల లీలఁ దిరుగ
జోగి యయ్యెను మిత్రుండు చోద్యముగను. 151

సీ. చనుకట్టు విరిసిపో వను వీపు నుదరంబుఁ
గప్పు నట్లుగ వేటకట్టు వైచి
కాయముం గప్పంగఁ గావిచీఱను నెత్తి
పైనుండి దిగునట్లు పట్టి కట్టి
మూడు రేకలు దీర మోముపై దళసరి
బూదె మెత్తియు మీఁద బొట్టుఁ బెట్టి
తాలిబొట్టుం దీసి తనువెల్ల నిండంగ
రుదురాక పేరుల గుదులు దాల్చి
తే. పేపబెత్తపు మడతలు మూఁపున నిడి
కేల వ్రేలాడ నొకజపమాలఁ దాల్చి
యోగినీవేషమును వైచె యోగియైన
భర్త చెంగటఁ బద్మినీపద్మనయన. 152

---

♦ కకపాల—సంచి: లాతాము—సన్యాసులు పట్టుదండము, రుదురాక—రుద్రాక్ష.

వ. ఇట్లపూర్వవిధంబున యోగులై యున్నంతఁ బింగళకుండు తాను నేదియో వేషంబు వైచుకొని మాధవునకుఁ జెప్పి పయనం బై నప్పుడు మిత్రిండు మల్లిక మాధవున కప్పగించి తదాజ్ఞం గొని పింగళకునిం గూడి నిజభార్యతో నిష్క్రమించె నని చెప్పిన విని శ్రోత లవ్వలివృత్తాంతంబు చెప్పు మని కథకు నడుగుటయును. 153

ఆశ్వాసాంతము.

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ,
వేదవిద్యావిశారదాది బిరుదవిరాజమాన
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిప్రణీతం బయిన
మధుకరవిజయం బనుప్రబంధంబునఁ
దృతీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీరస్తు

# మధుకరవిజయము

## చతుర్థాశ్వాసము

వ. అక్కథకుండు శ్రోతల కిట్లనియె నట్లు పింగళకుండు పద్మినీమిత్రులం
గొనిపోయిన యనంతరంబ మాధవుండు మిత్రకుటుంబమునకుం
గలిగిన దురవస్థకు మిగుల వగలం బొగులుచు నిద్రాహారవివర్జితయై
తదేకధ్యానంబుఁ గావించుచుఁ బల్యంకంబ శరణంబుగా మరణో
ద్యోగంబున నున్నమాలతికడకుం జని తల్లీ ! మాలతీ ! 1

—♦ మాధవుండు మాలతి నూరడించుట ♦—

తరువోజ.

కన్నత్త్రి యొకమారు కనుమమ్మ నన్నుఁ గరుణమైనినుఁ జూడఁగా వచ్చినాఁడఁ
కన్నకడుపు గానఁ గడుచుమ్మచుట్లు గలిగె నెంతేనియుఁ గారియ కైతి
గన్నాకనై బాలికామణులందుఁ గళ లన్నియు నెఱింగి ఘనతకు నెక్కి
యున్న నీకీరీతి నురుతరదుఃఖ ముదయించె నేమందు నోతల్లి ! యిపుడు.

ఆ. అనుడుఁ దండ్రిసారము విని ధ్యానమును సమా
ధినిఁ దొఱంగి తెఱచి కనుదొవలను
నశ్రుజలము కాల్వ లై పాఱఁగాఁ దండ్రి
వంక నరయు చుండె వాకొనకయ. 3

వ. అయ్యవసరంబున. 4

చ. కనికర మింత యింత యనఁగా దగనట్లుహృదంబుజంబునన్
జననము నొందఁ దండ్రి సుతకంఠముఁ గౌఁగిటఁ జేర్చి తల్లి ! నీ

వనయము శోకసాగరమునం దయి కుందుచుఁ గన్న తండ్రినిన్
నను నిటు కాటియంపడ నొనర్తువె కూర్తువె యార్తి కూఁతురా !

మత్త. ఇంతదుఃఖము తెచ్చి పెట్టితి నేన నీదుజనిత్రికిన్
సంతసమ్మునఁ దమ్ముబిడ్డ కొసంగ నెంచినఁ గా దటం
చంతపొంతలవాని కిచ్చెద నంటి నీ వది పట్టి నీ
స్వాంతమం దతని న్వరించితి వద్ది కారణ మింతకున్. 6

ఆ. అనశనవ్రతంబునను నీవు గృశియించి
పోవుచుంటి విట్లు పూట పూట
కిట్టు లింక నున్న నీ వుండ వేను నీ
కతన నట్టివాఁడఁ గా నగుదును. 7

క. ఈవిధమున మరణించిన
నా వెనుకం జేయునట్టి దగు నని యండే
నా నెట్టి తల్లి కానా !
"జీవన్ భద్రాణి పశ్యతి" యన న్వినవే. 8

చ. మధుకరుఁ డుత్తరుం డనెడుమాట నిజం బితని న్వరించుటన్
వ్యథయును నీది సాజ మన వచ్చును గాని యిటు ల్తపించుటల్
వృథ యిటు చేతఁ గీడ యగు నెల్లరకు న్నలుసంత లాభ మే
పథమునఁ గామి నిశ్చయము వానికి మేలుఁ దలంతు వేనియున్. 9

క. వ్రతములు పూజలు జపములు
సతితము దానములు సాధుసజ్జనసేవల్
హితమతిఁ జేయుట లొప్పెడు
మతిమాలినగతిని నీవు మడియ నఘ మగుఁగా. 10

ఉ. ఇంతకు దుఃఖకారణ మొకింతయుఁ గానఁగ రాదు నీలకం
ఠాంతికమందు గారుడమహామనువుం గొని తప్పియుండవ్రై
యెంతయు సిద్ధులం బడసి యే చను దెంచెద నెల్లవారికిన్
సంతసముం బొనర్తు నని జాబు లిఖించె నతండు చూడవో. 11

వ. అదియుంగాక తనయుత్తరంబులో సర్వసుబోధకంబుగా. 12

చ. మనమధురాశ్రమంబున సుమం బొకఁ డొక్కలతామతల్లికిన్
జననము నొంది కాలగతిఁ జక్కఁదనంబును సౌరభంబునున్
గొన నయి యుండె దానిపయిఁ గోరికఁజేసి మధువ్రతం బొకం
డనిశము తన్మరందమును నానఁ దలంచెను మాధవాదృతిన్. 13

వ. ఇట్లు వ్రాసినపద్యముం జూచి యైన నీవు నీమరణోద్యమంబుఁ జాలించి వానికిని నీకును మాకును మేలుఁ దలంచి దానధర్మాది సత్కార్యంబులుఁ గావించుచు రామాయణంబు నందలి సుందర కాండంబును భారతంబునందలి విరాటపర్వంబును బ్రత్యహంబుఁ బారాయణంబుఁ జేయుము నీకు శుభం బగుం గాక యని పలుకుచు స్మరణ మభినయించుచు ని ట్లనియె. 14

చ. మఱచితె యొక్కనాఁడు మనమందిరసీమకు నొక్కవృద్ధ భూ
సురుఁ డరుదెంచి నీదుకడఁ జొబ్బిలి యున్నమధువ్రతుం గడు
న్వొరవునఁ జూచి వీఁడు బహువిద్యలు నేర్చి కవీంద్రుఁడై మహో
త్తర కృతుల న్రచించి ఘనతన్ దగి తేఁ డగు నంచుఁజెప్పఁడే ? 15

చ. అతనికి నీవు పత్ని నయి హాయనముల్ శతసంఖ్యగా సుఖ
స్థితిఁ గొని పుత్రపౌత్రులను జెంది సుఖించుచు ర్మాజ్ఞివై మహో
న్నతగతి నొప్పుచుందు వని నాఁడు వచించె మునీంద్రుఁ డద్ది వ్య
ర్థత కయి పోవ దెప్పు డెడఁదం బొనరింపకు మెట్టిదుఃఖముల్. 16

వ. అయ్యవసరంబున ముండిత యైనదాసీలక్ష్మి వచ్చి వారికడ గడగడ వడంకుచు దండంబుఁ బెట్టుటయు మాధవశర్మ దానిం బోల్చి యి ట్లనియె. 17

—* దుండిగృహంబునుండి దాసీలక్ష్మి వచ్చుట *—

ఉ. ఈ వెటు వచ్చితో యిటకు నెట్టులు వారలు నిన్ను వీడి రీ
వావలి కేగినన్ సదసునందు యథార్థముపల్కనందునన్

భావమునందు నీవయిఁ గృపం బొనరించితి నీదువృత్తమున్
దేవునిమోముఁ జూచి విశదీకృతముం బొనరింపు మిమ్మెడన్. 18

ఆ. అనుడు లక్ష్మి యనియె నమ్మతో నరిగినం
దులకు మ్రొక్కి క్షమింపఁ బలుకుచుంటి
నట్లు నేను జదురునందు సాక్ష్యం బిచ్చి
నందువలన వార లాగ్రహించి. 19

వ. నా కిట్లు శిరోముండనంబుఁ గావించి నన్నుఁ బో నిచ్చిన నేను వారి హారస్యంబు లేవి యెట్లు వెల్లడింతునో యని యొక్క నేల బొయ్యారంబునం బెట్టి రే నందుఁ గొన్నిదినంబు లంధతమసంబునం బడి కొట్టుకొని కొట్టుకొని వారియింటిదాసి యగుగొజ్జంగిపరిచయంబున విముక్తిం గాంచి యిట్లు మీకడకు వచ్చియున్నదాన నన్ను ననుగ్రహించి నా కింత యన్నంబుఁ బెట్టి రక్షింపుఁ డనిన నతం డట్లు కానిమ్ము నీవు మాకీలకంబు లెఱింగి పో వచ్చినదానవో యని సంశయించుచున్నవాఁడ ననిన లక్ష్మి యి ట్లనియె. 20

క. ఇట సూర్యుఁ డటులు పొడిచినఁ
బటపట యని ధరణి యెల్లఁ బగిలిన దివముం
దటుకునఁ గూలినఁ గడుసం
కట మైన నసత్య మాడఁ గాఁ దలపోయన్. 21

ఆ. వారియుద్యమములు బహువిధంబుల నుండె
బుజ్జగింతు మేని గొజ్జగికడ
వృత్త మెఱిఁగి తగినవిధమున మెలఁగ నా
ననుచుఁ జెప్పుచుంటి నార్యులకును. 22

వ. అనిన నతం డక్కడవారిప్రవర్తనం బె ట్లున్నది నీకుఁ దెలిసినట్లు చెప్పు మనిన లక్ష్మియు. 23

మ. సరి దాకన్ వచియింపఁ జాల నెవియో సంభారముల్ గూర్చుచున్
బరివారంబును జేర్చుచున్ ధన మదభ్రప్రక్రియన్ బేర్చుచున్
నిరతంబు స్త్రీము హింస చేయుటకు నిర్నిద్రప్రకారంబులన్
బరివర్తించుచు నున్నవా రరసితిన్ వాక్రుచ్చ గొజ్జగియున్. 24

—* మాధవునికడకు వెనుకటిజోసి వచ్చుట *—

వ. అని సంభాషించుచున్న సమయంబునఁ బ్రాంగణంబున నేదియో పరిశుద్ధస్వరంబు వినవచ్చుటయు దాసిం బుచ్చి చూచి రమ్మనిన నది పోయి చూచి వచ్చి యి ట్లనియె. 25

శా. జ్యోతిర్విత్తఁట నీలకంఠునకు శిష్యుం డంట ము న్నొక్కనాఁ
డేతద్రీతిగ వచ్చి మీమధుకరున్ హింసించు సర్పం బటం
చాతంకంబును జెప్పి పోయె నఁట నేఁ డత్యంతకార్యాదృతిన్
మీతో నేమొ వచింప వచ్చె నఁట కూర్మిం జేసి యోమాధవా! 26

తే. అనిన మాధవుఁ డీశ్వరుం డతఁ డటంచు
వడివడిం జని తోడ్తెచ్చి పాద్య మిచ్చి
విశ్రమింపఁగఁ జేసి యోవిప్రవర్య
వచ్చితిరె? యేమి యందు మాభాగ్యగరిమ. 27

క. మాస్థితియంతయు నిటు దుర
వస్థకునై చూడ నొప్పెఁ బండిత! మాకున్
స్వస్థత యనునది లేదు శు
భస్థానము కలుగునట్టిభాగ్యము కలదే? 28

ఉ. మిత్రుఁడు మిత్రపుత్రుఁడును మిత్రునిపత్నియు మమ్ముఁ బాసి యే
ధాత్రికొ పోయి రే మిచటఁ దద్గతి కెంతయు వంత నొందుచున్
గాత్రము లింకిపో నిటులు కారియ కై యశనంబు నిద్ర యే
మాత్రములేక యుంటి మని మాయిలువేలుపు నీకుఁజెప్పుదున్. 29

ఆ. అనుఁడు వ్యగ్రహృదయుఁ డగుచు నీశ్వరుఁ డేది?
యేది? మాలతి గనరాదు వచ్చి

ప్రశ్న లడుగ దల్లపల్యంకమున నున్న
దామె యో వచింపు మోమహాత్మ! 30

క. అని నుడివి వడివడిం జని
వనితామణి! నన్నుఁ జూడు వచ్చితి జోస్యుం
డను నీకు మేలుఁ గూర్చెద
మనమునఁ గలవనఁట యెల్ల మానుము తల్లీ! 31

—* జోసి మాలతి యనశనవ్రత ముడుపుట *—

ఆ. అనినఁ గనులు విచ్చి కని కన్నకొలుకుల
బాష్పజలము చాలు వాఱ మాట
లాడ నేరనట్టి దై యుండె నంతలో
నతఁడు మఱియు నామె కనియె నిట్లు. 32

ఉ. నీవు ప్రియుం డనంతమున నెంజిలి వీఁగి మహోన్నతస్థితిన్
మాదయితప్రభావుఁ డగుమాంత్రికయోగి సమాశ్రయించి వి
ద్యాదయితుండు సర్వమహిమాంచితుఁడై ఘనుఁడై తలిర్చుచో
నీ దగుదుఃఖ మేమిటికొ నీ కివియేటికొ నిట్టుపాసముల్. 33

క. నీ శోకకార్యము సెప్పఁగ
నీకడకు న్వచ్చినాఁడ నెంజిలి విడి నీ
వేశాంతో గుడిచి వచ్చిన
వాశోందుఁ దదర్థ మెల్ల వనరుహనయనా! 34

వ. అనిన మాలతి వానిమాట యందుఁ గలవిశ్వాసంబున ననశనవ్రతంబు విడిచి కొంచెము పయఃపానంబుఁ గావించి విశ్రాంతి వహించె నంత మాధవశర్మ తనకన్యకామణి వ్రతంబు మానినందులకు నీశ్వరుం బ్రశంసించి మహాత్మా! నేను ధన్యుండ నీయనుగ్రహంబునం జేసి మా మాలతి బ్రతికినట్టి దయ్యె దీని కింతదుఃఖోపశమనంబుఁ గావించుచుండు మేను గృహకృత్యంబులు దీర్పఁ బోయి వచ్చెద నని చెప్పి పోయె నప్పు డీశ్వరుండు మాలతిం జూచి. 35

—♦ జోసి మాలతితో సంగతిం జెప్పిపోవుట ♦—

తే. ఉహ్యూ మని యూదినంత నీయొడలు మీఁది
కెగిరి పో యెడునో యనుపగిది నుండె
నిట్లు కృశియించి పోవుట కేమి వచ్చె
నీప్రియుఁడు వైభవంబున నెగడుచుండ. 36

మ. అనిన న్మాలతి నాప్రియుం డిపుడు నిత్యశ్రీసమేతుండునున్
ఘనుఁడై యుండె నటంచుఁ బల్కితివి వేడ్కం గూర్పఁగాఁ బల్కితో
కనుఁగో సత్యవచఃప్రసంగతియొ పల్కం జెల్లు నా సత్య మం
చును నే బాస యొనర్తు నమ్మ విను మంచుం జోసి తా నిట్లనున్.

మత్త. నీలకంఠుఁడు కొన్ని సిద్ధులు నీదునెచ్చెలికానికిన్
పోలఁ జెప్పెలె కాదు వానినిఁ బుత్రినట్లు తలంచుచున్
శ్రీ ల వన్నియు వాని కప్పనఁ జేసి వాసిమెయిం గనున్
శీలవంతుఁ డతండు నాతనిఁ జేరి మ్రొక్కెడు నెప్పుడున్. 38

వ. ఇ ట్లుండుటం జేసి మధుకరునిపై నట నుండుకొందఱ కసూయపుట్టి వాని నెట్టులైనం బట్టి గిట్టింప వలయు నని యెంచుచున్న వా రిట్టి తఱి నీవు వానిచెంత నుండిన నతండు వారిబాఱినుండి తప్పుకొనం జాలుఁ గావున నీకై చైత్రిం డను తనమిత్రినిం బుచ్చుచున్న వాఁడు నీవు సంశయింపక వానితోఁ జని వానియిక్కట్టుఁ దీర్చి వానిని వానిఁగన్న వారిని వెంటఁ బెట్టుకొని ర మ్మదిగో చైత్రిం డట గుఱ్ఱంబునకుఁ బల్లం బమర్చుచున్న వాఁడు వాని కటనుండి యిట రాఁ బదినిమేషం బులకాలం బే నింతలో సంధ్యావందనంబునకుం బోయి వచ్చెద నతండు నిన్ను ర మ్మనినఁ బోకుందువో పోకున్న నీకుఁ బ్రియుండు లేఁ డని యెఱుంగు మని చనియె నంతఁ గొంతలో నొక్కయువ కుండు పంచకళ్యాణిగుఱ్ఱంబు నెక్కి నభోవీథినుండి వచ్చి మాలతికడ గుఱ్ఱంబు డిగ్గి. 39

—♦ మాలతికడకుఁ జైత్రుఁడనువాఁడువచ్చి జాబిచ్చుట ♦—

సీ. నూఁగు మీసలవాఁడు జోగివేసము వాఁడు
పసిపచ్చ బంగారు వన్నెవాఁడు
నవ్వుమొగమువాఁడు నాగబెత్తము వాఁడు
నవనవలాడు మే న్గలుగువాఁడు
పలుకు పల్కినఁ దేనె లొలుకఁ బల్కెడువాఁడు
కటితున్మొదలఁ బోలుకురులవాఁడు
కరుణారసం బొల్కు కనుదోయి గలవాఁడు
ధవళంపు బసుమంబుఁ దాల్చువాఁడు
తే. తళుకు లీనెడు కావివస్త్రమును గట్టి
పావలం దొడ్గి జాళువాపైడిచేల
ముత్తమాంగముపై నైచి యోగపట్ట
మలర మన్మథమన్మథుం డనఁగ నొప్పె. 40

వ. అతండు మాలతిం గాంచి నీవు మాలతివా ! నీకు మధుకరుం డీజాబు నిచ్చె నని దానిం జేతి కిచ్చుటయుం బుచ్చుకొని యామె యిట్లు పఠించె. 41

—✻ జా బు లో ని వృ త్తాం త ము ✻—

సీ. నాబహిఃప్రాణమా ! నాపాలిభాగ్యమా !
నీలకంఠులకృప నేను మిగుల
నుచ్చస్థితింగాంచి యుంటి నాతలిదండ్రు
లును నన్నుఁ జేరిరి వనట దక్కి
తనసంస్థ కంతకు ననుఁ బరివృఢుఁ జేసి
సర్వస్వమును నావశంబుఁ జేసి
పింగళకునిఁ గూడి వేంచేసె నాగురు
వరుఁడు కేదారము నరయుపొంటె

తే. నేను దద్వ్యపహారము పూని నడపు
వేళఁ బూర్వపదస్థులు పితరకుఁడు క
ఠోరుఁడును నన్నుఁ గలహించి క్రూరకార్య
మాచరింపఁగ నెంచి రో యబ్జవదన. 42

మ. ననుఁ గాపాడెడువారు లే రెవ రిటన్ నాదేశికుం డున్నచో
జను లెవ్వారికి నే నసాధ్యుఁడను నాస్వాధీన మాసర్వమి
ప్డు ననుం బట్టి వధింప నుండిరి ఖలుల్ భోగేశ్వరీదేవి చెం
తను నామృత్యువు నీవుఁ దక్క మఱి యెంతల్ లేరు వారింపఁగన్.

ఆ. బ్రహ్మచారి యైనబ్రాహ్మణుండే కాని
బలికిఁ బనికిరాడు భగవతికిని
నేను బ్రహ్మచారిఁ గానిచో నాదేవి
నను ననుగ్రహించుఁ గొనదు బలిగ. 44

తరళ. బలివిధానము రెండుసారలపై బొసంగెదు నింతలో
పల వివాహముఁ జేసికొన్నను బ్రహ్మచర్యము పోవు నా
కిల గృహస్థునిఁ జంపఁ దెచ్చినయిద్దఱం గొని మ్రింగు నో
పొలఁతి ! చెచ్చెర రమ్ము చైత్రినిఁ బుచ్చితి న్ననుఁ దేరఁగన్. 45

చ. గడియలు నాల్గుమాత్ర మెడ గల్గుఁ బదంపడి నాకఠోరుచే
వడిఁ దెగిపోక గల్గెడిని వచ్చి వివాహము చేసికొమ్ము నా
మడియుట తప్పు నాపగఱ మార్కొని చంపును శక్తి గాన నా
నుడి విని వీనితో ననుఁ గనుంగొన రమ్ము నయ మ్మెసంగఁగన్. 46

తే. ఇట్లు చేసినపిమ్మట మృతికిఁ దప్పి
నేను నీవును దలిదండ్రు లీనలువుర
మరుగుదము దేవయానమునందు నెక్కి
మనపురంబున కని వ్రాసె మధుకరుండు. 47

—* చైత్రుఁడు మాలతీమల్లికలం గొనిపోవుట *—

వ. అట్లున్నజాబుం జదివి తత్తరంపడుచున్న కన్నియం గని చైత్రుం డేమిచెప్పెద నొక్కనిమేషం బిట నాలస్యంబు చేయ నొప్ప దిమ్మార్గంబు తప్పిన గార్యంబు చెడు ననిన నామె మఱి యేమియు ననం జాలక నామనోహరునిం బ్రదికించుటకన్న నా కొం డేమి కావలయు నే నిదె వచ్చెద నన్నర్ధక్షణంబున నటకుం గొనిపొ మ్మని సమ్మతిం జూపిన నతండు తండ్రికై నంజెప్పనీక మాలతి నశ్వంబుపై నెక్కించుకొని పొక్కుచున్న మల్లికం గూడం దదనుమతంబున నెక్కించుకొని తానును వారికిం బురోభాగంబునం గూరుచుండి ధే ధే యను నంతలో నది యంతరిక్షంబున కెగసి యంతర్ధానంబు నొందెం బదంపడి మాధవుం డట వచ్చి మాలతీమల్లికల నొక్కహయారోహకుండు వచ్చి కొనిపోవుట దాసిలక్ష్మివలన విని యతండు నోరును నెత్తియు మొత్తుకొనుచు నేలంబడి యడలం జొచ్చె నాలో వానిపరిజనంబు వచ్చి వాని నూఱార్చుచు మీ రిట్లు పామరునివలెం బరితపించుట పాడిగాదు. మన మిట మాలతి నన్వేషింత మెంతవడి గలహయమైన నింతలోం గొంతదూరంబ కాని పోం జాలదు మేము నల్వురము మనహయంబుల నెక్కి పోయి నలుమూల లన్వేషించి వత్తుము మనహయంబు లాజానేయంబు లాహయంబుం గూఁతవేటుదూరంబునం గూడం గల వని తదనుమతిం గొని హయంబుల నెక్కి పోయిపోయి పోయినట్ల వచ్చి నూఱాఱు గవ్యూతు లేగి వచ్చితి మెందు నేగుఱ్ఱంబుజాడయును గానరా దయ్యె ననిన నమ్మాధవుండు వారిని గృహంబు రక్షించుచుండుం డని చెప్పి యప్పుడ కదలి మనోనైకల్యంబున. 48

—♦ మాధవుఁడు మాలతిని వెదుకఁబోవుట ♦—

సీ. జోసి యుండెడుచోటు లాసమైఁ జని దోసి
జోసని వాసిశిష్యులను గనక

గొజ్జంగియింటికి గొబ్బునం జని దుండి
గీమున మాలతి లేమిఁ దెలిసి
చెఱువులు న్నూతులు క్షేత్రంబులుం జూచి
వాఁగులు న్వంతల కేగి యరసి
యమునానదీప్రతీరము లన్నియుం గని
రక్షకభటు లుండురచ్చలు గని
తే. వీటఁ గలరాజమార్గముల్ వీథులు మఱి
సందులును గొందులును గళామందిరములు
హర్మ్యములును బ్రాసాదము లఖిలగృహము
లరసి మాలతిఁ గనఁ జాలఁ డయ్యె నతఁడు. 49

వ. ఎందునుం గనఁ జాలక వసంతుండు వానిపుత్రిండును మాలతిన్ హరించి యుందు రని నిశ్చయించి బంధువిరహితం బై శూన్యం బయిన నిజమందిరంబునం గుదిరి యుండం జాలక యొరు లెఱుంగకుండ వేషాంతరంబు స్వీకరించి యేకాకి యై పయనం బై మతిభ్రమణంబునఁ గ్రమంబుఁ దప్పి పరిభ్రమించుచు నొక్కవేశవాటికం బ్రవేశించె నదియును. 50

—♦ వేశవాటికావర్ణనము ♦—

సీ. మల్లెలు న్మొల్లలు మధుమద్యములు తమ్మ
లమ్ము లమ్మెడుదుకాణమ్ము లొప్ప
వీణియలు ఛెతార్లు ఫిడెలు సారంగులు
లోనగుజంత్రముల్ పూని మ్రోయ
తబలాల్ మృదంగముల్ తప్పెటల్ తాళముల్
మొదలగువాద్యముల్ పొదల మొఱయ
స రి గ మాదులతోడ సావేరి సారంగు
పూరి లోనగురాగములు సెలంగ

తే. కోడెకాండ్రసందడి గడుఁ గూడి యుండఁ
బరిగృహప్రాంగణంబునఁ బడఁతి యోర్తు
నిలిచి రమ్మని చేసన్న సలుపుచుండ
వేళ వాటిక యెంతయు వేడ్క కయ్యె. 51

తే. మేడపై విహరించెడు మెఱుఁగుబోఁడి
మెడను పైకెత్తి చూచుచు నడచుచుండ
దారి నొకపుష్పలావిక తారసింప
దానిపైఁ బడె నొకఁ డెల్లఁ దగిలి నవ్వ. 52

ఉ. నాచనపూవుగుత్తు లివి నల్గఁ బొనర్చితి నొచ్చితిం గదుర్
నీచెయిదంబు వింతగతినిం బొలుపొందెను కోడెకాఁడ! యీ
రాచరికంపుశేవ లివి రమ్యములే యని దండఁ బట్టి తా
నాచనువాని నాఁగెను లతాంతము లమ్మెడు కొమ్మ యెమ్మెమై.

చ. నలిగినరెండుగుత్తులకు నాలుగురెట్లుగఁ బైక మిచ్చియుఁ
గలిగినవేదనాభరము కాంతకుఁ దీఱ సపర్య సేయున
ట్లలనెలమూండ్రవీథి నగునందఱు తీర్పు చెప్పి వానినిఁ
బలికిన రీతిగా నడచువానిఁగఁ జేసిరి వాసి మీఱఁగన్. 54

సీ. సారె కెంతిమ్మని సానితల్లి వచింప
　　నింతిత్తు నని విటుం డిడియె నుడుగుఁ
గడుమిన్న యగునన్నుఁగాఁడవు నీ వని
　　వలపించె విటు నొక్కవలపుకత్తె
గుత్త చేసియు రావు రిత్తపండితి రాత్రి
　　ధనము తెమ్మని యొక్క తఱిమె నొకని
విత్తము రే పిత్తు వెఁది పాత్రిమ్ము నేఁ
　　డనిన కాదని పల్కె నతివ యొకత

తే. యిట్లు పరిగృహమందు నే దేనియొక్క
తగవు పడ సానులును సానితల్లులు విట

కాండ్రు మాటలు సల్పుచు నుండ్రు సాని
వీథి నీరీతి వేడ్క లవ్వేళ నయ్యె. 55

—* మాధవుఁడు వేశ్యను దనకూఁతు రని భ్రమించుట *—

సీ. సంపఁగిఁ దలరాసి చక్కఁగా నెఱికలు
కర మరుదందఁ గీల్గంటు వైచి
పున్నమచందురు పోల్కి నున్నట్టి న
మ్మోమునఁ గస్తూరిబొట్టుఁ బెట్టి
కన్నాకురతనంపు పొన్నుసొమ్ములు వెట్టి
రాజిల్లు పైఠాణి రైక దొడిఁగి
బంగారునీ రాకు పసిగేఁరుజలతారు
చెఱఁగుల నొప్పారుచీఱఁ గట్టి

తే. అందె లంతంత గల్లు గ ల్లనుచు మ్రోయఁ
జెలఁగి కుచ్చెళ్ళు మీగాళ్ళఁ జిందులాడఁ
గొను నసియాడ నడయాడుఁగలికిఁ జూచి
మాలతీకన్య యని లోన మమతఁ జేసి. 56

వ. సమీపించుసంతలో నది గృహంబులోనికిం బోవుటయు మాధ
వుండు తద్గృహప్రాంగణంబునకుం జని మాలతీ! మాలతీ! యని
పిలుచుచు నిలువం బడి యుండుసంత. 56

మత్త. చప్పిదౌడలు బోసినోరును జారిపోవునురోజముల్
దొప్పకన్నులు గూనుమూపును దో నెకద్దును వెల్లనై
విప్పువాఱుశిరోజముల్ గలవేశ్యమాత యొకర్తు మేల్
చెప్పుచుం జనుదెంచి బాబులు! చేర రం డిట నుండఁగన్. 58

తే. అరయ మాయిల్లు పావన మయ్యె నేఁడు
ధన్యులము మేము మాబిడ్డ ధన్యురాలు
సంజఁ బడ నుండె రాత్రి మాసదనమందు
నతిథు లై యుండ నర్థింతు నార్యవర్య. 59

వ. అనిన మాధవుండు. 60

మ. ఇది యేవారిగృహంబు వేశ్యలదియా యే నిందుఁ గార్యార్థి నై
మదిఁ గావించి సమాగతుండ నయితిన్ మాకన్య యిందున్న యా
ట్లదరుంబాటునఁ దోఁప వచ్చె ననఁగా నజ్జంత మీ రెంతలో
యిది వేశ్యాగృహమం చెఱంగికొనకే యి ట్లేగుదే నైతిరో. 61

క. ఎంతటిజాణలు మీ కే
నింతటిలోఁ గన్య నిత్తు నిభ్యులు మీ రే
మెం తనిన నంత యిత్తురు
సంతోష మటంచుఁ బలుకుసమయమునందున్. 62

వ. మాధవుండు సిగ్గుపడుచు మఱియును. 63

ఆ. వేదజడుఁడ నేను విప్రుఁడ విటుఁడను
గాను నాకుమార్తె కరణి యిప్పు
డిందుఁ జొచ్చె నొక్క యెలనాఁగ దానికై
యేను వచ్చినాఁడ నెఱిఁగికొనఁగ. 64

క. అన నది యను వేశ్యావృ
త్తిని నీసుత మెలఁగుచున్న దే యిటు కాకుం
డిన నిట్లూహించుట గలు
గని దే యను టొప్పు నెంత గడుసరి వాహా. 65

వ. అనిన నతండు. 66

శా. తల్లీ! కూఁతురు తప్పిపోయె నెట నో దానిన్ గవేషించు చే
ని ల్లిల్లుం దిరుగాడుచుంటి గదె యి స్త్రీలోనికిం బోయె సం
ఫుల్లాబ్జేక్షణ నాకొమారిత యనం బోలింప నై దానిచో
ప్పెల్లం జూడఁగ వచ్చినాఁడ గరుణన్ వీక్షించి రక్షింపవే. 67

ఆ. అనిన వేశ్యమాత యనునట్టు లైనచోఁ
బిలుతు దాని నిటకుఁ దెలియు మనుచు

నిట్లు రమ్ము మాలతీ! నిన్ను నీబాప
నయ్యవారు చూచు ననుచుఁ బిలిచె. 68

చ. పిలిచిన నో యటంచు నలవేశ్యకుమారిక ధూమ్రపానమున్
సలుపుచు వచ్చి మాధవునిచక్కి నిలం గని భ్రింసితాత్ముఁడై
తెలియ కతండు తల్లి! ననుఁ దేరి కనుంగొన నిట్లు రాకకున్
గలకత మేది చెప్పు మని కౌఁగిటఁ జేర్పఁగఁ బోయెఁ బోయినన్.

చ. తొలఁగి నిలుండఁ గా ననుచుఁ దోఁపఁగఁ బల్కితి నిప్పు డిట్టిచేఁ
తల కయి తెట్టు వేదజడతం గలవాఁడవొ బాపనయ్య! నీ
తలఁపులు వేఱుగాఁ దెలియుఁ దావక దేహము జీర్ణ మైన లోఁ
గలతమి జీర్ణ మైనటులు గానఁగ వచ్చుట లే దిదేమొకో. 70

ఆ. అనిన మాధవుండు ననుఁ గన్నతల్లి! నీ
విట్టులాడుచుంటి వేమికతము
కన్నబిడ్డ వనుచుఁ గౌఁగిటం జేర్చుట
తప్పు గాఁ దలంచు టొప్పు నొక్కొ. 71

ఉ. మాటలు హావభావములు మంజులహాసము దేహసౌష్ఠవం
బాటలు పాట లొద్దిక లి వన్నియుఁ బుట్టిననాఁటినుండియున్
మాటికిఁ జూచుచుండుటను మాలతి పీ వని చెప్పుచుంటి నీ
వేటికి నిట్టులాడెదవొ యే నిసుమంత యెఱుంగ హేతువున్. 72

క. నాపై గోపము సేయకు
మోపట్టిరొ! మిత్రపుత్రు నుర్వీస్థలిలో
నేపగిది నైన వెదకెద
నీపతిగాఁ జేయువాఁడ నే నిదె వినుమా. 73

ఆ. వేశ్య యిట్టు లనియె నెట్టిబ్రాహ్మణుఁడ! నే
సానిబిడ్డ నగుదు గాని నీదు
బిడ్డఁ గాను నాదుపేరు మాలతి యండ్రు
విడిచి బ్రోంతిఁ జనుము వేఱుకడకు.

వ. అని యెన్నియో విధంబులం జెప్పిన నతండు నామెం దరియం జని నుదుటం బిప్పురుం గానక యెట్టకేలకు నామె దనకూఁతురు గా దనియు వేశ్యకూఁతురే యనియు నిశ్చయించుకొని తద్గృహంబు విడిచి పోయి మఱియుం గొన్ని గృహంబులు వెదకి యెందుం గానక డెందంబునఁ గొందలంబు నొందుచు. 75

— * మాధవుఁడు మాలతిని వెదకుచు దేశాటనము చేయుట * —

సీ. మధురాపురమునుండి పథి వట్టి పోవుచు
బృందావనంబునయందు వెదకి
సాకేతమున కేగి సరయువుకడ రాము
నడిగి మాలతిఁ జూచితయ్య యనుచుఁ
గాశికిం జని యెల్లఘట్టంబులుం జూచి
గయయుఁ బ్రయాగముం గాంచి వెదకి
శ్రీజగన్నాథమున్ శ్రీకూర్మమును సింహ
శైలము వేంకటాచలము నరసి
తే. కాంచిపురమునకుం జని కలుగు నెల్ల
చోటులును బేటలును జూచి కోట లరసి
రంగనాథునిపురి కేగి రంగమీఱు
నేడు ప్రాకారముల సందు లెల్ల వెదకి. 76

తే. మఱియు నెన్నెని క్షేత్రముల్ మహితలమునఁ
గలుగు నన్నియు మాటికిం గలయఁ దిరిగి
తన్నకూఁతు నెం దెందును గానఁ జాల
కతఁ డరణ్యమార్గము వట్టి యరిగె నంత. 77

ఉ. కొల్పులి లేడిఁ బట్టుకొని కొంపదరిం బడి పోవుచుండఁ గా
నల్పపుదృష్టిపాతమున నట్టె కనుంగొని కట్ట! కట్ట! నా
మే ల్పొనరించుమాఁలతిని మేకొనిపోయెను నం చతండు లోఁ
బొల్పుఱి వెంట నంటి చనె భూరిరవం బొనరించుచు న్వడిన్. 78

వ. అయ్యవసరంబున. 79

—* అడవిలో రాక్షసుఁడు ప్రత్యక్ష మగుట *—

సీ. కోఱవిఁ ద్రిప్పినరీతి గుండ్రనై మిడిగ్రుడ్లు
చండ్రనిప్పులఁ బోలు వేండ్ర మిమియు
నెలవంక లిరువంక సెలవుల లంకె ల
ట్లయి కోఱదుగ స్ఫులింగార్చు లీనఁ
బ్రజ్వలజ్వలన వేల్లజ్వాలికను బోలి
వ్రేలునాలిక మృత్యుభీతిఁ జూపఁ
గడిఁది కాటుకకొండ నడరించుచుండు మేన్
గటికచీఁకటిపిండుఁ గనుచునుండ

తే. గుదుసుజుంజురు వెండ్రుకల్ గదుసువాఱ
మొఱడు దేహనభూత్రుకుటుల్ ముడులు వడఁగఁ
గుణపమును సారెసారెకు గొఱికి కొనుచు
దండిగొండ యనన్ రాక్షసుండుఁ దోఁచె. 80

వ. వానిం జూచినంతలో మాధవుండు మూర్ఛం బడి కొండొకవడికిఁ గన్నుఁ దెఱచి యండ నున్నవానిం జూచి గడగడ వడంకుచు నోం డెఱుంగ కుండె నాసమయంబున రాక్షసుండు వానిం దరియ వచ్చి కరంబుల శిరంబుఁ బుణుకుచు నావలన నపాయంబు రాఁ బోదు వెఱ వుడిఁగి స్థిమితపడి సంభాషింపం జాలు మని బుజ్జవం బొనరించె నంతఁ గొంతలో నతం డింత శాంతి గలండై రాక్షసు నకు నమస్కరించి దేహాభిమానంబు లేనివాఁడయ్యును నేఁ గొండి న్యుండ నన్ను రక్షింపు మని ప్రార్థించుటయు నతండు. 81

శా. "నారుద్రః క్రమపాఠకో'' యనుట నీ వత్యంతమేధావివై
పారం బందఁగ వేదమున్ గ్రమగతిన్ వల్లించి తెన్నంగ నీ
వారుద్రుండవు మాధవద్విజుఁడ వయ్యా నిన్ను నే నెగ్గదున్
బ్రారబ్ధంబు మదీయ మిప్పటికి భవ్యం బయ్యె భావింపఁగన్. 28

వ. అనిన వివ్వెఱంపడి మాధవుండు. 83

శా. నీ కీరూప మ దెట్లు వచ్చినదొ కానీ నీవు విద్వాంసుఁడై
వాకో నైనమహీసురుండ వనుచున్ స్వాంతంబునం దోఁచె న
న్నేకల్పంబున నీ వెఱింగితివొ పే రెట్లాడఁ గాఁ జాలితో
నా కీయెల్ల సవిస్తరంబుఁ దెలుప న్వాంఛింతు విద్వన్మణీ. 84

ఆ. అనిన నాతఁ డనియె నయ్య నావృత్తాంత
మాదినుండి నీకు నడుగకున్నఁ
జెప్పఁ దలఁచియుంటి నిప్పు డీ వాలించి
నన్నుఁ గరుణఁ జూడు మన్న యనుచు. 85

చ. అలరుఁ గవేరజాతటమునందు మణిప్రిజ మన్ పురీవరం
బలఘుతరప్రభాకలిత హర్మ్యసమంచిత మందు నెందఱేఁ
గలరు శ్రుతిస్మృతుల్ దెలిసి కంజభవప్రతిమాను లైన వి
ప్రులు చతురాననుల్ వసుసమున్నతు లున్నతకీర్తు లెన్నఁగన్. 86

క. అం దేనొక్కఁడ విప్రుఁడ
నుందుం గౌండిన్యముని కులోత్తమగోత్రి
మ్మందున్ బుట్టితిఁ గృష్ణా
నందుం డనువాఁడఁ గృష్ణనందనుఁ డగుచున్. 87

మ. గురుధిక్కార మొనర్చినాఁడను గడుం గ్రూరత్వబుద్ధి న్ననున్
గురుఁ డీక్షించి శ్రుతిస్మృతుల్ చదివి నాకుం గ్రూరశిష్యుం డవై
దురితం బిట్లు పొనర్చి తిందువలనన్ దుష్టాసురుం డై మహిం
బరివర్తింపుము పొ మ్మటం చలివి శాపం బిచ్చె నుచ్చైర్గతిన్. 88

మత్త. అప్పు డే నతిసాధ్వసంబున స్వాంత మెంతొ చలింపఁగాఁ
దప్పుఁ జేసితి సైఁపు మంచును దత్పదద్వయిఁ బట్టినన్
దప్పు దే ననినట్టు లయ్యెడుఁ దత్ స్థితిం బడి నంత పై
నెప్పుడో నినుఁ జేర మాధవుఁ డేగుదెంచెడు విప్రుఁడై. 89

ఆ. అతనిఁ జూడ నీదు స్వాంతము శాంత మౌ
నతనివలన శతము లాఱు నాల్గు
మాఱులుగను వేదమాత జపించిన
ఫలము వడసి దీనిఁ దొలఁగఁ గలవు. 90

తరళ. అని విశాపము వల్కి తొల్లిఁటి దైనపుట్టువునందు నా
జనకుఁ డీవని చెప్పి నోద్విజచంద్ర! యక్కటికంబునన్
గల వరం బిడి యిట్టినాడగు కష్టముల్ తొలఁగింపవే
నిను భజింతు నిరంతరంబును నీదుకాళుల మ్రొక్కుచున్. 91

చ. నలువది యేండ్ల నుండియును నాదగుపొట్టను బడ్డజంతుకో
టులు గణియించు టెవరికిఁ గడుంగడు శక్యము గానియట్టి దే
సలిపితి హింసలన్ దెలుపఁ జాలఁ బతివ్రత నోర్తుఁ బట్టి బి
డ్డలు మగఁ డేడ్వ మ్రింగితిఁ గటా యది నాహృదయంబు నేచెడిన్. 

క. నే నింక నోఁప హింసకు
నానేరము లెల్ల సైఁచి నను బ్రదికింపం
గా నిచ్చ సేయవే యనఁ
గా నాతఁడు వల్లె యనుచుఁ గరుణామతియై. 92

వ. జలోప స్పర్శనంబు చేసి సావిత్రి సష్టోత్తరసహస్రంబు జపించి సగో
త్రజుం డగువాని గోత్రనామంబులు సెప్పి ధార వోయుటయు
నంతలో నతండు దేవత్వంబు నొంది మాధవుని సమక్షంబునఁ
బ్రత్యక్షంబై యొక్కమహామణిం జూపుచు. 93

మ. ఇది చింతామణిసోదరంబు మును దేవేంద్రాదు లంభోధిఁ ద్రి
చ్చఁ దదీయాంతరమందుఁ బుట్టి యసురస్వాధీనమై నాఁటనుం
డి దితిప్రోద్భవహస్తగం బగుచు నుండెన్ దీని నే నొక్కచోఁ
గదనంబం దొకసోఁకునుండి దొఱకోగం జాలితి న్లీలమై. 94

వ. నీది నీకు బ్రహ్మార్పణబుద్ధి నొసంగుచుంటిం గొను మని వానిచేతి
కిచ్చి నీవు మే లగు నని వానిచే ననిపించుకొని తనకై వచ్చిన దేవ

యానంబున దివంబునకుం జనియె నంత మాధవుండును బయనంబై చని చని యొక్క ఋష్యాశ్రమంబునఁ దపంబుసేయుచున్న గాలవుం డనుమునిం గాంచిన నతండు. 95

—* మాధవుఁడు గాలవాశ్రమమున కరుగుట *—

ఉ. ఎవ్వఁడ వీవు నీయునికి యేనగరంబునయందు నీదు పే
రెవ్వలనం బ్రవర్తిలెడు నెక్కడి కేగుదు నీదుమోమునన్
నెవ్వఁగ నాట్య మాడెడి ననింద్యచరిత్రుఁడ విట్టిరట్టు నీ
కెవ్విధి బాపరించె విన నెంచితిఁ గొంచక చెప్పు మంతయున్. 96

చ. అనుఁడు నతం డను న్మధురయందు వసియించెడువాఁడ విప్రుఁడన్
ఘనులు మదీయవంశజు లఖండయశంబును గొన్నవారు నే
ననదను మాధవుం డనెడునాఖ్య వహించినవాఁడ నాదుక
న్యను హరియించె వంచకుఁడు నాఁబడువాఁ డొకరుండు వింటివే. 97

క. ఆనాకన్నియ వెదకుచు
నానాదేశములు వీండ్లు నానానగముల్
నానావనములు దాఁటుచు
నే నీకడ కరుగుదెంతు నిట్లు తిరుగుచున్. 98

వ. నాకన్నియ నీకంటికిం గాన వచ్చెనే యనిన నతం డతని కి ట్లనియె.

క. నాకుం దెలియ దొ కింతయు
నీకన్నియజాడ యైన నే వింటి నిటన్
గాకులకై కట్టినవల
నేకన్నెయొ పడియె ననుచు నిందఱు చెప్పన్. 100

వ. అని విబుధుం డనుశిష్యుం బిలిచి యీనడుమ నీ వొకకన్య వలలోఁ బడిన దంటి వది యెట్టిది చెప్పు మనిన నతం డి ట్లనియె. 101

మ. ఒకపద్మంబున రెండుకల్వ లగు నోహో యంచునూహించులోఁ
బ్రకటంబై యమృతాంశుబింబమున భాస్వ ద్రేఖ పీయూషమున్

సుకృతాత్ముం డగుమేటి కౌ నని రసజ్ఞుం గూడి భాసిల్లు న
ట్లు కన న్వచ్చెను గన్యమోముపయి దృష్టుల్ వెట్ట నప్పట్టునన్.

మ. మొగముంగన్నులుకంఠమున్ ప్రబపదముల్ పొల్పొందుజంఘాదు లో
ప్పగఁ జూడఁగ ధననాధునింట వసుసంపూర్ణంబులై పొల్పునం
దగుమూడార్నిధులో యనం దలఁప నై తాత్పర్యముం గూర్చె నా
దగు చిత్తంబున కానెలంతుక మదీయాక్షిద్వయిన్ జేరుచున్. 103

ఆ. వాడివత్త లైనవదనంబునన్ ఘర్మ
బిందువులును గన్నులందు బాష్ప
బిందువులును గల్గి విధుమండలం బిది
యేమొ యనఁగ నొప్పె నామెముఖము 104

క. అరచేతులు నరకాళ్ళన్
గర మరుదుగ నెఱుపుడాలుఁ గలిగి తలిర్చున్
తరుణీమణి యాసుందరి
ధరణీశ్వరపుత్రి యనుచుఁ దలఁపఁగ వచ్చున్. 105

వ. ఇట్లు వర్ణింపం దగి చిక్కంబునం బడి యున్నకన్నెమిన్నం గని
మే మామె కేమియు నపాయంబుఁ గలుగ కుండునట్లు క్రిందికిం
దింపి సేదఁ దేర్చి జలంబులు ద్రావ నిచ్చి యొక్కచో శయనింపం
జేసితి మామెయు సొమ్మసిల్లి శయనించి నట్ల శయనించి యెవ్వ
రికిం జెప్పక యెప్పుడో లేచి పోయిన దామె యెవ్వరో యెందుఁ
బోయినదో యేమి యైనదో మే మెఱుంగ మనిన గాలవుండు
మాధవునిం గని బ్రాహ్మణోత్తమా! యిక్కడి కొక్కింత దూరం
బులో భార్గవాశ్రమంబు గల దందు నీవు కొన్ని నా ళ్లుంటి
వేని కొన్నికొన్ని జాడలు తెలియ వచ్చెడిని భార్గవుండు ని న్నాద
రించు ననిన నతం డతనికి వలగొని పయనం బై కతిపయప్రయా
ణంబుల భార్గవాశ్రమంబునకుం జనియె నదియును. 106

సీ. శ్రుతులు ఋగాదులు శ్రుతిహితంబుగ నాల్గు
నధ్యయనము సేయునట్టివారు
శబ్దశాస్త్రాదులు షట్ఛాస్త్రములు నొగిఁ
బట్టి పఠించెడునట్టివారు
స్మృతులు మన్వాదు లంచితపురాణములు బ్ర
హ్మాండాదులఁ జదువు నట్టివారు
సుశ్రుత చరకాది శుభకరాయుర్వేద
ఘట్టము లెఱిఁగెడు నట్టివారు
తే. బ్రాహ్మ్యవాయవ్య పార్జన్య వారుణాది
బహుతిరస్త్రములను ఫలప్రదము లైన
వివిధశస్త్రముల న్వింట వ్రేయ నేర్చు
నట్టివారును జూపట్ట రాశ్రమమున. 107

—♦ మాధవుండు భృగ్వాశ్రమమున నివసించుట ♦—

వ. అట్టి పరమాశ్రమంబుఁ గాంచి మెచ్చుచు నచ్చేరువన ముకుళిత కరకమలుండై నిలువం బడి మాధవుండు చూచుచుండె నంతలో పల నటఁ దపించుభార్గవుం డాతనిం గాంచి కులగోత్రనామాదు లడిగి యేవోచెప్పం దెలిసికొని నీవు మాయాశ్రమంబునఁ గొంతకాలం బుండి మనోభీష్టంబు లొందఁ గల వనిన నతండు నేను ధన్యుండఁ జరితార్థుండ నైతి నని తదాజ్ఞంజేసి మునిన్ సేవించుచుఁ బూవులుం బత్తిరియుం దెచ్చుచు విద్యార్థులకు వేదములు వల్లె వేయించుచు దినంబులు గడుపుచుండె నప్పుడు. 108

క. మునికిని మునిశిష్యులకును
ఘనుఁ డగుమాధవునిమీఁదఁ గడునాదరమున్
గనికరమును బుట్టి మనం
బున నాతని గౌరవించి పోషించి రటన్ 109

వ. ఇట్లున్నప్పుడు మాధవుండు ప్రత్యహంబును. 110

మ. తనకృత్యం బది యంతయు న్సలిపి యాతర్వాత వ్యాయామముం
బొనరం జేసెడిచోటికిం జని యటన్ మోదంబునన్ దత్క్రమం
బును వీక్షించుచు నుండు న ష్టాకమునీట్పుత్రుండు శస్త్రాస్త్రవి
ద్య నెఱి న్నేర్చుచు నుంటఁగాంచి మిగుల న్దాత్పర్యముం జేయుచున్.

—• మాధవుఁడు మునిపుత్రులఁ బ్రేమించుట •—

ఉ. ఆతఁడు శస్త్ర మేసినపు డస్త్రము నేసినయప్డు మల్లుఁడై
చేతుల నన్యు నెత్తి పడఁ జేద్పుడఁ ద్రోచినయప్డు నుబ్బుచున్
జేతమునందు వానిపయిఁ జిన్నతనంబున నుండి యెర్గిన
ట్లాతఱిఁ బ్రీతి సేయు నెనరారఁ గను గొనుఁ బిల్చుఁ జెంతకున్.

చ. ఇతఁడు మధువ్రతుం డనఁగ నింత వితర్కము సేయుచుండు నం
చితముగ మాటలు న్నడలుఁ జెయ్యులు తద్విధమున్ స్ఫురించు నీ
చతురుని నీ వెవండ వని సంజ్ఞ యొనర్చిన నేమి చెప్పునో
మతి నగు సందియంబునకు మాఱగు పెంచినఁ జింత యయ్యెడిన్. 113

చ. అతఁడును మాధవుం దనదునయ్య తెఱంగునఁ జూచుచుండు నీ
కత వివరించు మం చెపుడుఁ గాని రవంతయుఁ బృచ్ఛ సేయఁ డి
ట్లితఁడు నతండు గోరికలు నీరిక లెత్తఁగఁ గొన్నినాళ్లు లా
ఘ్రీతి వసియించి రెంతయును సిల్గు మనంబులఁ గల్గి యుండఁగన్. 114

వ. ఇట్లుండియుఁ గొంతకాలంబున కాబాలుండు జయంతుం డను
నామంబుఁ గలవాఁడనియు రామనాథపురవాసి యనియు నితరుల
వలనం దెలిసికొనియె నంత మఱియు నయ్యాశ్రమంబున. 115

సీ. సుకుమారదేహము సురుచిరం బగుపేడి
మొగమును సోఁగకన్నుగయు మిగుల
నుగ్గులు దీరిననునుసోఁగ వెండ్రుకల్
క్రుంగినమెడయును గూనునడుము

ఆ మరతూండ్లు నాఁ గోమలము లయిన
కరములు తళుకు లీన్ కరరుహములు
కడుసన్న మైన నెన్నడుము విశాలజ
ఘన మనంటులఁ బోలుకాలుదోయి

తే. మృదులవాచాస్వరంబును మెత్త నయిన
హృదయమును గల్గి మెలమెల్ల పదము లిడుచు
విల్లు విద్యను గఱచెడువిప్రసుతునిఁ
గాంచి యెంతయు సందేహకలితుఁ డగుచు. 116

చ. జవజవలాడు నెన్నడుము చక్కఁగ మెట్టుట కేనిఁ జాలఁ డీ
వెవ రన నుత్తరం బిడఁగ నేనియు నేర్వఁడు చేతు లెట్టి చెం
దొవలకు నీడు వచ్చుఁ దమిఁతో విలువిద్యల నేర్వ నుండు రూ
పవు నెలనాఁగ నాఁగఁ గడు నచ్చెఱు వయ్యెడు వీనిఁ జూడఁగన్. 117

క. నవ్వఁగాని యెపుడు నలువురితో నిచ్చఁ
గలసి మెలసి యుంట గాని త్రుళ్ళి
పడుట గాని యెపుడు పరికింపరాదు త
న్ముఖమున న్వికారము గన వచ్చు. 118

క. వీనిమీఁద నాకుఁ బ్రేముడి ఱెట్టించు
వీఁడు నన్నుఁ జూచి విడిచి యెగ్గు
పలుకరించు నేను బలుక కుండినఁ గాని
నేను గన్నబిడ్డ యగానో వీఁడు 119

ఉ. ముదిరెనుగాని నాదయిన మోమును నీతనిమోము నొక్కటా
పదనున నుండె నవ్వులును బక్కలుఁ బొంకము నావి వీనికిం
గుదిరె నటంచుఁ జెప్పుదురు కొందఱు మానిసిఁ బోలుమానుసుల్
పొదలెద రీతఁ డాడు దయి పోయిన నాసుత యంచు నెంచ నా. 120

తే. నీ వెవరు చెప్పు మో యన్న నేను విందు
జనిన జాబాలి ననఁ గాని యన్య మెదియు

నెప్పుడుం జెప్పఁ డీబాలుఁ డెవనివాఁడొ
నామదిం జూఱఁ గొనియెడు నేమి చెప్ప. 121

వ. అని విచారించుచుఁ గాలంబుఁ బుచ్చుచుండె. 122

—* మునిపుత్త్రుఁడు పులినిఁ జంపి మాధవుని రక్షించుట *—

తే. మాధవుం డట్లు కొన్నాళ్ళు లాధరిత్రి
నుండి భార్గవునకుఁ జెప్పి యొండుచోటి
కేగువాఁ డయి పయనమై భాగవతులు
కొంద ఱరుదేరఁ గాఁ జనెఁ గొండదారి. 123

ఆ. కొండదారిఁ బట్టి కొంతద వ్వరుగఁ గాఁ
గోలుపులి యొకండు ఘోరశబ్ద
మడవి మాఱు మ్రోయు నట్లు ఱంకె వైచి
దారినడుమ నపుడు తారసించె. 124

ఉ. భాగవతుల్ రయంబునను బాఱఁగ జొచ్చిరి మాధవుండు నా
లో గతసాధ్వసుం డగు చలోలమతిం బులి నడ్డగింపఁ బోఁ
గాఁ గడురంహ మేర్పడఁగఁ గాయముమధ్యము వట్టి నెట్టనన్
భాగవతుల్ కనుం గొనఁగఁ బాఱెను భార్గవునాశ్రమాశకై. 125

క. కఱచుకొని నోట మనుజుని
బఱచెడుకోల్పులిని జూచి భార్గవశిష్యుం
డరసి ససంభ్రమముగ మేల్
శర మొకఁ డరివోసి యేసి చంపెం దానిన్. 126

క. పులినోటినుండి నేలకు
దలక్రిందుగఁ బడినబడుగునరునిం గని మైఁ
జలినీళ్లు జల్లి నోటన్
జలముల నిడి విసరె గాలి చల్లగఁ దాఁకన్. 127

వ. దానం జేసి యతం డింతలోన సేదదేరి చెంత నున్నమునిపుత్త్రిం
గాంచి యతండు భారవునింట దాను ప్రేమించిన బాలుం డనియు

జయంతుం డనియుఁ బులిని సంహరించి తన్నుం బ్రదికించె ననియుం దెలిసికొని వానిం బొదివి గాఢాలింగనంబుఁ గావించి పెండ్లికొడుక వై దీర్ఘాయుష్మంతుఁడవు క మ్మని దీవించిన నతండు. 128

—• మాధవుండు మునిపుత్రి నాశీర్వదించుట •—

తే. విప్రు నాశీర్వచన మెప్డు వృథ యగుటలు
కనము విన మెప్డు మీయన్నకరణి నాదు
కడ వృథా వృథ యయి పోవుఁ గాదె? యనుచు
నగచుచుంటి విరక్తుఁడ నగుటఁ జేసి. 129

తే. అనుడు నివ్వెరపడి మాధవాఖ్యుఁ డనియెఁ
బిన్న వింతవిరక్తికి నెన్నఁ గతము
కానఁబడ దేను బలికినకరణిఁ గాక
తప్ప దిటు నూర్యుఁ డటు లయి తప్పె నేని. 130

ఉ. నీ వెవ రేకతంబున వనిం దిరుగాడుదు నీదుతండ్రి పే
రేవగ నుండుఁ జెప్పు మన నే నిటఁ జెప్పిన లేదు లాభ మా
దేవుఁడు నైన నావెతలు దీర్పఁగఁ జాలఁడు జాలి పుట్టెడున్
నీవు వినంగ నేమిటికి నీదగుచిత్తము తత్తఱింపఁగన్. 131

వ. ఓయీ! నీ వెవ్వరో నై దేశికుండవు నీ వేమిచేయుదువు నీకు నా వెతలం జెప్పిన నేమిప్రయోజనం బగుఁ గావున నన్నింక బాధింప కుము నా కాజ్ఞ యి మ్మని చనియె. మాధవుండును దనవృత్తాంత మా భార్గవునకుం జెప్పి తదనుజ్ఞం గొని యనంతపురంబునకుం బోవు వాఁడై పయనంబై చనియె నంత నమ్మార్గమధ్యంబున నొక్కతటా కంబు చూపట్టె నదియును. 132

—• త టా క వ ర్ణ న ము •—

తే. రక్తపద్మాకరము మధురజలపూరి
తము మధుకరసేవితము మత్స్యప్రకీర్ణ

మమలహంసనమంచిత మయి సరోవ
రము కనులపండువై కాననమున నొప్పు. 133

ఉ. తామరపాకులం జలము దాఁకొని యుండఁగ నల్కలంకులన్
గోమలపద్మషండములు గ్రొందలిరాకుల వీఁక లీనఁగా
శ్యామలగౌరవర్ణకలితావనిఁ బ్రోగుగ నిడ్డకెంపులో
నా ముదమావహిల్లఁగ నొనర్చె సరోవర మీక్షకాళికిన్. 134

క. తీరుగఁ దామరపాకులఁ
జేరినజలబిందువులు ప్రసిద్ధతరములై
ధారణి హారుముంజిం గల
పేరగుముత్యములు నాఁగ వీక్షింప నగున్. 135

సీ. పద్మముఖంబులున్ బహుమత్స్యనేత్రముల్
హంసకూజితనూపురాదికములు
చక్రాంగగమనముల్ శంఖకంధరములు
భంగహస్తంబులు బాహులతలు
పర్వతస్తనములు ప్రపదకచ్ఛపములు
శైవాలకేశపాశప్రతతులు
దివ్యద్విరితతి చలద్దేహాయష్టులు బహు
విధపుష్పనఖరముల్ వితతశాలి

తే. జంఘలును గల్గి గంభీరసారహృదయ
మున నమృత మొల్కుచును జగజ్జనులఁ బ్రోచు
నట్టిజీవశక్తిని గల్గినట్టి దగుచు
సరసి యది పొల్పెసఁగు నాదిశక్తి యనఁగ. 136

— ♦ పు రు ష ద ర్శ న ము ♦ —

వ. ఆసరోవరంబు తీరంబున. 137

సీ. వెల్లకితల గాఁగఁ గాళ్ళనుం జేతులు
నట్టు నిట్టును బడునట్లు చాపి

నో రట్టె తెఱచి కన్నుందోయి మోడిచి
దీర్ఘనిశ్వాసంబు దీటుకొనఁగఁ
గట్టినపుట్టంబు నట్టిట్టు విడివడ
లాలాజలము గాఱఁ గాలు వగుచు
నక్కలున్ గ్రద్దలు నలుతట్టుల న్మూగి
కడుపుచి చ్చార్చుకోఁ గనుచు నుండ
తే. దేహ మంతటఁ జీమలు దిరుగుచుండఁ
గాలు నాలుగుమూలలు గ్రమ్ము కొనఁగ
గుణపమో యని జను లనుకొనెడు నట్లు
పండుకొనియుండెఁ బురుషుఁ డొక్కండు నేల. 138

వ. మాధవుం డది శవం బని దానిచెంతకుం బోక దవ్వుగాఁ జలా
శయంబునం దిగి జలంబు లాని శవంబుపై దృష్టి నిగిడించి సమీా
పించునంతలోఁ గాకగృధ్రజంబుకంబులు తొలంగి పోవుటయు
నిశ్వాసశబ్దంబు విన వచ్చుటయు నెఱింగి శవంబు గా దనియు నలసి
యెవ్వఁడో యొడ లెఱుంగక పడి నిద్రపోవుచుండె ననియు నిశ్చ
యించి యీాఁగలం జీమలం బోవఁ ద్రోలి కొన్ని జలంబులు తెచ్చి
నోటం బోసి మఱికొన్ని మోమునం జల్లినంతఁ గొంత సేపటికి కతం
డుహ్వా యని జృంభణంబుఁ గావించుచు లేచి మేను సవరించుకొని
కన్నుఁ దెఱచి యెదుట నున్న మాధవుం జూచి తన్ను హరించిన
వాఁ డని యులికిపడి మఱియుం గన్నులు మూసికొని. 139

క. న న్నిట్లు సేయుకంటెన్
నిన్నున్ భజియింతుఁ దండ్రి ! నీకరవాలం
బున్నది నాకంఠమ్మునఁ
గ్రన్నన నిడి త్రుంప రాదె కారుణ్యమునన్. 140

వ. అని మఱియు నతిదైన్యంబునం బలుకుచున్నంత మాధవుండు. 141

శా. నీ వ్వూహించినవాఁడఁ గాను ద్విజుఁడన్ నే నాదుకర్మంబువ
న్నోవం జాలెద నీసరోవరము దాపుం జేరఁ బో నీ విటన్
జీవంబుం బెడఁబాసినట్టిఁడు బలె న్నిద్రించుచుండంగ నీ
పై వారిం జిలుకంగ లేచితివి చెప్పం జెల్లు నీచొప్పులన్. 142

మ. నిను హింసించెడివాఁ డెవం డెటులు నిన్ హింసింపఁగాఁ జొచ్చె నా
తని కె గ్గేమి పొనర్చె తీ విటకు నేదారిం బ్రవేశించి తే
విన నా నే నెఱిఁగింపు మన్న నతఁ డో విజ్ఞానపాథోనిధీ !
విని యే నేమి యొనర్తు రిట్లు విధి న న్బీడింపఁగా నుండఁగన్. 143

వ. అయినన్ జెప్పెద నాకర్ణింపుము. 144

— † పురుషుండు తనవృత్తాంతముఁ జెప్పుట †—

ఆ. నేను జూచుచుండ నానెలంతుక కొప్పు
పట్టి తిగిచి కాల నెట్టి కొట్టి
కట్టి రెండొ నన్ను ఖలులు హింసించియు
గోత్రకందరమునఁ గూలఁ ద్రోచి. 145

వ. దానిముఖంబున నొక్క-శిలాఫలకంబు వెట్టి పోయి రాకర్ణింపు మగ్గుహాగేహంబు. 146

సీ. ముకుదోయి బ్రిద్దలై పోయెడుగా లందుఁ
బ్రితిఫలకమునకుం బట్టి యుండె
నూదికిన్ ఛేదింపఁ జొప్పడ నట్టు గా
గాఢాంధతమసంబు గలిగియుండెఁ
గత్తుల కెత్తుగుక ఱకుఱాల్ మొత్తము
లై నాల్గుమూలల నమరి యుండె
ననిశంబు గింగురు మనియెడుశబ్దము
సాధ్వసదం బయి సాఁగి యుండెఁ

తే. దేళ్ళు జెఱ్ఱులు పాములు తెలుప నేల
యంధతామిస్ర మను పేర నైననిరయ

మది యనం జను మృగరాజ మందు సతము
కాపురం బుండు నెవ్వారికంటఁ బడక. 147

శా. ఆరే యంతయు నాగుహాంతరమునన్ హస్తంబునం బ్రాణముల్
గూరం బీతున నుంటి నంతటను వేఁగుంబొద్దు గా నాగుహం
జేరన్ సింహము వచ్చి ద్వారమునకుం జేర్పంగ నాఘ్రాతినిన్
నోరం దోసి ప్రవేశము స్సలిపి నన్నుం జూచి గుర్రెట్టుచున్. 148

సీ. కబళింతు నొకపెట్ట కంజజాండం బను
పాటి సెప్పెడు తెఱనోటితోడఁ
బర్వతావళి నొక్కపట్టునఁ బెకలింపఁ
గల ననువజ్రనఖములతోడ
మృత్యుదంష్ట్రలకన్న మిక్కిలివాడి యన్
పేరు నొందిన కోఱపెచ్చు తోడ
ఘట్టనంబున భూమి నట్టిట్టుఁ బడఁ జేయ
నోపినమీఁగాళ్లకోపు తోడ

తే. నేపుఁ జూపెడుపెంజూలుం మోపుతోడ
నాఁకి వజ్రము నటిగించు నాల్కతోడ
నింత యనరాని పెన్‌బొబ్బరింతతోడ
రాజుచును వచ్చె నట సింహరాజ మపుడు. 149

తే. చెంత కరుదెంచి మూచూచి కొంతకొంత
నామెయి న్నాఁకుచును ముట్టె నాదుపొట్ట
మీఁదఁ బెట్టియు గురుగురునాదు పుట్టఁ
గూసుచుండి న న్నొడిలోనఁ జేరఁ దీసె. 150

వ. అంత సూర్యోదయం బయి చీఁకటి వో సింహరాజంబు కన్ను
మోడ్చి యున్నయప్పు డెట్లో తప్పించుకొని వెడలి వచ్చితి నెట్లు
వచ్చితినో చెప్పఁ జాలం గాని యీకాసారతీరమ్మునఁ బడ్డది పాటు

గాఁ బడి నిద్రవోయితి నవ్వల నేమి జరిగినదో నే నెఱుంగ ననిన
మాధవుండు వాని కి ట్లనియె. 151

తే. సింహమిత్రుఁడ వీవు నీచేత లెస్స
నిన్ను మిత్రుని బలెఁ జూచి నేను గొంచుఁ
బోదు నాతోడ రమ్ము నాపోవుకడకు
ననుటయును సింహమిత్రుఁ డి ట్లనుచుఁ బలికె. 152

ఆ. పరితోడ నేగ నేను నాతో నేరు
నేగుదేర వలవ దేను దక్షి
ణమునయందుఁ బేర్మి నమరుసంయమనికి
నేగుచున్నవాఁడ నెఱుఁగు మీవు. 153

వ. అనిన మాధవుండు మఱియును. 154

క. ఆసంయమినీపురికిం
బో సమయము నీకు లేమిఁ బోలింపం గా
నాసింహామైత్రి చెప్పెదు
నోసాహసవిక్రమాంక! యుడుగుము దానిన్. 155

—† మాధవునకు జనసమూహము కానవచ్చుట †—

వ. అని యెంతబోధించిన నతండు తనతో వచ్చుట కంగీకరింపమి నెఱింగి యోసింహమిత్రా! నీవు నామిత్రుండ వని ని న్నింతగా బతిమాలు చుంటి నింక నీయిష్టప్రకారంబునం బ్రవర్తింపుము నీతో నా కేమిటికి నని వానిఁ వీడ్కొని కతిపయప్రయాణంబులఁ గాంతారంబుఁ గడప నీది జనపదంబునకుం జేర నరిగె నంతలో ననంతపురంబు ప్రాంతంబున రక్షకభటులును జనసమూహంబును బోగుపడి పెద్ద కోలాహలంబుగాఁ బోవుచుండ నిది యేమి యుత్సవం బని యందుఁ గొందఱ నడిగిన వారును. 156

తరువోజ. ఒక కాంత భూమీశు నుకుసౌధమునకు

సీ॥ మారుని జంపి సొమ్ములు మణులు
చూఱలాడి గమించెఁ జోరత్వమెసఁగఁ
బ్రకటితమైనంత రక్షకభటులు
రమణి రాసుతతోడ రవణాలతోడ
నొకచోటఁ బట్టి రాజోత్తమునకును
నొగిఁ జెప్పఁ గొనిపోవుచుండిరి కనుమ. 157

శా. హత్యాదోషవిచారణ స్సలిపి గోత్రాధీశుఁ డీకాంతకున్
దైత్యస్త్రీకిని బోలె దండ మిడుటల్ తథ్యంబు రూపించుటల్
నిత్యప్రక్రియ సర్వము న్నడచుటల్ నిక్కంబు తద్దర్శన
ప్రత్యాసత్తిని వత్తు రత్తఱిఁ బ్రజల్ వాంఛించి యిచ్చోటికిన్. 158

వ. అనిచెప్పిన మాధవుం డప్పటికి నప్పురంబునకు వచ్చి తత్తద్వృత్తాంతం బంతయుం బరిశీలింతుం గాక యని నిశ్చయించి రామనాథ పురంబున నెవ్వరినో భార్యాభర్తలం బట్టి కారాగారంబునం బెట్టి రని విని యాలో దానిం బరిశీలించి వత్తు నని యచటికిం జనియె నని చెప్పిన శ్రోత లవ్వలివృత్తాంతంబుఁ జెప్పు మని కథకు నడుగుటయును. 159

ఆశ్వాసాంతము.

గ ద్య ము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ,
వేదవిద్యావిశారదాది బిరుదవిరాజమాన
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిప్రణీతం బయిన
మధుకరవిజయం బనుప్రబంధంబునఁ
జతుర్థాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీరస్తు

# మధుకరవిజయము

## పంచమాశ్వాసము

వ. అక్కథకుండు శ్రోతల కిట్లనియె. నట్లు మాధవుండు తన్ను వీడ్కొని చనినయనంతరంబ సింహమిత్రుండు సింహశార్దూలసేవితంబు లగు నానారణ్యంబులు తిరిగి తిరిగి యెందునుం దనపుత్రునిం గాని కళత్రంబును గాని కాన కందందుఁ దిరుగులాడుచు నొక్క పక్కన సమీపంబున సంజపడుచుండ శయనించిన యాలమందం గాంచె నదియును 1

సీ. మగజాలజిగికి నెత్తుగుజిగి బిగి గల్గి
మిఱుమిట్లుఁ గొలిపెడుమేను లలర
సింగంబు నేనియుఁ జించి వేయఁగఁ జాలు
కోదమయీటెలఁ బోలు కొమ్ము లలర
నిద్రనీలముతళ్కు లీనుచుఁ గరుచు లిలఁ
గప్ప జాల్కొటుకకన్ను లలరఁ
బాలుకాలువఁ గట్టి పాఱఁగా నేల నిం
పొదవ జీరాడుపెంబొదుగు లలర

తే. నడుమ మంచెయు లేఁగలు నడరఁ జుట్టి
మండలాకృతిగా ముఖమండలములు
వెలుపలకుఁ బెట్టి చదు నైనతలమునందుఁ
బండుకొని యుండె నట్టిలు తండము లయి. 2

క. ఆమందచుట్టుఁ దిరుగుచుఁ
ప్రేముడియున్ భక్తి చాలఁ బెంపొందం గాఁ
గోమలరూపుం డొక్కరుఁ
డామెయి నరయంగ వచ్చె నామిత్రునకున్. 3

వ. అపుడు వానిసమీపంబునకుం జని సర్వాంగ పరీక్షం జేసి సంత
సించుచు సింహమిత్రుండు వాఁడు తన కొడు కని నిశ్చయించి
సమాదరంబున ని ట్లనియె. 4

శా. నిన్ను న్నీతలి నీదుచెల్లెలిని నీ నెయ్యంపు జెల్వం గనం
గన్నుల్ గల్గనివాఁడ నై తిరిగితిన్ గాంతారభూభాగముం
దన్నా ! నీ విట నాదుకంటఁ బడి తే నత్యంతధన్యుండ నా
కన్నుల్ చల్లఁబడెన్ మనోవ్యథయుఁ బోకారెం గుమారోత్తమా. 5

వ. అనిన గోపాలుం డి ట్లనియె. 6

ఉ. దైవము చెర్చు నంతయును దాపర మయ్యెడుఁ గాని కర్త యీ
భూవలయంబునందు నొకపూరుషుఁ డైనను గాఁడు దేనికిన్
భావమునందుఁ జింతిలుట భావ్యము గా దెటువంటి వానికిన్
గావున నిట్లు నీ వనుట కానిది నా వచియింప నొప్పెడిన్. 7

తే. నేను గోపాలుఁడను నాకు నీకు నెట్టి
బాంధవమ్మును దలఁచుటం పాడి గాదు
నన్ను నీకొడు కనుకొంట తెన్ను భ్రమయ
బ్రాహ్మణోత్తమ ! కరుణింప వలయు నన్ను. 8

వ. అట్లు చెప్పినను నమ్మ కతం డతనిహస్తంబు పట్టుకొని పరీక్షించి. 9

చ. హలకులిశాదిరేఖ లవి హస్తతలంబునఁ గల్గి రాజు గా
నలరఁగఁ జేయుటన్ దెలుపు నాత్మజునిం గన నట్టిలక్షణం
బులు గనరా విటన్ భ్రమయె పొందితి నంచుఁ గుమారు నాతనిన్
బలుకుల నాదరించుచు శుభం బగుఁ గా కని పల్కరించుడున్. 10

వ. గోపాలుం డి ట్లనియె. 11

చ. నినుఁ గనఁ జాలి పుట్టెడి ననింద్యచరిత్రుఁడ వీవు నీసుతుం
డని వచియింపఁ గాని విను మయ్య ! యొకానొకవిప్రబాలకుం
డనుభవి, నన్నుఁ బో ల్వయసు నాకృతియుం గలవాఁడు పాడ నే
ర్చును గవనంబు సెప్పఁ గడుసొంపలరారఁగ వ్రాయుఁజిత్రముల్.

ఆ. ముద్దు లొలుకు మొగము ముచ్చటల్ గలవాఁడు
పాదతలమునందుఁ బద్మరేఖ
లతని కలవు వానియడుగుజాడలలోన
నరసి యున్నవాఁడ నపుడు నేను. 13

ఆ. అతని కాలమంద లనిన నెంతయుఁ బ్రీతి
నాదు కడకు వచ్చి నాళ్ళు కొన్ని
యిచటఁ గడిపె నిచట నే శయనించె నే
నిడఁగఁ ద్రావె నెట్లొ యిన్ని పాలు. 14

శ్లో. గో పాల! పా హ్యనాథం వపా
పా పా ప హా కృపా మ ధు
ల క్ష్మీం చ దేహి లోకై క
క ల్ప నా భి జ్ఞ తా క ర. 15

తే. అనుచుఁ బద్యము సెప్పి యిం దాది నంత్య
మునను నీనాదుపే ళ్ళుండె ననుచుఁ బలికి
చనియె నాతనిఁ జూడఁ గ న్గొనినఁ దోఁచు
బ్రతుకఁ డనునంతవైరాగ్య మతనియెడల. 16

—† సింహమిత్త్రుఁడు సింహగుహకుం బోవుట †—

వ. అని చెప్పిన సింహమిత్త్రుండు వాని కాలమందలం బ్రీతి పాదంబులం బద్మరేఖలుం గల వని చెప్పుటం జేసి వాఁడు తనకొడుకే యని నిశ్చయించుకొనియు నామాక్షరంబున వ్యత్యయంబు గలుగుటం

జేసి యించుక శంకించుచు వానిన్ వీడ్కొని తా నెందుఁ బోవుటకుం జాలనివాఁడై జాలింబడి మేను జాలింప నెంచి తొంటిసింహ గేహంబునకుం బోయి తన్ముఖంబున విశ్రమించి యుండె నంతలో సింహంబు వచ్చి మిత్రునాఘ్రాణించి యతండు తొల్లి తా నరసిన వాఁ డనియు నప్పటి తనవిస్మృతియు నభినయించుచు గుఱువెట్టి లోనికి ముట్టితో న్నెట్టుకొనిపోయి యొక్కచో వెనుకకాళ్ళపైఁ గూరుచుండి మునికాళ్ళ నతని తనపొట్ట కద్దుకొని యుపలాలించుచుం గొంతసే పుండి యంతలో గుహాలోనికిం బోయి యొక్కతాళపత్రి గ్రంథంబును శ్యమంతకంబునుం బోని యొక్కమహారత్నంబునుం గఱచుకొని వచ్చి వానిపాదంబులకడం బెట్టె నంతలోన. 17

సీ. పంచాస్యమున మేలు పడయ నేరక యుండి
  ప్రణుతపంచాస్యుఁ డై ప్రతిభ కెక్క
నమలజటాపటలము గల్గి యొప్పక
  యమలజటాపటలమున నొప్పె
గజరిపు వయ్యును ఘనత కెక్కక పాప
  గజరిపునై చాల ఘనత కెక్కెఁ
గంఠీరవం బయి క్రాల కుండియు వేద
  కంఠీరవం బయి క్రాల నయ్యెఁ
తే. బింగదృష్టియు మిక్కిలి వెడఁదవక్షు
మధిక శాంతియు దాంతియు నమలబుద్ధి
శ్వేతభస్మాంగరాగము చెన్నుమీఱ
సింహ మప్పుడు తాపససింహ మయ్యె. 18

తే. అట్లు ముని యైనవానిని నరసి సింహ
మిత్రుఁ డీ ట్లను నెనరయ్య మీర లిట్లు
కావుటకుఁ గారణం బేమి కరుణఁ జేసి
చెప్పఁగాఁ జూడుఁ డనుచును జేసె వినుతి. 19

చ. ముని యను నేను గర్గుఁడను ము న్నొకనాఁటను గౌశికాశ్రమం
బునకు గమించి కొన్ని దినముల్ వసియించి యట న్మహోన్నతిం
దనరెడుపుస్తము న్మణియుఁ దత్పరత న్గొని వచ్చినాఁడ నం
దున నతఁ డల్గి చోరుఁ డగుదుర్జనుఁ డందుత సింహరూపమున్. 20

వ. అని శపియించె దానంజేసి నే నిట్లు సింహంబనై పూర్వస్మృతి గల్గి యుంటి నీరత్నంబు శ్యమంతకంబు వోలెఁ బూజితంబై దినదినంబును జాంబూనదంబుం గను నీపుస్తకంబున నానావిధకాయకల్పంబులు నణిమాద్యష్టసిద్ధులు నానావిధమణిమంత్రౌషధంబులు భూతభవిష్య ప్రభవాదులు లోనగునవి యెన్నో యున్నవి కౌశికుండు నన్ను శపించినప్పుడు నాపుస్తకరత్నంబులు నాకులంబునం బుట్టి తనగుహం జేర వచ్చినవాని కిచ్చినప్పుడు సింహరూపంబు విడిచి పోవు నని విశాపంబు పలుకుట లెఱింగి యున్న వాఁడఁ గావునఁ గౌశికుం డగునీ కిచ్చి శాపమోక్షంబుఁ గాంచితి నే నింకఁ దపోవనంబున కరిగెద నీవు వీనిం గ్రహించి యనంతశయంబునకుం బొమ్ము నీ కట మేలు చేకూరు నని చెప్పి చనియె సింహమిత్రుండును గొంతశాంతిం గలిగి గర్గుండు చెప్పినచొప్పునం గావించె. అంత నక్కడఁ జైత్రుం డానాఁ డట్లు మాలతీమల్లికల నశ్వంబుపైఁ గూరుచుండం బెట్టుకొని వియ న్మార్గంబునఁ బోవుచు మాలతీదర్శనస్పర్శనాదుల మనోజవికారంబు నంజేసి తనమనంబున. 21

—* మాలతిం గొనిపోవు చైత్రుని చిత్తజవికారము *—

సీ. మోహాంధకారంబు భువి నిండఁ గలిగింప
నేర్పరుల్ నిద్దంపు నెలఁత నెఱులు
చేతశ్చకోరముల్ ప్రీతి నందఁగఁ జేయ
నెఱజాణ కామిని నెమ్మొగంబు
సంతోషచంద్రికల్ సతతంబు నిల్ప స
మర్థంబు భామినీమందహాస

మధికార్తిశతు్రిసంహారంబుఁ గావింప
బాణముల్ కోమలివాలుఁగనులు
తే. కామమున నిస్వులై యున్న భూమిజనుల
స్వర్ణపేటిక బోఁటి లేఁబా్రియపుమెయి
వేయు నేటికిఁ జెప్పంగఁ బృథియందుఁ
బూవుఁబోఁడులఁ బోలినతీవు లున్నె. 22

వ. ఇట్లు సాధారణస్త్రీలవిషయమే మేధావులు చెప్పుచుండ నింక నీ సర్వలక్షణలక్షితయు సర్వాంగసుందరియు నగు నీమాలతిమాట చెప్ప వలయునా ? నే నీమె నెట్లయినంజేసి వశంవదం జేసికొనియెద నని నిశ్చయించుకొని. 23

సీ. వెనుక నొక్కింతెడగ నెసంగుమాలతి
నంత కంతకు దరియంగ నగుచుఁ
దనవీపు సకిఱొమ్ముఁ దాఁకించి మెలమెల్లఁ
గదలించి కదలించి కడకు నొక్క-
మరలు దిప్పుట కని మఱిమఱి యటు నిట్టు
మే నూఁగఁగా బిగ్గ మెలఁత నొరసి
కుదులుపున ననంగఁ గొట్టి చన్గొనలపై
బలువికారము లిట్లు ప్రిస్తరించి
తే. చైతు్రిఁ డుండుట మాలతి సంశయించి
మనమున స్వీనిచెయ్వులు మాఱుపుంతఁ
బడిన యట్లుండె ననుచును భయము పడియు
నిది గమనవేగగతి యని కుదిరి యుండె. 24

వ. వాఁడు నట్లు కొంతదూరంబు వోయినట్లు పోయి యొక్కచో నశ్వంబు నడవక స్తంభించి యుండుటంజేసి కాలవిళంబనంబుఁ గావించె దానికి సైఁప నోపక మాలతి రావుతుదిక్కు మొగంబై యి ట్లనియె. 25

చ. తపనుఁడు గ్రుంకిన ట్లయినఁ దప్పదు నాపతి కెన్న మెప్ప మా
తపఁ మదె చెట్లకొమ్మలను దాఁకఁగ వచ్చె నొకింతలో నదే
తపనునిబింబ మబ్ధిపయిఁ దాండవ మాడుచు మున్గి పోవు ని
ట్లపగమనంబ యైన మనయాన లవన్నియు మున్గి పోయెడిన్. 26

కం. తండ్రి! వేగమ తోలుము
తీండ్రించెడు వావురంబు తేగ్బె యిదేమో
గండ్రతనంబున మెలఁగెడు
గండ్రింపుము దీనిమంకు గావ యెల్లన్. 27

—† చైత్రుని కీలుగుఱ్ఱము నడవకుండుట †—

సీ. ఇది మోర పైకెత్తి యిట్టిట్టుఁ ద్రిప్పుచు
సకిలించు గురుగురుస్వనము దోప
నంగుగా నలుకాళ్ళు పంగటించుచు దోఁక
కడు పంటు నట్లుగా నడఁచి కొంచు
నిక్కించి వీనులు నొక్కొక్క కష్టు కదల్చుఁ
దలవంచి రోకరా గలుగఁ జేయుఁ
గళ మెత్తి నెత్తిపై గాటంబుగా వైవ
వెనక్క వెనక్కకుఁ బోవ వేయు నడుగు

తే. హూఁ! యనుచు నేయ నిదియు హూఁ! హూ! యటంచు
నెగిరిపడు మీఁది మీఁదికి నేగుచొప్పు
కాన వచ్చుట లే దెట్లొ కాని మొద్దు
పాటె నిదె పొద్దు గ్రుంకఁగ వచ్చె నటక. 28

ఆ. ఇట కనంతశయన మెంతద వ్వింతలో
నడచి వడిగ వడిగ గడియలోనఁ
జేరుకొందు మోటు చేయు మవ్విధ మైనఁ
బుణ్య మబ్బు నీకుఁ బురుషమూర్తి. 29

వ. అని వేగిరించుటయు నతండును. 30

సీ. మడమలఁ దాటించి నడఁచి పెంగక్కుల
కళ్ళెముం బిగలాగి సళ్ళఁ జేసి
నెత్తిపై గట్టుతో మొత్తి యత్తఱి ముని
గాళ్ళపైఁ గొట్టియుఁ జెళ్ళుఁ మనఁగ
నూపి ఱింతయు నాఁగ నోపి ముక్కులు నోరు
మూసియు వాలము ముడుత నెట్టి
యసితోడ మే నందు నందును గోసియుఁ
జు ట్టిన నగ్గి పై నూడనిడియు
తే. ఎన్ని యేనియుఁ జేయుచు నున్నవాఁడు
వలెను జూపట్టెఁ గాని యవ్వారువంబు
కదలి మెదలినజాడ యే కలుగ దయ్యె
వారిపయనమ్ము సాఁగనిపగిది నయ్యె. 31

—† సూర్యాస్తమయ వర్ణనము †—

శా. సంజెల్ వచ్చిన యప్ప్రత్యహము తన్ పంపంగ నే తెంచునా
మం దేహారుణులన్ నుథించుటకు నై మంత్రోదకం బెత్తి నా
రిం ధ్రోరించెడువార్బిద్ధ కగునార్తిం జూడ లే నన్న మా
డ్కిం దేజం బఱి మిత్రుఁ డాత్రపడుచుం గింపై పడె న్వార్ధిధిన్. 32

క. మిత్రుఁడు తానై యుండియు
మిత్రునికోడలికి నట్లు మిత్తి గలుగుచో
ధాత్రి మెలంగం దగ దని
గోత్రముపై నుండి జలధిఁ గూలం బడియెన్. 33

క. కెంజాయ లడరి యుడిగెన్
సంజయు సరిసడియె నపుడు సాంద్రంబై నిం
గిం జతపడియెన్ మబ్బులుఁ
బెంజీఁకటు లలముకొనియెఁ బృథివీతలమునన్. 34

క. పుడమి యిది యాకసం బిది
కడ లియ్యవి యనఁగ రానిగతిఁ జిక్కఁగ నై
కడుకొని సూదులఁ బొడువఁగ
నెడ మింతయు లేక ధ్వాంత మెంతయు విరిసెన్. 35

వ. ఆసమయంబున మాలతి జాలింబడి కంటికిని మంటికిని నేకధారగా
నేడ్చుచు నశ్వచోదకుం జూచి యి ట్లనియె. 36

తరళము. బలివిధాన మ దేకతంబునఁ బాటి దప్పినదైన నా
చెలువునిం గన వచ్చు నంతయుఁ జెల్లియుండిన వానితో
వెలల వచ్చును మీఁదికి న్నను వీడ కక్కడి కేగఁ గాఁ
జలుపవే నడయాడి వచ్చెదఁ జక్క నీవెను వెంబడిన్. 37

వ. అనినఁ జైత్రుండు చిఱునవ్వు నెమ్మోమున మొలక లెత్త న త్తన్వింం
దరియ వచ్చి యి ట్లనియె. 38

—† చైత్రుండు మాలతిని బలాత్కరించుట †—

క. పడఁతీ! యిఁక నీప్రియుఁ డె
క్కడ? పిఠరక యోగి వానిఁ గడ తేర్పక యుం
డెడునది యెక్కడ? సర్వము
కడముట్టెం గార్య మింకఁ గన నే ముండున్. 39

క. నీ కామధుకరుతను వా
లోకింపఁగ నీరు కాన లో నీచింతన్
గాకుము వాకొందును నా
వాకులు చెవిఁ బెట్టు మిట్టిపట్టునఁ దెలివిన్. 40

తే. తాలి గట్టినమగఁడు గాఁ డేల నీకు
వానిపై నింతటివిరాళి వాఁడు చచ్చె
వానిపై నింక మోహము మాని వైచి
తగినవానినిఁ బెండ్లాడఁ దగును నీకు. 41

శా. ఏంతో దూరము పోవ నేమిటికి నేనే నీమగం డయ్యెదన్
సంతోషంబున నన్ను నేలుకొను మోహానా! నను బోలు సు
స్వాఁతుం డందము చందముం గలుగువాఁ డంతంతమేధావి శు
ద్ధాంత స్త్రీవరణీయుఁ డర్థపతి లేఁ డంచు న్వచింత్రెల్లరున్. 42

చ. కవితయుఁ జిత్రలేఖనము గానము కావ్యకథానులాపమున్
భువి నగునెల్లవిద్యలును బోహణచేసి యెఱింగినాఁడ భా
ర్గవుఁడును నీతిశాస్త్రమునఁ గాఁడు సమానుఁడు నాకు సత్కళల్
సవసవగా సమస్తమును సద్గురుసన్నిధి సంగ్రహించితిన్. 43

ఆ. కామశాస్త్ర మెల్లఁ గడముట్టఁ జదివితి
కూచిమారముఖ్యకోవిదులకుఁ
దీసిపోను నేను దెలియుదుఁ గళ లెల్ల
మన్మథునకు నేన మన్మథుండ. 44

ఆ. నీలకంఠయోగి నిత్యప్రసాదము
కలిమి సిద్ధు లెల్లఁ గరతలామ
లకము లేను మృతుల నొకక్షణంబున వెండి
బ్రదుకునట్లు సేయు ప్రజ్ఞఁ గొంటి. 45

చ. ధనములు ధాన్యము ల్మణులు దాసజనంబులు సౌధరాజము
ల్ధనదునికన్న మిన్నగను దండము తండములై మదీయముల్
గనఁబడు నెల్లవారల కిఁకన్ సురవల్లభు మించువైభవం
బును గల దంచు నీయడుగు ముట్టి వచించెద నంగనామణీ. 46

చ. హరుఁ డరచేనిలో నిడియె యచ్యుతుఁడో యెదయందుఁ జేర్చె వా
గ్వరుఁడు నిజాస్యమందుఁ గొనె వాసవుఁ డంకమునందు నుంచె నే
నరమర లేక లియ్య మగునట్లు పొనర్చెద నాతలోదరిన్
గర మనురక్తి గల్గికొని కావున నన్ను ననుగ్రహింపుమా. 47

వ. అని మఱియుం దరియవచ్చి కరగ్రహణంబు గావించుటయు నమ్మించుఁబోఁడి యించుక విదళించి వానిచేయి విడిపించుకొని ధిక్కరించుచు ని ట్లనియె. 48

—† మాలతి విమానంబునుండి క్రిందఁ బడుట †—

ఉ. నీ వొకసిద్ధపుత్రుఁడవు నెచ్చెలికాఁ డనుపంగ నన్నుఁ గొం
పోవఁగ వచ్చినాఁడ వొక బొజ్జను బుట్టినయట్టివాఁడ వెం
తో వగ కైనకార్య మని తోఁచుటఁజేసి భవత్సకాశమం
దీవరుస న్వసించితి నిఁ కే మని చెప్పెద నీదు చెయ్దముల్. 49

క. నను నెఱిఁగి యెఱిఁగి యివ్విధ
మునఁ బలుకుచుఁ జెనక నుంటి పోలునె కుమతీ!
నిను నీవ పొగడుకొనుచున్
ఘనుఁ డను నా కెవరు సాటి గా రంటి వహా! 50

క. నీ వెట్టివాఁడ వైనం
గావచ్చును గాని నాదుకాంతుని గా కే
నేవరునవాని నైన
భావించి పరింతు ననుట వట్టిది కాదే! 51

ఉ. అతనితోఁడ లోక మగు నన్యము లేవియు నాకుఁ గావు నీ
వీతరుణంబుపం బలుకు లిగ్గతి సేయుట లొప్ప దిప్పుడేఁ
బూతమనస్కనై ప్రకృతిఁ బొందుము డెందమునందుఁ దోడఁబు
ట్టేతెరళాక్షి యంచు నను నెంచుము నించుము కూర్మి నాపయిన్.

వ. అనిన హుంకరించుచు నతండు. 53

క. నీతులు చెప్పఁగ వచ్చితి
వీతఱి నీనీతు లెవ్వఁ డేర్పడ విను నీ
చేతోవీథిఁ దలంపుము
నాతత్త్వము నాదుశక్తి నాతుక! యనుచున్. 54

ఆ. నిన్నుఁ గాచు నెవఁడు నే నేమిచేసినఁ
జేయఁ గలను నిన్నుఁ జెలియ! వంట
యింటికుండవైతి వీ వింతయు నెఱింగి
సమ్మతింపు నాదుసంగమునకు. 55

వ. అని యెన్ని విధంబులం జెప్పిన నంగీకారంబు సూచింపక ప్రతిఘటించి పలుకుచున్న మాలతి నట్టె పట్టి గట్టిగఁ గౌఁగిలించుకొనుటయు నామె పెనఁగులాడి పట్టు తప్పించుకొని మేనిపై నాస లేనిది కావున నుప్పరంబునుండి తెప్పున నేలన్ గూలఁ బడియె నప్పు డామెయొడం బడ నున్న మల్లికం బట్టుకొని పడనీక కార్యంబు తప్పివచ్చిన దనియుఁ దనప్రయత్నం బంతయు విఫలం బయినదనియుఁ దాను వృథా స్త్రీహత్యం జేసినవాఁడ నైతి ననియుఁ జిత్తంబున నుత్తలంపడుచు నైనదానికి వగవన్ ఫలంబు లే దని ముందు వోవుటమాని వెనుకకు మరలి నిజపురంబున కరుదెంచి యొరు లెవ్వ రెఱుంగకుండఁ దన మందిరంబున మల్లికం బెట్టి కాపాడుచు నీ వృత్తాంత మంతయుఁ దండ్రికిం దాతకుం జెప్పిన వా రయినదాని కేమి చేయుద మని యుండి రంతం గొన్ని నాళ్ళయినపదంపడి యొక్కనాఁడు వారిక్రూర పరివారంబు వచ్చి. 56

—✻ దుండిపరివారము భార్గవు హింసింప నేగుట ✻—

ఉ. మాలతి భార్గవాశ్రమముమాటునఁ గూలెను మింటినుండి యం
చీలుగ లే దటంచు ముసియింటఁ దలిర్చుచు నుండె నంచు జం
ఘాలుఁ డెఱింగి మా కిపు డొకానొకవార్త నెఱుంగఁ జేసె మీ
కేలవిచార మందఱము నేగి కనుంగొని వత్త మిత్తఱిన్. 57

ఆ. ఇదియుఁ గాక మనల హింసించుటక భార్గ
వుం డెఱుంగఁ జెప్పుచుండె విల్లు
విద్య యనుచుఁ దెలిసె వేగమ మన మేగి
వానిపస యెఱుంగ వలయుఁ గాదె. 58

వ. అనిన నెల్లరు నౌ నౌ నని నంగీకరించి ధనుర్బాణతూణీరపాణులు
సర్వసన్నద్ధులు నై భార్గవాశ్రమంబునకుం జని సర్వప్రదేశంబు లరసి
మాలతిం గానఁజాలక భార్గవుని ధాన్యంబుగాదులంగొట్టువారై. 59

సీ. కరవాల ముసల ముద్గర గ దాసి భుసుండి
భిందివాలాదులు వివిధయుద్ధ
సాధనంబులు గొని సంయమీశ్వరునాశ్ర
మము ముట్టడించి రక్రమము దోఁప
మునిశిష్యు లెల్లరుం గని కూడుకొని వచ్చి
వల దిట్లపాయము వచ్చు మీకు
మాజోలికిన్ రాకుఁ డీజడదారి మి
మ్మేమి చేయం జాలఁ డేగుఁ డేగుఁ

తే. డనుడు వారిమాటలు విన కాదురాత్ము
లఘు మనక వారి నందఱ హత మొనర్ప
నెంచి నానావిధాస్త్రము లేసి శిష్య
సమితి నొంచిరి కోలాహలము లెసంగ. 60

వ. అట్లు నొంచి మించి పోరాడుచున్న సమయంబున. 61

—♦ జాబాలిజయంతులు దుండగీండ్ర నోడించుట ♦—

ఉ. చట్టులు చుట్టువాఱుకొని శస్త్రము లేయుచు దుండగీడులన్
గొట్టుఁడు వారు కొంతవడిఁ గొంచెము కించుతనంబు నొందియున్
బట్టినపౌరుషంబునను బాహుబలంబు చలంబు పేర్పడన్
బిట్టలఁ దోలునట్లు వెఱపించుచు నొంచుచుఁ ద్రోలి రందఱిన్. 62

ఆ. అట్లు తోలి కొలఁచుకొ ట్లన్నియుం గొల్ల
గొట్ట నున్నయప్పు డట్టె వారి
నటిమి గరిమమై జయంతుఁడున్ జాబాలి
యేసి రమ్ము లెన్ని యేని కనలి. 63

చ. అలఁతి యలంతి యేటులకు నాఖలు లింతయు లక్ష్యపెట్ట క
క్కొలఁచు హరించుచుండఁ గని కోలుమసంగిన కోపదృష్టి వా
రలను జయంతుఁ డాశుగపరంపరల న్నిగిడించి నొంచియున్
మలఁగక మారుతాస్త్రమభిమంత్రణముం బొనరించి శస్త్రమున్.

ఆ. విసరి వారిమీఁద వేయుటయును బ్రళ
యానిలంబు వోలె నది కడంగి
దుండగీండ్లదండు కొండలు దాఁటి పో
వెడలఁ ద్రోచె నొక్కవ్రేలుమిడిన. 65

వ. అట్లు దుష్టులెల్లరుం బ్రదెళ్ళుట విని భార్గవుండు జయంతజాబాలురం బ్రశంసించె ననిన శ్రోతల ట్లానాఁడు నీలకంఠునితోడం బోయిన మధుకరునిగతియేమి యయ్యె నెఱింగింపు మనుడుఁ గథకుం డి ట్లనె నట్లు నీలకంఠయోగి మధుకరుని విమానంబుపైఁ గూరుచుండఁ బెట్టు కొని గగనమార్గంబున మళయాళదేశంబునకుం జని యొక్కపురీవర పరిసరోద్యానంబునం డింపె నదియును. 66

—✻ నీలకంఠుఁడు మధుకరు నుపవనంబున దింపుట ✻—

సీ. వానకాళ్ళకు దీటు వచ్చి చక్కఁగ నున్న
పోకమ్రాఁకులతోడ జోక మిగిలి
కుతపవేళల నూర్యు నతిథిం బలె న్నత్తిఁ
గొనునారికెడముల గొనబు మిగిలి
యతనుతూఁపులప్రోవు లన నాఁకు గన రాక
పూచినమావులపొలుపు మిగిలి
యమృతమో యనువిమలామృతంబున నొప్పు
కేళాకుళులుతోడ లీల మిగిలి

తే. మల్లెలును మొల్లలును జాజు లెల్లకడలఁ
బొదలఁ బొగడలుఁ బొన్నలుఁ బొలుపు మిగుల

నందనోద్యాన మిది యనుచందమునను
బరఁగుఁ బ్రమదావనము కన్నుపండు వగుచు. 67

ఆ. చలువఱాలతోడఁ జదునుగాఁ జేసిన
బాట లెల్ల కడలఁ బరఁగు చుండు
నిలుపఁ బడియె నందు నీటియంత్రంబులు
దీపయంత్రములును దేజమిగుల. 68

ఉ. మాలతిపై మధువ్రతము మాటికి మాటికిఁ దేనె లానఁ గా
వ్రాలుటఁ గాంచుచున్ మధుకర ప్రవరుండు కడుంగడు న్వగన్
దేలుచు నేటికే యిటులు తేఁటి! పౌనర్భవు పేరు గొంటి నీ
కీలలి తే దటంచు హసియించుచు మించుచు నుంటివో కదే. 69

క. మాలతి! నీ కిటు తగునే?
జాలి యొకింతయును లేక సఖుఁ డని వన్నన్
బోలింప కిట్టు లన్యున్
లాలించుచు నుంటి వరయ లగ్గి యగునే. 70

సీ. తగుపచ్చఱాకట్టు మగఱాల గోడలు
నీలాలపని నెలఱాల మెట్లు
నవరంజి నెడఁ గూర్చునద్దాలకిటికీలు
పటికపునునుద్వార బంధములును
తమ్మికెంపులఁ జెక్కుతలుపులు వైదూర్య
ముల జిల్గుపని గలవలభితతులు
పసి గలపవడంపు వట్టువకంబముల్
మేలిమిజాళువా దూలములును

తే. మఱియుఁ జిత్రవిచిత్రముల్ మలయుపనులు
కలిగి కన్నులపండువై కనుఁగొనంగ
నొగి హజారం గలరారెడు నొక్కదివ్య
భవనమును గాంచె నవ్విప్రబాలకుండు. 71

మ. కులుకుం గుబ్బలు తొంగి తొంగి పయటం గ్రోడాడుచుండన్ గటి
స్థలి నొడ్డాణపుమువ్వ లందియలు పెల్చన్ మ్రోయుచుండంగ మం
డలకుం దాఁకుచు భృంగముల్బలెఁ గురుల్ నర్తించుచుండం గడున్
మళయాళాంగన లెందఱో భవనముం బాలించుచుం డెప్పుడున్. 72

తరళము. నిలువుటద్దము చెంత మాలతి నెయ్యుఁ డుండఁగ వేడ్కనె
చ్చెలి యొకర్తుక పైట పీడ వసించి నవ్వు మొగంబుతోఁ
గులుకు మేల్మొయిసొరు వానికి గోచరించెడు నట్లుగా
మెలఁగె నాతనిమీఁద వ్రాలెడుమేలు దోపఁగఁ జేయుచున్. 73

ఉ. అద్దములోన రమ్మనెడునట్లు స్ఫురించెడుహాస్తసంజ్ఞలున్
ముద్దు లొసంగు మంచుఁ గడుముచ్చటఁ జూపెడుమోముసంజ్ఞలున్
గద్దువఁ బట్టు సంజ్ఞలును గౌఁగిటఁ జేర్చెదనన్న సంజ్ఞలున్
గద్దరికత్తె లాతనికిఁ గన్గొనఁ జేసిరి తద్గృహంబునన్. 74

సీ. పయట జారఁగ నొక్కపడఁతి దాఁ బఱతెంచి
ఱొమ్మున గుమ్మొ పేరెమ్మొ నతనిఁ
జేలచెఱంగులు జీరాడఁగా నడ
యాడు చతనిఁ దాఁకె నతివ యొర్తు
పూబంతు లాడెడుఁ బో యనునెపమున
విసరెఁ బూ వతనిపై వెలఁది యొకత
చిమ్మనగొట్టానఁ జిమ్మె నాతనిపయిఁ
బడ మల్లె యత్తరు పడఁతి యొర్తు

తే. నన్నుఁ గయికొను మని యొర్తు సన్నఁ జేసె
నేను నీదాన నని యొర్తు నేర్పు చూపె
వలచితిని బ్రోవు మని యొర్తు పలుకరించె
నాగృహంబున మధుకరు నతివ లెల్ల. 75

మ. కులుకుంబొమ్ములఁ గుమ్మియున్ బదములం గ్రోడాడు వాలమ్ములన్
గలయం జుట్టియుఁ గౌఁగిలించియును వేడ్కన్ముద్దులం బెట్టియున్

బలుకుల్ తేనియ లొల్కఁబల్కియు నటం బద్మాస్య లవ్వానినిన్
వలలో వేసికొనంగఁ జాల రగుచున్ వర్తించి రత్యార్తిమై. 76

వ. ఇట్లనేకప్రకారంబులఁ బ్రవర్తించియు నతనికి మాలతియెడ విముఖత్వంబు గలిగింప నేరకుండిరి. ఇట్లు కొన్నినాళ్లరిగిన పదంపడి యొక్కనాఁడు. 77

—◆ మధుకరునకు మాలతి గానవచ్చుట ◆—

మ. ఒకపల్యంకమునన్ మనోహరునితో నుత్సాహముప్పొంగఁ గా
సుకముం గాంచుచునున్న మాలతిని దాఁ జూచాయ నీక్షించి కొం
చక తత్ప్రాంతధరిత్రికేగి దృఢవిశ్వాసమ్మునన్ మిత్రపు
త్రకుఁ డొక్కించుక కించువోలె వగచెన్ దద్దేహభూతాదృతిన్. 78

శా. నన్నుం గాదని నాదుప్రాణ మగుచున్ నల్వొందునాకాంత పా
పౌన్నత్యంబును బాటిసేయ కొరుతో హత్తంగఁ బొత్తింతలో
గన్నుందోయికిఁ గాన వచ్చెడిని నాకాలంబు దుష్టంబు నే
నన్నెంబున్ మఱి పున్నెముం దెలియ లేనట్టెండ నైతిం గటా. 79

తే. ఎన్నొ బాసలు చేసె నా కెన్నొ చెప్పె
నన్నియును గంగలోఁ ద్రోసి యన్నుమిన్న
యిట్లు చేసిన దక్కటా యేమియందు
నానొసట వ్రాఁత యీరీతి గా నెసంగ. 80

చ. ఒకగడెసేపు కానఁ బడకుండిన నేమి మనోహరా ననున్
గకవికలాడఁ జేయుదువె కా దిటు సేయఁగ నంచుఁ గోపమున్
మొకమునఁ జూపుచుండు నలమోహనమూర్తి మదీయజీవ మి
ట్లకటకటా! యొకానొకని యంకతలంబున నుండఁ గాంచితిన్. 81

క. మాలతి యీరీతిగ నా
జోలి విడనాడు ననుచుఁ జూచినవారల్
లీలఁ గనైనఁ దలంపరు
కాలం బీరీతి మార్పు కలిగించె నయో! 82

తే. అని వితర్కించి మఱియు ని ట్లని తలంచె
నిట్లు సేయదు నాసతి యెన్నఁడేని
కారణం బెద్దియే నిందుఁ గలుగ వచ్చు
ఖలులనిర్బంధమీరీతిఁ దెలియ వచ్చు. 83

మత్త. నీలకంఠుఁడు నన్నునుం బలె నీరజేక్షణ దీనినిన్
జాల మాటలు చెప్పి మోసము సల్పి తెచ్చి కడంక నీ
లీల నన్యునిసంగతిం బొదలించి యుండును గానిచో
నేల యిట్టియసంగతం బగుహీనకార్య మొనర్చెడున్. 84

వ. అయినను విచారించెదం గాక యని యింత చనినంతలో నయ్యింతి పల్యంకంబు నుండి దిగి మధుకరునిచెంతకుం జనుదెంచి యి ట్లనియె.

చ. మధుకర! నీకు నాకుఁ గలమానసబంధము లివ్విధంబునన్
వృథ లయి తెవ్వ నయ్యె నిఁక నేమని చెప్పిన నేమిలాభ మ
వ్విధమున నిన్నుఁ గొంచుఁ జని పిమ్మట న న్నటు తెచ్చి బల్మిమై
బథ మిటుగా నొనర్చె నలపండితుఁ డే మని చెప్ప నుండెదన్. 86

క. నీనాసంబంధము తెగ
నే నీపురుషున్ వరించి యిగ్గతి దాంప
త్యానంద మనుభవించుచు
నీనగరున నుంటిఁ జనుమి యీ వెట కేనిఁ. 87

తే. అంతఁ బల్యంకగతుఁ డగునప్పురుషుఁడు
హుంకరించుచు దిగి వచ్చి యోసి కులట!
నన్నుఁ గనుగప్పి విటునితో సన్నకసన
నాడుచుంటివె యని కోపితాత్ముఁ డగుచు. 88

వ. గద్దరించుచుం జేయి పట్టి తివిచి కొనిపోవుచు మధుకరునిపైఁ దీక్షణ దృష్టి నిగిడించి తల పంకించుచుంబోయె నంత మధుకరుం డదియంత యుం దనమదికి వింత గొలుపుటయు నింతలో దీని నడవడులు దీని

భావంబులు దీనిసంభాషణంబులు మాఱుపుంతంబడి యుండునట్లు తోఁచెడిని గానిమ్ము దేనికిని దైవమే ప్రమాణం బని నిశ్చలుండై యుండె నంత నీలకంఠయోగియును వీని నిట్లు సేయుటకంటె సింహశార్దూలాదులచేతం జంపించుటయ పోలు నని విమానంబుపైఁ గూరుచుండం బెట్టుకొని యొక్క మహారణ్యంబునం బడవైచి పోయె నంత నక్కడ. 89

— ✻ మధువైరి మధురకువచ్చి విచారించుట ✻ —

సీ. మధురాపురమున కామడ దూరమున నున్న
మధుపల్లి యనునూర మధురిపుండు
మాధవునకు మేనమామకుమారుండు
లోకవ్యదక్షుండు సల్లక్షణుండు
తనవారి కారీతి దైవ మయ్యె నటంచు
విని మధురకు వచ్చి వనట హెచ్చఁ
జనుదెంచి మాధవుసదనంబునకు నటఁ
బరిజనులను లక్ష్మి నరసి కరుణ
తే. అడుగ వలసినవిషయము లడిగి యడిగి
తెలియ వలసినసంగతుల్ తెలిసి తెలిసి
పరిజనునిఁ బుచ్చి గొల్లంగి దరికిఁ బిలిచి
దాసి కడనుండ మాటాడె దానితోడ. 90

తే. ఈవు మాలక్ష్మికిని మాకు నిష్టుడు చేసి
చేయ చున్నట్టి యుపకృతిఁ జెప్ప గిప్ప
రాదు మాపాండ్రగతి యిట్టి ప్రక్రమమున
నయ్యె నిప్డు నీసాయ మత్యవసరమ్ము. 91

తరళము. చెడినవారల నుద్ధరించుటఁ జేసి వచ్చెడిపుణ్యముల్
నుడువ శక్యము గాదు గానఁ గనుంగొన న్సమయంబు వ

చ్చెడిగ మా కుపకారముం దగఁ జేయు మంచును నిన్ను నే
నడుగుచుంటిని సత్య మాడెడునట్టిదానవు గావునన్. 92

వ. వినుము నే నీవిషయంబునఁ గొంతరాజకీయకార్యంబు నడుప నున్న
వాఁడ దుండికుటుంబమువారివర్తనం బెట్లున్నది మాధవకుటుం
బము నిట్లు చేసినక్రూరులు వారే యని నానిశ్చయ మ్మిపుడు నీకుఁ
దెలియ వచ్చినయంశంబు లున్నం జెప్పుము చెప్పినదాన నీకు నెట్టి
యిక్కట్టును రానీయ ననియు వచ్చిన నిన్ను నీవారిని నేను
బోషింతు ననియుం జెప్పుచుంటి ననిన గొజ్జంగి యి ట్లనియె. 93

ద్విపదము. నాకూడుపడిపోవు నా నాకు భీతి
యేకోశమున లేక యే యుండుఁ దెలియ
వాకొందు సత్యము వచ్చునే నేగి
వీఁక ననుభవింతు వెగ డొంద నందు. 94

తే. ఇంతయును వారు చేసినదే నిజంబు
కాని యెవ రెట్లుచేసిరో కనినయట్లు
చెప్పఁ జాలను దారి కొంచెము లభించు
నేమొ యనుకొందు నేఁ జెప్ప నెంచుదాన. 95

చ. అలమకరధ్వజుండు తనయత్తయుఁ దండ్రియుఁ దండ్రితండ్రియున్
దెలియ వినంగ మాలతినిఁ దెచ్చెద నంచు వచించి నట్లు గా
సలు పగ నెంచి వేష మది సంధిల మాలతిచెంత కేగి మా
యలు పచరించి కీలుహయమందు వసించెడునట్లు చేయుచున్. 96

వ. మాలతీమల్లికల నాకాశంబునం గొని పోవుచు మార్గమధ్యంబున
మాలతిక్ దన్నుఁ బెండ్లి యాడు మని పట్టి బలాత్కరించి పరిరంభ
ణంబు చేసికొనుటం జేసి వానిబారి నుండి తప్పించుకొన నెంచి యంత
రిక్షంబునంగల గీలుగుఱ్ఱంబునుండి క్రిందం బడి మడియుటం జేసి తన
కార్యంబు విఫల మయ్యె నని విగతమనోరథుండై మల్లికం బదిలం

బుగాఁ దెచ్చి తనయింటం గలభూగృహంబునం బెట్టి రక్షించు చున్నవాఁ డీవృత్తాంత మంతయు రహస్యంబున మల్లికయే నాకుఁ జెప్పిన దనిన నతం డో నా నే నిపుడ పోయి యభియోగంబు దెచ్చెద నీవు జాగరూకురాలవై నీగృహంబునకుం బొమ్ము రక్షక భటులు వచ్చిరేని వారికి మల్లికజాడ లెఱింగింపు మని సమాదరం బున నంపి పుచ్చుటయు నామె పరు లెవ్వరు నెఱుంగ కుండఁ దన యింటికిం జనియె నంత మరునాఁడు మధువైరి న్యాయవాది సాహాయ్యంబున. 97

—† మధువైరి వ్యాజ్యము వేయుట †—

సీ. దుండిసంబంధులు దుండగీడులు మాధ
వునియింటిలో నున్నజనుల నెల్ల
మాఱువేషములతో మాట లేవో చెప్పి
వంచించి కొనిపోయి రెంచ నేరి
నెట్లు చేసిరో చెప్ప నిపుడు నేరము తొంటి
వైర మీచేఁతకుఁ గారణంబు
విను మకరధ్వజుం డనువాఁడు మాలతిన్
మల్లికం గొనిపోవు చల్ల నల్ల
తే. ఆకసమునుండి పడఁ ద్రొబ్బి యట్టె నెట్టి
మాలతిం జంపి మల్లిక మఱుఁగు పఱచె
నిల్లు శోధించి మల్లిక నెఱిఁగి వారి
నెల్లఁ బట్టి విచారించు టెంత యొప్పు. 98

తే. దీని కంతకు మాధవి యాను గర్త్రి
కడమవారలు కర్తలు కారయితలు
గాన నందఱ బంధించి తేని తప్పు
తేట తెల్లంబుగా మీకుఁ దెలియ వచ్చు. 99

వ. అని మధువైరి మధుసూదనునికడ నభియోగంబు తెచ్చుటయు నతండు క్రూరులగు దుండిసంబంధుల నట నున్న నెల్లరం బట్టి బంధించి మల్లిక నన్వేషించి తెచ్చి నీ వేమి చెప్పెదు వనిన నామె యి ట్లనియె నయ్యా మకరధ్వజుండు చైత్రుం డను పేరితో మాఱు వేషంబున మాధవునింటికి వచ్చి. 100

శా. నన్ను న్మాలతి మోసచేసి యెటకో నాకంబునందుండి పా
పోన్నత్యంబునఁ గొంచుఁ బోవుచు వసంతాత్మోద్భవుం డంతలో
నన్నాతిం దనకోర్కి దీర్పఁ దనుదుష్టాత్ముం బడం ద్రొబ్బె దా
న న్నేలం బడి చచ్చె మాలతి నృపేంద్రా! చెప్పఁగా నేటికిన్. 101

వ. నన్నుమాత్ర మట్లు చేయక తెచ్చి తనభాగ్యగృహంబునం బంధించినాఁ డని చెప్పిన మధుసూదనుండు మకరధ్వజునిం బిలిచి బోనునం బెట్టె, 102

తే. చైత్రుఁ డను పేర మాఱువేషమున నీవు
మాలతీమల్లికలను విమానమందు
నిలుపుకొని పోయి నట్లును నింగిదారిఁ
జెనకి మాలతిఁ గౌఁగిటఁ జేర్చె నట్లు. 103

ఉ. ఆయమ నీదుసంగతికి స్వాంతము సేయక నిన్ను రోసి న
ట్లాయెడ నామె నీవు కడు నాగ్రహముం గొని క్రిందికిం బడన్
ద్రోయఁగఁ జాలినట్లు నలతోయజనేత్ర మృతించినట్లు వా
లాయ మెఱుంగ వచ్చెను గలంకక చెప్పుమి యేమి చెప్పెదో. 104

క. మల్లిక చెప్పెను సాక్ష్యము
తెల్లంబుగ దాని నిటకుఁ దెచ్చితి వఁట నీ
ప్రల్లదనం బంతయు మా
కెల్లవిధంబులను దెలిసె నిట నిక్కము గన్. 105

వ. మఱియు మధుకరాదులం గొనిపోయిన వా రెవ్వరో సర్వంబు దాపక చెప్పుము చెప్పకున్న నిన్ను బ్రతికియుండం గాల్పింతు నని

కంఠంబునం గఱకు కత్తెఱం దగిలించినంత నతండు ప్రాణభయంబు నంజేసి చేయునది లేక తబ్బిబ్బులాడియుం బిమ్మటం గత్తెఱ కుత్తుక నుత్తఱించు ననుభయంబున. 106

—• న్యాయస్థానమున చైత్రుండు తన నేర మొప్పుకొనుట •—

సీ. చైత్రాఖ్య నేను వేషము తోడఁ దెచ్చితి
మఱగించి మాలతీమల్లికలను
ననుఁ బెండ్లియాడుమీ యని మాలతికరంబు
పట్టఁ బోయితి నంత నట్టు నిట్టు
విదళించు కొంచుఁ దాఁ బృథివిపైఁ బడె నామె
నేను జంపితి నంట నిజము కాదు
మధుకరునిన్ నాదుమామ కిశోరుఁడు
కొని నీలకంఠాఖ్యుఁ గొంచుఁ బోయెఁ
తే. బింగళకుఁ డయి మాతంఁడి వెడలి మిత్ర
దంపతుల హరించెను నాదు తాత యీశ్వ
రాహ్వయుం డయి జ్యోత్స్నము నాన తిచ్చె
జీవదాల్బ్భ్యలు దుండిననెల్లఁ దెలియ. 107

వ. అని చెప్పిన రాజేంద్రుం డనంతపురంబున నీలకంఠపింగళు లెద్ది యో నేరంబునంజేసి బంధితు లై యుంట వినియున్నవాఁడు గావున భటులం బుచ్చి రాజానుమతంబున వారిం దెప్పించి మఱియొక్క దినంబున. 108

తే. అంత గొజ్జంగి పిలిపించి యడుగ నామె
మీరు పేరొకన్నవా రెల్లఁ గ్రూరు లెంత
లెంత లైనను జేయుదు రెల్లరు నిట
సలుపుదురు దురాలోచనములు సతతము 109

వ. మాధవి యొక్కనాఁడు తనవారితోఁ దనకైనపరాభవం బెఱింగించి దుఃఖించునప్పుడు మకరధ్వజుండు వచ్చి నే నీమనోరథంబు నెఱ

వేర్చెదను మాలతిం బట్టి తెచ్చెద నని చెప్పి పోయె నవ్వలఁ గొన్ని
నాళ్ళకు. 110

తే. మల్లికను దెచ్చి యింటిలో మఱుగుపఱచె
మదనుఁ డామాలతినిఁ జంపె మహినిఁ ద్రోచి
యనుచు మల్లిక నాఁకెల్లఁ దెలియఁ జెప్పె
సత్యమును మీకుఁ జెప్పితి త్ప్మాతలేంద్ర. 111

తే. లక్ష్మి చూచుచునుండ మాలతినిఁ గొంచుఁ
బోయె మదనుఁ డంచును వింటి భూతలేంద్ర
ఘోరకార్యము లీరీతి ధారుణిపయి
జరుగుచుండ సుఖించెదుజనుఁ డెవండు. 112

తే. తమకు వ్యతిరేకముగఁ జెప్పె దాసి లక్ష్మి
యనుచు సద్దానితల గొర్గి రప్పు డిప్డు
నన్ను నెట్లు పొనర్పఁగా నున్నవారొ
ఖలులు వీరికి జంకంగ వలయు నొక్కొ. 113

వ. అంత మధుసూదనుండు మాధవిం బిలిచి బో నెక్కించి నీవు నీ
వారి నీనేరంబు సేయఁ బ్రేరేచితి వనియు మాలతిం బట్టి తేర మకర
ధ్వజుం బుచ్చితి వనియుం దెలియ వచ్చినది నీ వేమి చెప్పెదవు
చెప్పు మనిన నామె యి ట్లనియె. 114

ద్విపదము. నేఁ జెప్పనేటికి నెంజలిపడిన, యేజాతివాఁ డైన నీరీతిఁ జేయు
మకరధ్వజునితోడ మాలతి నీకు, సకలవిధంబుల సరిపడు నంటిఁ
గాని బంధించి తేఁ గదలు మటంచు, నేనుఁ జెప్పితి నంట నిజముగా దెన్న.

వ. అంత రాజేంద్రుండు దాసీలక్ష్మిం బిలువ నంచి మాలతి నెవం
డేమి చెప్పి తీసికొని పోయెం జెప్పు మనిన నప్పడంతియు. 116

చ. ఇగునదియేండ్ల యీాడు గలఁ డెంతయు వింతగ మాటలాడెడున్
వెరవరి చైత్రనాముఁ డొకవేషముతోఁ జనుదెంచి నీప్రియుం

డరిమురి నొందు ర మ్మనుచు నాతని వ్రాలను జూబుఁ దెచ్చి య
త్తరుణిని మల్లికం గొనుచుఁ దత్తఱతోఁ జని యింటి త్రోవగన్. 117

వ. అంత మధుసూదనుండు దుండివసంతకిశోరులం బిలిచి మీ రేమి చెప్పెద రనిన వారు మే మేమియు నెఱుంగము మామకరధ్వజుండు మూడుమాసంబులనుండి యపస్మారరోగంబున నెదిరిఁ ద న్నెఱుంగ కున్నవాఁ డాయుర్వేదవైద్యుండు సుశ్రుతుండు వైద్యము చేయుచున్నవాఁడు పిచ్చివానిమాటలు పాటింపక సత్యంబు పాలింపఁ బ్రార్థించుచుంటి మనిన నా లెం డని యతండు. 118

క. ఆయుర్వైద్యుని రమ్మని
రోయీ సుశ్రుత ! మరునకు నొనరుఁ తె వైద్యం
బేయామయంబు నావ్రుఁడు
నేయది లే దనుచు నాతఁ డెఱిఁగించె నటన్. 119

వ. అట్లు విచారించి మధుసూదనమహీమహేంద్రుఁడు నే నీయభియో గంబు తీర్మానించుచుంటి వినుం డని యి ట్లనియె. 120

—* రాజు దుండిని బరివారంబును శిక్షించుట *—

సీ. మకరధ్వజునకు నామరణంబుగాఁ జెఱ
సాల నుండుటకు నీశ్వరుఁడ వైన
దుండికి నీలకంఠుండవై తగుకిశో
రునకుఁ బింగళకుఁడై చనువసంతు
నకును బదేసిలెక్కకు నైన వర్షముల్
కారాగృహంబునఁ జేరుటకును
వేయేసి రూపికల్ వెక్కసం బగుజరి
మాన యున్ శిక్షయై మానని దగు

తే. మగని వంచించుటకు నిట్లు తగనిరీతి
నెల్లరం బ్రోత్సహించిన కల్లలాడి

మాధవికి శిక్ష రెండైన మాసములును
రెండువేల్ రూప్యములు సమర్పించుటయును. 121

వ. మఱియు నీసంఘంబునం జేరి దుష్కార్యంబులు చేసిన జీవదాల్భ్య
లకు రెండేసిసంవత్సరంబులు శిక్ష విధించితి నని తీర్మానంబు వ్రాసి
నీలకంఠపింగళుల ననంతశయనంబున కంపిపుచ్చి తక్కినవారిఁ
గారాగారంబునం బెట్టించి వారియిండ్లు వాకిండ్లు భూములు గీములు
లోనగునవి యేలము వేయించి శిక్షితద్రవ్యం బెల్ల బొక్కసంబునం
జేర్పించె నంత నక్కడ ననంతపురంబున. 122

—• అనంతపుర హత్యాభియోగము •—

శా. పౌరుల్ జానపదుల్ ధనాఢ్యులును విద్వాంసు ల్మహామాత్యులున్
శూరు ల్ధీరులుఁ బ్రాడ్వివాకులును రాజుల్ విప్రులు న్శూద్రులున్
నారీలోకము లోనివా రపుడు తన్నారి న్మహాఘోరసం
హారంబున్ వినునిచ్ఛ వచ్చిరి మహీంద్రాస్థానముం జేరఁగన్. 123

తరువోజ. సభకు మాధవుఁడు కేసరిమిత్రుఁ డల్ల
జాబాలియు జయంతసంయమిసుతుఁడు
నిభరాజగమన తా నెవరొ రాసుతుని
నేటికిఁ జంపెనో యె ట్లయ్యె నట్టి
ప్రభవ మంతయుఁ గన వచ్చు నప్పుర మె
ప్రకృత మైనది తమపనులకుఁ గాన
శుభ మెద్దియే నందుఁ జొప్పడునొ యను
చుఁ దలంచి వేడ్కఁ జొర వచ్చి రిచ్చ. 124

వ. ఇట్లు సర్వప్రజలు వచ్చి సభాస్థలం బలంకరించి యున్నయప్పు
డనంతనారాయణుండు కొలువుదీరి మంత్రుల దిక్కుమొగంబై
నిజపుత్రకుని విషయంబు గావున నించుక విచారించియు రాజ
ధర్మంబునం జేసి ధైర్యంబుఁ గలఁడై నేరంబు చేసి రను ననుమానం

బునం బట్టిన నీలకంఠపింగళులం దెప్పింపుఁ డనిన వారు చెప్పిన చొప్పునం జేయుటయు రక్షకభటులు విచ్చుకత్తులతో దోషుం బ్రవేశపెట్టి రాసమయంబున సభాసదులు హంతకురాలిం దిలకించి తమలోన. 125

సీ. ఎంత సాహస మమ్మ యింతి యియ్యది యెంత
ఘోరకార్యము చేసె నార యార
దోమ యైననుగాని దూరి పోవఁగ రాని
యంతిపురికి నెట్లు లరిగె నో కో-
యరిగి నగలఁ గొంచు నవలఁ బడుటె కాక
పసిపాప నెట్లు చంపంగఁ గలిగెఁ
గన్నకడుపు వోలె గానిపించెడు దీని
కిం తైనఁ గనికర మెట్లు లేదొ

తే. పిచ్చిదొ వెఱ్ఱిదొ దీని కెచ్చి యుండఁ
బోలు లేకున్న నీరీతి బోగిమంట
లోనఁ బడి చావఁగా నెట్లు తాను దలఁచు
నద్భుతం బిట్లు కనివిన మపుడు నెపుడు. 126

వ. అప్పుడు మఱికొందఱు. 127

సీ. ఆడుది యేమి యి ట్లంతఃపురమునకుఁ
గన్నము వేయుటే మన్న యన్న
యిది యసాధ్యం బెట్టి సదమలమతి విప్ర
సతి యిట్లు చేఁత యసంభవంబు
పిల్లలఁ గన్నదీ పేదము తైనవు
మనుజేంద్రసుతుఁ జంపె ననుట కల్ల
రాచూలి భూషల దోఁచుకొనుటయును
గల్లలోఁ గల్ల యేఖలులో కాని

తే. అంతిపురిఁ జొచ్చి యీరీతి నధిపసుతునిఁ
జంపి వానినగల నెల్ల సంతరించి
యెద్దియే కారణంబున నీమచెంత
వేసి యుండు రద్దాన నివ్విధము వచ్చె. 128

తే. అంతట జయంతుఁ డాయమ నరసి యీమె
యాకృతిం జూడ నాతల్లి యనుచుఁ దోఁప
వచ్చె నాయమ కీరీతి వచ్చె నెట్టు
లయిన నరయు చుండెదఁ గాక యనుచు నుండె. 129

వ. అని యందఱు నన్నిచందంబులం బలుకుకొనుచున్న సమయంబున మాధవ సింహమిత్ర జాబాలి జయంతులును హంతకులం జూచి పరమాశ్చర్యంబు నొందుచు వారివారిమనంబుల ననేక విధంబులం దలంచుచుండి రపుడు జయంతుండు నీలకంఠుం దిలకించి తనలోన. 130

ఉ. సిద్ధులలోను మేటి యగుసిద్ధుఁడ నేను మదంతికంబునన్
సిద్ధు లనేకముల్ గలవు శ్రీయు ననంతము చచ్చినట్టిరన్
సిద్ధమహౌషధంబునను జేసి వడిన్ బ్రదికింతు నంచు నన్
బద్ధునిఁ జేసి తెచ్చె నరయొ పాపపరీవృతచిత్తుఁ డారయన్. 131

వ. అప్పుడు సింహమిత్ర మాధవులు పింగళకుం జూచి వారివారి మనంబుల. 132

ఆ. నీలకంఠయోగి నెయ్యంపుశిష్యుఁడ
నెల్లసిద్ధు లేను నెఱుఁగుదు నని
యెంత మోస చేసె నీఖలుం డక్కటా
యెఱుఁగఁ జాల నైతి నింత యేని. 133

వ. అని వా రీఘాతుకు లిద్దఱు నిట్లు పట్టుపడిరి. వీరిమూలమునఁ దమ వారివృత్తాంతం బెఱుంగ వచ్చెడునో యని లోలోన గంపెడం

తాస పెట్టుకొని యుండి రనంతరంబ రాజానుమతంబునఁ బాడ్వి
వాకుండు రక్షకభటులం జూచి మీరు తెచ్చిన యభియోగం బెట్టిది
చెప్పుఁ డనిన వా రి ట్లనిరి. 134

—* పాడ్వివాకుఁడు నేరము విచారించుట *—

ఉ. ఈమెకడన్ మృతుం డగునరేంద్రకుమారుఁడు వానిసొమ్ములున్
మేము గనుంగొనం గలిగి మిక్కిలి నేరము చేసె నంచు నీ
భామినిపై మహాగమును బన్నినవారమ మై సభాస్థలం
బీమెయిఁ జేరఁ దెచ్చితి మిలేశ్వర! నేరము చిత్తగింపుమా. 135

చ. నిలిచినవీర లిద్దఱును నేరము చేసె నెలంత యిద్ది యీ
పొలఁతికడం గుమారశవముం గన వచ్చెదు నంచుఁ జూపుటన్
దెలిసినవారమై మొదట నిక్కము సాక్షు లటంచు నమ్మి య
వ్వలఁ గొని కొన్ని హేతువులఁ బట్టితి మిట్టులు వీరి నిద్దఱన్. 136

తే. వీరిచెంతను గత్తులు వీగిమేన
నెత్తుమఱకలు గలుగుట గాత్రము లొగిఁ
దొట్రుపడుచుంట సంశయాత్ములమ యగుచు
వీరినిం గూడ నరికట్టినార మేము. 137

వ. అంతఁ బ్రాడ్వివాకుండు శిశుహంతకురాలిం బిలిచి నీవు రాజాంతః
పురంబునకుం బోయి రాజపుత్రుం జంపి వానిసొమ్ము లన్నియు
నపహరించితి వనియు నీకడ నన్నియుం దొరకె ననియుం జెప్పుచున్న
వారు నీ వేమి చెప్పెద వనినఁ గన్నులనీ రొత్తుకొనుచు నమ్మత్తకాశిని
యి ట్లనియె. 138

తే. చేసినం జేయ కుండినఁ జేసె నేర
మీమె యని నిశ్చయించి యోభూమినాథ!
నీదుకరవాలమునఁ జేసి నాదుశిరముఁ
దురించి నావెత దీర్పఁ జేదోయి మోడ్తు. 139

వ. అయినను సభాస్థలంబునం జెప్పుమని యడిగినప్పుడు చెప్ప కుండుట
తప్పు గావునం జెప్పెద నవధరింపుఁడు. 140

—♦ పద్మిని తనవృత్తాంతముఁ జెప్పుట ♦—

సీ. మధురాపురనివాసి మాధవుమిత్రుండు
నాప్రాణనాథుండు నాదుపేరు
పద్మిని యంద్రుడు నాభర్తను న్నన్ను నీ
పింగళకుం డేదొ భీతు పన్ని
కొని తెచ్చి మిత్రుని ఘోరాటవిం ద్రోచి
న న్నిటకుం దెచ్చి మన్నిగొనఁగ
నెంచియు నటు గాక యీరాజపుత్రినిఁ
దున్రించి యాభరణముల్ దోఁచి తెచ్చి
తే. యితఁడు నీతఁడు నాపాలిమృత్యువు లయి
నాకడం బెట్టి దొంగ యీనాఁతి యనుచు
నరచి రక్షకభటులకు నప్పగించి
రేమిచెప్పుదు నాదుఃఖ మోమహీశ! 141
తే. అప్పు డాసభామధ్యమునందు నుండి
మధుకరుఁడు వచ్చి పద్మినీమాత కెఱఁగి
అమ్మ! నీ విడ్డయీరావియాకుపదక
మిదిగొ కైకొను మని యామెయెదుటఁ బెట్టె. 142

—✻ మాయా మధుకరదర్శనము ✻—

చ. అది గని యెల్లవారు పరమాద్భుత మందుచు నుండి రంతలో
నదురు జనింపఁగా నలజయంతుఁడు శాంతి యొకింత యేని లే
కిది కడువిస్మయంబు జనియింపఁగఁ జేయునభూతకార్య మే
చదురుఁడొ నన్నుఁ బోలి పెలుచం బచరింపఁగ నయ్యె నియ్యెడన్.
చ. నడలును గాలిపొంకమును నవ్వులు మాటలు హావభావముల్
పడుచుతనంబు రూపమును బల్వురునల్ స్వరసౌష్ఠవంబు న

న్నడుము రుచిప్రభేదము గనంగఁ గనంగ మధువ్రతుం గడున్
బుడికియ పుచ్ఛకొన్నవిధముం గల దయ్యెఁ దదీయమూర్తియున్.

తే. అంత జాబాలి పోయినప్రాణ మపుడు
మరల వచ్చినమచ్చున మసలుకొనియె
మిత్రుఁడును మాధవుండు లో న్నాత్రపడిరి
పద్మినీకాంత యెంతయు బమ్మరిల్లె. 145

వ. అప్పుడు ప్రాడ్వివాకుం డాయువకుం జూచి యిట్లనియె. 146

చ. ఎవఁడవు నీవు నీయునికి యెప్పురమం దగు నిన్నుఁ గన్నవా
రెవ రిటు రాకకుం గత మదేమి ? కుమారమణీవిభూషణం
బెవరిది యెట్లు వచ్చె ? వచియింపుము దాఁపక యెల్ల నావుడున్
యువ యిటు లుత్తరం బిడియె నోలగ మంతయు నొల్ల బోవఁగన్.

సీ. పద్మినీమిత్రుల వరపుత్రుఁడను నేను
మధుకరుం డంద్రు నామమునఁ జేసి
మధురాపురంబున మాధవునింటిలో
నుండ న న్నిమ నే రో దురాత్ము
లపహరించి యరణ్యమందు పైచిరి మేము
బికిర మెచ్చుచు నెల్లపృథివిఁ దిరిగి
యిటకు వచ్చితి మిపు డీమ నగరు సొచ్చి
రాసుతుఁ జంపియు రవణములను

తే. దెచ్చె రక్షకభటు లేగుదెంచి పట్టు
కొనెడు నప్పు డీపదకముఁ గనకయుండ
నెవ్వరును నాదుకడఁ బెట్టె నింతలోన
భటులు కొనిపోయి రిటుమ్మ బందిఁ బెట్టె. 148

క. నాకుఁ బ్రమాపణ మయ్యెడు
నాకడ నీరత్నభూషణం బుండినచో

నేకరణి నైనఁ దెలిసినఁ
గాకుండదు మృతి యటంచుఁ గావింతు నిటుల్. 149

తే. అనిన నధికారి యను దోషు లైనవీరు
పురుషు లెవ్వరొా తెలియఁ జెప్పుమి యనంగ
నగలవ్యాపారు లీయిద్ద ఱగణితధను
లరుగు దెంచి యిచ్చోటులఁ దిరుగుచుండు. 150

వ. అని చెప్పిన విచారణకర్త వెండియు. 151

—♦ మాయామధుకరుఁ డసత్యము లాడుట ♦—

తే. వీరిచెంతను గత్తులు వీరిమేన
నెత్తురమరకలు గలుగుట గాత్రము లోగి
దొాటువడుచుంట సంశయాత్ములయి కడగి
వీరినిం గూడ నరికట్టినారు భటులు. 152

వ. అని తెలియుచున్నది నీ వేమి చెప్పెద వనిన వాఁ డిట్లనియె. 153

ఉ. వీరలు కొాట్లకుం బడగ లెత్తినవారలు ధర్మమూర్తులున్
వీరలు హత్య చేసి పరవిత్తము గైకొాన నుండి రంట త
ప్పీరహిఁ దిండి లేనియిదియే పొానరించెను దల్లి యైన నీ
వారిజనేత్రయే వధ కవశ్యమునుం దగు నంచుఁ జెప్పుదున్. 154

వ. అంత నాతం డాసదకంబు పరీక్షించి యిది రాజపుత్రునిదే యనియు నిందు రక్తచిహ్నము లున్నవనియు నిశ్చయించి రక్షకభటులం బిలిచి వీని మీాఁ రెఱుంగుదురే యనిన వారును. 155

ఆ. వీఁడు మోసగాఁడు వీని తెచ్చిననగ
మూఁడునెలల కవలఁ బోయినయది
దాని నెత్తు ప్రాణి తనవారి బ్రతికింప
నిట్లు తెచ్చె ననుటయే నిజంబు. 156

వ. అంత విచారణకర్త పద్మినిం గాంచి వీఁడు నీకుఁ గుమారుం డను చున్నవాఁడు నీ వేమిచెప్పెద వనిన నాయమ్మ యిట్లనియె. 157

ఉ. నాకొడు కిట్లు దుష్కృతు లనంగ వినంగఁ దలంపఁ దెప్పుడుఁగా
లోకహితప్రవర్తకుఁ డలోలమనస్కుఁడు వానిఁ బోలఁ గా
నీకృపఁ బుండు వచ్చి నను నీగతిఁ బల్కఁగ సాహసించె నే
నీకడ నేమియుం బలుక నిచ్చ గొలంది నొనర్పఁడీ ననున్. 158

— జయంతుండు పద్మినికడకువచ్చి దుఃఖించుట —

మ. అని చెప్పంగ జయంతుఁ డెంతయును దుఃఖాక్రాంతచిత్తంబునన్
గనుఁదోయిం గడుబాష్పముల్ దొరఁగ వేగం బేర్పడ న్వచ్చి ప
ద్మినికంఠమ్మును గౌఁగిలించుకొని యార్తిం దెల్పుచుం దల్లి! నీ
కొనగూడెం గద యిట్టికష్టము సుతుం డున్నాఁడు లే నట్టిఁడై. 159

తే. నన్ను నీ నీలకంధరుం డెన్నొ చెప్పి
తోడుకొనిపోయెఁ జంపంగఁ దొడరి యట్లు
సేయ కొకకారుకోనలోఁ జేడ్పడంగఁ
ద్రోచి పోయెను బులులకు వాచవి గను. 160

శా. కన్ను న్మిన్నును గానరానియటుగాఁ గన్పట్టుకార్చీఁకటిన్
గొ న్నంజల్ నడయాడుచుండఁ బడితిన్ ఘోరావటంబందు నై
సన్నల్ వోవగఁ గొంతసేపటికి విజ్ఞానంబు గాఁ బైకి రా
నెన్నో వైపులు మెట్టి మెట్టి యొకచో నే దేదొ వ్రేలాడఁగన్. 161

శా. దానిం గైకొని మీఁది కెక్కుడుతఱిన్ ద్రా చద్ది క స్సంచుఁ బై
పై నేగం జనె నంతఁ దొబ్రువడి పోవం గూలితి న్నేల కా
లోనం దా దనవీపుమీఁదఁ గొని భల్లూకం బొకం డింతలో
నానారణ్యములం జరించి యొకచో నన్ బెట్టి పోయె న్వడిన్. 162

తే. నీలకంఠునకుం గాక వాలుమొకము
లకును గా కిట్లు దైవబలంబుకలిమిఁ
దిరిగి తిరిగియు భార్గవుదెసకుఁ జేరి
కాలమును ద్రోయుచుంటి నోకన్నతల్లి. 163

వ. అంత నతిత్వరితంబుగ జాబాలి పఱచి వచ్చి జయంతునిం గౌఁగి లించుకొని ప్రాణేశ్వరా! నేను నీదాసిని మాలతిని. 164

మ. ఎవఁడో చైత్రుఁడు నీవువ్రాసినటు వ్రాలేర్పాటుఁగాఁ దెచ్చి జా
బవరోధం బొకఁ డయ్యె ర మ్మనఁగ నే నార్తిం దదశ్వంబు పై
నవలోకింపక యెక్కి దవ్వరుగఁ వాఁ డాసించె నర్ల నేను నా
దవుప్రాణంబును బాపుకోఁ బడితి నిం దాకాశమందుండియున్. 165

—* జయంతజాబాలుల పరితాపము *—

ఉ. గాలవునాశ్రమంబుకడఁ గ్రీలు వలం బడి చాక యెట్లొ మా
పాలుననుగ్రహంబునను బాణిము నిల్వఁగ నిట్టి వేషమున్
లీల గ్రహించి భార్గవునివెయ్యముఁ గైకొని నీదుపేర్మిమైఁ
గాలము పుచ్చుచుం బ్రకృతికల్పన వచ్చితిఁ దొంటి యాసమై. 166

ఉ. నీవును నేను నొక్కకడ నిల్చియు నొక్కెడసంచరించియున్
నీ వని నేను నే ననుచు నీవు గ్రహింపనివార మయ్యునున్
భావము నైక్య మొందఁగఁ బ్రవర్తనముం బొనరింతు మక్కటా
దైవము పేర్మి పెంపునను దారసిలెం గద యిట్టికష్టముల్. 167

వ. అనిన నతం డి ట్లనియె. 168

ఉ. నీదగుమూర్తి తా నొకనినిం గొని కౌఁగిటఁ జేర్చి యుండఁ గా
నాదగుకన్నుఁదోయిఁ గనినాఁడను నావుడు నమ్మచెల్ల! వాం
ఛేదియొ చిత్రి మట్లు సృజియించిరి నిన్నుఁ గలంప నంచు నీ
పాదము లంటి నే నిపుడు బాస యొనర్చుచునుంటి వల్లభా. 169

ఆ. మధురనుండి నన్ను మాయఁ జైత్రుఁడు తెచ్చు
నపుడు గాలవాశ్రమాంతికమునఁ
బడితి నంటి నట్టిపట్టున మునిసుతుల్
సేద దేర్చి రొక్క చెంతఁ బెట్టి. 17

వ. అట్టితఱి నేను వారిమాటలలో భార్గవాశ్రమప్రశస్తి విని యున్న
దానం గానఁ గొంతసే పట నిద్రించినట్లు పడి విశ్రమించి యెవ్వరుం

జూడకుండ నాచీఱచెఱంగు లెల్లం జించి యట నున్న జేగురునీళ్ళ ముంచి వాని ధరించి మునిపుత్రుండ నై మెలమెల్ల మెట్టుచు భార్గ వాశ్రమంబునకు వచ్చి తొలుదొల్త నీదర్శనంబు గావించి నావృత్తాం తంబు విన్నవించితి నీవు న న్నాదరించి ముని కెఱింగించి నన్ను నీకుటీరంబునక తోడుకొనిపోయి భోజనభాజనాదుల సత్కరించితి వక్కటా. 111

చ. పరపురుషుం డనంగఁ గనుపాపలదాపున కేనిఁ జేర్పఁగాఁ
దురితము దారసిల్లు నని దూరము దూరము వోవునేను నిక్క
బురుషు డటం చెఱింగియును బొంతవసింపఁగ నేవగింపఁ బో
కరితి మెలంగితిం దలఁప నచ్చెరు వయ్యెది నీ వెఱుంగవో? 172

వ. అని వారు సంభాషించుచున్నంత సింహామిత్రుండు వచ్చి కళత్ర కరగ్రహణంబు చేసి నేను నీమిత్రుండ నిపుడు సింహామిత్రుండ.

—† సింహామిత్రాదులు పద్మినికడకువచ్చి పరితపించుట †—

ఆ. నన్ను నిన్ను నట్లు నాఁడు పింగళకుండు
పట్టుకొంచుఁ బోవుపట్టునందు
నడుమ నన్ను నొక్క నడికాన నొకసింహ
గుహాను బెట్టి పోయెఁ గ్రూరుఁ డగుచు. 174

వ. అని కొడుకుం జూచి కౌఁగలించు కొని. 175

క. నినుఁ జూచుభాగ్య మిఁక నీ
తనువున లే దనుచు లోనఁ దహాతహాపడుచున్
వనటన్ మునిఁగితి దైవం
బను కూలం బగుచు నిట్టు లనువర్తించెన్. 176

ఆ. అంత మాధవుఁడు నరుదెంచి పద్మినీ
నేను మాధవుండ నీకు నిట్టి
కష్టపాటు వచ్చెఁ గదె నాకతంబున
నేమిచేయువాఁడ నిపుడు చెపుమ. 177

వ. అని మాధవుండు జాబాలి జయంతుల దిక్కు మొగంబై. 178

ఉ. కూఁతుని నల్లుఁ గూడుకొని కొన్ని దినంబులు నొక్కచోట సం
ప్రీతిమెయిన్ మెలంగుచును మిమ్ము నెఱుంగఁగ లేకపోతిఁ గా
నీ! తలపోయఁ బ్రేమ యది యేమొ వచింపఁగ రానియంత నా
చేతమునందుఁ బుట్టె నని చెప్పుచు నుంటిని మీకు నట్టులే. 179

క. పులినోటికై మృతించెడు
నలఁతి న్నను వెండి పుట్టినట్టు లొనర్పం
గలిగి మదీయాదృతి క
ష్టలరితివి జయంత నిన్ను నభినందింతున్. 180

తే. అపుడు జాబాలి మాధవునంతికమున
కరిగి గొబ్బున నాతనియంగమందు
ప్రాలి నామూలమున నిన్నిపాట్లు నీకు
వచ్చె నోతండ్రి! యేమందు వ్రాఁతఫలము. 181

వ. అనిన నతం డామె నక్కునం జేర్చి మిత్రునివంకఁ దిరిగి. 182

ఆ. చచ్చినట్లు నీవు సరసుకడం బడి
యుండ ని న్నెఱుంగ నోప కిట్లు
సింహమిత్రుఁ డనుచుఁ జేసితి సంజ్ఞ నా
మిత్రు నెఱుఁగ నైతి మిగులువిధిని. 183

ఉ. అప్పుడు గొల్లు గొల్లు మని యార్తరవంబు తదంతరంబునన్
గప్పఁగఁ బద్మినీసతియుఁ గన్నులఁ గాల్వలు గట్ట బాష్పముల్
జెప్పలు విప్పి యేడ్చె రొద జేగ సభాస్థలి నెల్లవారునున్
గుప్పున నేడ్వసాఁగి రొకయింతటిలో నది శాంతి నొందఁగన్. 184

వ. ప్రాడ్వివాకుండు నీలకంఠపింగళులం గాంచి మీ కేమి చెప్పెద రనిన
వారును. 185

తే. పిల్లవానినిఁ జంపి యప్పిల్లతోడ
సొమ్ములం దెచ్చి యిక్కాంత సమ్ముఖమున
నేము పెట్ట మీయమ్మయే యిట్లు చేసె
ననుచుఁ జెప్పుచు నుంటి మోయవనినాథ. 186

వ. అంత రక్షకభటులం జూచి మీరు వీరి నెట్టితఱిఁ గనిపట్టితిరి చెప్పుఁ డనిన వారును. 187

చ. అరయుచు మేము చోరుల ని ట్టులు మెట్టుచు నుండ దవ్వుల
న్దిరిగెడువీరి నిద్దఱను దేరి కనుంగొని చేరవచ్చుచో
నిరువురు సొమ్ములన్ శిశువు నీయమ చెంగటఁ బెట్టుచున్నయ
ట్లరయఁగ వచ్చె మాకు నపు డాడకు నేగితి మార్చి రంతటన్. 188

—✻ మాయామధుకరుఁడు నిజము చెప్పుట ✻—

క. కత్తుల నెత్తురు మరకలు
నత్తఱి వీరలశరీరమందుఁ గనఁబడెన్
జిత్తము వచ్చిన మచ్చున
నుత్తరువు నొసంగ వలయు నోనరనాథా. 189

వ. అంతఁ బ్రాడ్వివాకుఁడు గండకత్తెఱం దెప్పించి మధుకరుండ నని వచ్చినవానికంఠంబునకుం దగిలించి నీయథార్థప్రవర్తనం బంతయు నెఱింగింపు మెఱింగించినచో దోషి నైనను నిన్ను రక్షింతుము కాకున్న నీకంఠం బిది కత్తఱించు ననిన నతండు గడగడవడంకుచు.

సీ. మధుకరుండను గాను మనుజేంద్ర నేఁ గిశో
రునిపుత్రుఁడఁ గిరీందుఁ డనెడువాఁడ
మామనుం దండ్రిని మనుతు నో యనుమూహఁ
జేసి యీవేషము వేసినాఁడ
నీసతి శిశుహత్య చేసిన దని వధ
కర్హురా లని చెప్పినట్టివాఁడ
నది తప్పు తప్పుచేయదు సతి వీర లే
హత్య చేసినవార లనెడువాఁడ

తే. రావియాకుపదక మిద్ది రాజగృహము
నుండి దొంగిలింపంబడి యుండినదియ
నెత్తి దగిలించి యీరీతి ధాత్రిపతికిఁ
జూపఁ దెచ్చి మోసము చేయఁ జూపినాఁడ. 191

—✻ రాజు దోషుల శిక్షించి మధుకరాదులం గొనిపోవుట ✻—

వ. అంత నసంతనారాయణుం డింక విచారణతో నవసరంబు లేదు ప్రాడ్వివాకా తీర్మానించెద లిఖింపుము వీ రిర్వురును వసంతకిశోరులు వీరికి మధురాపురీశ్వరుం డీనడుమఁ బదేసి సంవత్సరంబులు కారాగారంబున నుండ శిక్షించె వీరే నాకుమారుం జంపి నగలు హరించి యన్నెము పున్నెము నెఱుంగని యీయమ్మపైఁ బెట్టి నా రీయమ్మ నిర్దోషిణి నీమె కీయూంక్షఁ దొలంగించితి నీవసంతకిశోరులకు మరణ దండనము విధించితి నని సత్యకథకుం డగుటం జేసియు మనయిచ్చిన బాసంజేసియు నీగిరిందుని విడిచిపుచ్చితి నని సింహాసనంబునుండి లేచి పద్మిని చెంతకుం జని పాదాక్రాంతుండై యి ట్లనియె. 192

చ. తెలియక నిన్ను బందె నిడి తిప్పలు వెట్టిరి మాభటు ల్మదిన్
గలత వహింపఁ బూనకుము కర్మవిపాకము దాఁట నేరికిన్
దల మన రాదు నీవు కడుధన్యవు మాన్యచరిత్రి వెన్న నీ
యలజడు లన్నియు న్దగియె నావడి లేక సుఖింపు మీపయిన్. 193

వ. అని మాధవ మిత్ర మధుకరులను మాలతీ పద్మినుల నాదరించి మీరు మాయింటఁ గొంతకాల ముండి పోవుం డని యామంత్రించి వారి నందఱ నగరునకుఁ దోడుకొనిపోయి యభ్యంగనాదుల నభ్యర్చించి షడ్రసోపేతభోజనభాజనంబులఁ బరితృప్తులం గావించుచుండె ననిన శ్రోత లవ్వలివృత్తాంతంబు చెప్పుమని కథకు నడుగుటయును.

ఆశ్వాసాంతము.

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ,
వేదవిద్యావిశారదాది బిరుదవిరాజమాన
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతం బయిన
మధుకరవిజయం బనుప్రబంధంబునఁ
బంచమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు

# మధుకరవిజయము

## షష్ఠాశ్వాసము

వ. అక్కథకుండు శ్రోతల కిట్లనియె నట్లు మాధవప్రభృతులం దన
యింటికిం గొనిపోయి సర్వోపచారంబులు గావించుచు నొక్కనాఁడు
రాజేంద్రుండు వారందఱును వినుచుండ నిట్లనియె. 1

—† మాలతీమధుకరుల వివాహ ప్రయత్నము †—

క. మధుకరునకు మాలతికిన్
బుధు లెన్నఁగఁ బరిణయంబు పోలు నొనర్పన్
బుధులార! నాపురంబునఁ
బృథులోత్సవ మాచరింప నెంచితిని మదిన్. 2

వ. అనిన మాధవుం డిట్లనియె. 3

చ. అతిథుల మేము మాకిచట నత్యధికోత్సవ మాచరింప నె
గ్గతి నగు సర్వమున్ మధురఁ గల్గును బంధులు నందు నుండి రో
క్షితివర! నావుడున్ నృపుడు చేసెద సర్వము నేన బంధుమి
త్రతతికి లేఖలం బనిచి రా నొనరింతము వారి నందఱన్. 4

వ. మఱియు నొక్కమాట గల దాకర్ణింపుఁ డని మధుకరునిఁ జెంతం
గూరుచుండం బెట్టుకొని మాధవమిత్రాదులును మంత్రిసామంతా
దులును వినుచుండ నిట్లనియె. 5

మ. నడికిం గాలము దాఁటిపోయినపయి న్నాకొక్కపుత్త్రుండు పే
ర్పడఁ బుట్టెన్ ధరణీతలేంద్రుఁ డగుచున్ భాసిల్లు వాఁ డంచు నేఁ

గడు మోదంబున నుంటి నయ్యది వృథా గా నయ్యె సంసారమం
దెడ యొక్కింతయు లేదు నే వనికిఁ బో నిప్పట్ల నూహించెదన్. 6

చ. తెలియఁగ నెంతవారు నిలఁ ద్రెళ్ళిర కాని యొకండు మిత్త్రిక
న్నుల మసిఁ బ్రామి పొల్చుట కనుంగొనియే వినియే యెఱుంగ మీ
పొలిసెడునంతయుం గనియు బూమె లెఱింగియు నట్టి గట్టి యు
య్యేల లిటు లూఁగుచుందు మని యెంచుట వెఱ్ఱితనంబు కాదొకో. 7

క. కావున నే నిఁక రాజ్యం
బీవసుధం జేసి కొనుచు వెంబరగొట్టి
పోవం జాలను వనికిం
బోవం దలపోసినాఁడఁ బొలఁతుకతోడన్. 8

వ. అని ప్రికృతిప్రిధానవర్గముం గని. 9

—† రాజు మధుకరునకుఁ దనరాజ్య మీఁ బలుకుట †—

ద్విపదము. నాకు దాయాదులు నా యన్న వారు
లోకమునన్ లేరు లోకోత్త్రరుండు
లోకసంస్తుతుఁడు నలోలుండు విగత
కాకత్యుఁ డగుమధుకరునకు నాదు
శ్రీకరం బగునట్టిక్షితిరాజ్య మిచ్చి
మీకు రాజుగఁ జేసి మేలుఁ గూర్పఁగ
నాకుఁ గోరిక పెట్టె నరులార ! మీరు
మీకోర్కియు నెఱుంగ మే మెంతు మిప్పుడు. 10

వ. అని మఱియును. 11

ఉ. మాకులమందు దుష్టుఁ డయి మాతులపుత్త్రికుఁడన్ ఖలుండు ము
న్నైక నని నాశ్రియాశుఁ డనునజ్ఞుని వాఁడు బహిష్కృతుండు పా
పాకరుఁ డైనవానికి సమంచితమైన ధరాధిపత్యముం
గైకొన నిత్తుమే నఖిలకల్మషముల్ మన నెత్తి కెక్కెడిన్. 12

తే. ఉత్తమశ్లోకుఁ డై ప్రజాయత్తచిత్తుఁ
డైనవాఁడు రాజైనచో నఖిలప్రజలు
సిరియు సంపదయుం గల్గి చెలఁగుచుండ్రు
కానినాఁ డెల్లజగమును గాలిపోవు. 13

ఆ. అట్టిఖలునియందు నస్మదీయం బయి
పూజ్య మయినయట్టిరాజ్య మిడిన
నేను నాదుప్రజలు నిరయంబునం బడు
నట్టివార మగుదు మది నిజంబు. 14

ఆ. మధుకరుండు సకలమాన్యచరిత్రుఁడు
చదివినట్టివాఁడు సదయహృదయుఁ
డఖిలజనులయందు ననురాగము గలాఁడు
రాజ్యమునకుఁ దగును బూజ్యుఁడీతఁడు. 15

చ. నలువదియేండ్లనాఁ డితఁడు నాకుఁ గుమారుఁడు గా జనించి వి
ద్యలు దగ నేర్చి గోవుల నయంబునఁ గొల్చుచు గోష్ఠమం దసుర్
వెలలఁగ మేసినుండి యిటు విప్రుఁడ వై జనియించె వీనిదే
యిల యిది వీని కిచ్చెదను నే నని మీకు వచింతు నామదిన్. 16

చ. ఇతఁడు జయంతుఁ డన్ననుడి నందివాఁ డవు డొక్కకుక్షిపై
సతతము ప్రేముడిం గలిగి సాఁకుచునుండును దాని నద్ది యీ
గతి జనియించె మాలతిగఁ గల్గెను వీరికి దాన నిట్టు లం
చిత గతు లంచు నాకు మును జెప్పెను యోగి యొకండు వింటిరే. 17

వ. అనిన నెల్లరు నేకగ్రీవంబుగా మధుకరునకు రాజ్య మీ నంగీకారం
బెఱింగించి రంత. 18

శా. నారాజ్యంబు మధువ్రతుం డనఁగ సన్మాన్యుండు ధన్యుండు వి
ద్యారాజీవభవుండు విజ్ఞుఁ డగుచుం దళ్లోకోత్తు విప్రోత్తమ
శ్రీరమ్యుం డగువీని కిచ్చి దొర గాఁ జేయంగ నున్నాఁడ నో
భూపాప్రభువులార ! తద్విభవముం జూడంగ విచ్చేయుఁడీ. 19

వ. అని రాజేంద్రుం డగు ననంతనారాయణుండును. 20

ఉ. నాఁకొమరుం డనుత్తమగుణ ప్రథితుండు మధువ్రతుండు నా
వాఁకొన నైన ప్రవర్తిల్లెడువానికి మాధవకన్యకామణిన్
జేకొన నిచ్చి పెండిలిని జేయుదు మిప్పరి నెల్ల బాంధవుల్
ప్రాకటవైభవంబుఁ గన రా మిము వేఁడుదు మెల్లభంగులన్ 21

వ. అని మిత్రిందును శుభలేఖలు వ్రాసి మధురాపురీశ్వరుం డగు మధుసూదనుని మఱియుం గలప్రముఖులను మాధవుని మేనబావ యగుమధునైరిని. మల్లికను, లక్ష్మీనిని గొజ్జంగిని బద్మినిబంధు మిత్రిలను జిత్రిలేఖకురా లగు కాంచనమాలను మాలతీమధు కరులగురువులను సుశ్రుతుం డనునాయుర్వేదవైద్యుని సోముని గాలవుని దదాశ్రమవాసులను భార్గవుని వానిశిష్యవర్గంబును మఱియుం గలబంధుమిత్రిలను భటులం బుచ్చి పిలువం బంచి రంత మధురాపురంబున. 22

—♦ మాధవి వృత్తాంతము ♦—

ఉ. మాధవధర్మపత్ని యఁటు మార్గము తప్పి మెలంగుచుండు నా
మాధవి కన్నవా రటులు మాయఁగ నైన కతంబునం దినం
గా ధరియింప లేని దయి కష్టము లొందుచుఁ గన్నబిడ్డతో
మాధుకరంబు చేసికొనుమాడ్కిఁ జరించెను దత్పురంబునన్. 23

మత్త. కన్నకూఁతురు కష్ట మందెడుఁ గానివాని కొసంగినన్
గన్నులారఁగఁ జూడ నయ్యెడుఁ గా యటంచుఁ దలంచి నేఁ
గొన్ని తప్పు లొనర్చి యుంటిని గోపనుం డగుభర్త నా
కిన్నిపాటులు గల్గఁ జేసె నిఁ కేమి సేయుదు దైవమా. 24

ఆ. అల్పబుద్ధి గలిగి యాఁడుదానను గానఁ
గన్నవారిసిరుల నెన్నుకొనుచు
నాకు లోప మేమి నావాఁకు గల రని
తలఁచి యిట్టు లైతి దైవనిహతి. 25

తే. ఏకపత్నీవ్రతస్థు సమిద్ధచరితు
నాపతిని వెలిచవులనుం దవిలె ననుచు
సత్యదూరము లైనవచనము లాడి
పాప మొనరించుదాననై బడలువడితి. 26

క. పతియే దైవం బనుచున్
మతి నెంచఁగ లేక బుద్ధి మాలినగతికిన్
హితవుం బూనితి నా కిటు
లతుకుట కా దనుచు నెవ్వ రనఁ బో రననిన్. 27

సీ. తమ్ముఁడుం దమ్ముని తరుణి తమ్ముండును
నురి శిక్షకై యేగి రుర్వి విడిచి
తమ్మునితనయుండు తరుణవయస్కుఁడు
చెరసాలఁ బడియె నామరణముగను
మూడుకాళ్ళం గల్గుముదుసలి తండ్రి తాఁ
బదియేండ్లు చెరలోనఁ బడఁగ నయ్యెఁ
దండ్రితోయమువారు దాల్ఛ్యజీవాదులు
రెండేండ్లు బందిలో నుండ నైరి

తే. నేను శిక్షితురాలనై నెగులు గుడిచి
తిని ధనం బిండ్లు భూములు దివ్యభూష
లెల్ల నాశన మయ్యె నోచెల్ల ! దుష్ట
బుద్ధి నగునాకతంబున బుగ్గి యయ్యె. 28

వ. అని యనేకవిధంబులఁ బరిదేవనంబు సేయుచుఁ గొడుకుదిక్కు-
మొగంబై యి ట్లనియె. 29

ఆ. కన్నతల్లి యన్నగారవంబున నన్ను
విడక తండ్రిమాట వినక యిచట
నున్నవాఁడ విప్పు డెన్ని న్ప్పులు వచ్చె
నేమిసేయువార మింకఁ జెప్పుమ. 30

చ. కడచినదానికిన్ వగవఁ గార్యము గా దొకమాట చెప్పెదన్
గొడుక ! యిట న్మెలంగుటలు కూడదు పువ్వులు గొన్నయారిలోఁ
బుడకల నమ్మగొన్న గతి పుట్టెడుఁ గాన ననంతువీఁటిలోఁ
గడువిభవం బెసంగ నిను గన్నతఁ డక్కడయు నుండి రయ్యెడన్. 31

క. ఎల్లె శ్రమపడి నీవి
ప్పట్లన్ దత్పురముఁ జేగి ప్రార్థింపుము నీ
వెట్లున్న నీదుపిత కు
న్నల్లె కృప యనుచు విందు నాత్మజ ! యిపుడున్. 32

శా. నే నింతిం తనరానిదోష మయయో నీతండ్రికిం జేసితిన్
నానేరంబు లతండు సైఁపఁ డనుచు న్నాయాత్మయే చెప్పు నా
కో నమ్మం గనినట్టితండ్రి ! విను నీ వొక్కండవే పొమ్ము నా
పై నెమ్మి న్విడు మెల్లకష్టములు పోవం జేసికొ మ్మిం కిటన్. 33

క. నే నేఘోరాటవికేఁ
గానీ చని యెట్టు లెట్లొ కాలము పుచ్చం
గా నెంచి యుంటి న న్నే
దే నొక్కమృగం బనుగ్రహింపదె తండ్రీ ! 34

—✻ ధన్యుఁడు తల్లి నూరడించుట ✻—

ఆ. అనినఁ గొడుకు పలికె నమ్మ ! నీ విట్లాడ
వలదు నీవు పోవఁ గలదె యొకఁడు
నేను నల్లె యనుచు నీచిత్తమున నెంచు
మట్టితలఁపు కాని దని వచింతు. 35

ఆ. అటకుఁ బోయి మనము యాచింతు మేనియుఁ
గాద యనఁ డతండు కరుణ గలఁడు
కదలి పోద మటకుఁ గాల్నడఁ గావించి
కొనుచు నాదునుడులు వినుము తల్లి ! 36

ఉ. ఎప్పుడు నన్నుఁ బ్రేముడిన వీక్షణముం బొనరించుఁ దండ్రి నే
నెప్పుడు వానిమాట వినియే యెఱుఁగ న్నిను వీడి పోవఁ గా
నొప్పక యెట్లొ చెప్పి నిను నొప్పఁగఁ జేసియు నీదుకాపురం
బెప్పటిమాడ్కిఁ జేయుటకు నెంచితిఁ గాని ఫలింప వగ్గతుల్. 37

క. కలవాని కక్క నీయం
దలఁచితి నీ వట్లు నేను దలఁచితిఁ గానన్
గలహించి తండ్రి విడువం
గలవాఁడన నైతిఁ గాని కలదే యేదేన్. 38

వ. కావున నీ వేవిచారంబును జేయక నాతోడ రమ్ము మన మటకుం బోయిన పదంపడి మాతండ్రి కేను జెప్పియు రాజుచేతం జెప్పించియుఁ గార్యాను సంధానంబు గావించెద మన మెట్లున్నను మనపై మాలతికినిఁ బద్మినీమిత్రులకును వాత్సల్యంబు గలిగియుండు వారును మనయెడం గరుణించి నాతండ్రికిం జెప్పి యొప్పింపఁ గల రని తల్లి నొప్పించి ప్రయాణంబు గావించి భిక్షాటనంబున నుదరపోషణంబు గావించుకొనుచు దేశదేశంబులు పరిభ్రమించుచుఁ గతిపయ ప్రయాణంబుల ననంతపురంబునకుం జనుదెంచి ధర్మశాలన్ దిగి యున్న యప్పుడు తల్లి తనూజుం గాంచి యి ట్లనియె. 39

మ. తనయా! యిప్పుడు నీసహోదరియు నీతాతాద్యులుం గోటలో
నన యున్నా రని విన్నదాన నది గానన్ నీవు రాజాంతికం
బునకుం బోయి వచింపు మంతయును నాభూమీశునాజ్ఞన్ భవ
జ్జనకుం జూచి నమస్కరించి తెలియున్ సల్పం దగుం గర్జమున్. 40

—॥ ధన్యుఁడు రాజమార్గమునఁ దండ్రిం దర్శించుట ॥—

తే. అనినఁ బుత్త్రకుఁ డౌ నని యపుడు రాజు
కడకు ననుమతిఁ గొని చని కడమఁ బడక
యుండ నంతయు నెఱిఁగించి యోమహీశ!
నన్ను నాతల్లినిం బ్రోవ నాదుమనవి. 41

తే. అనిన విని రాజు నాతనిం గొనుచు మాధ
వునికడకుఁ బోయి సర్వము వినిచి పుత్రిఁ
జూపుటయు నాతఁడుం జూచి చూచుచుండఁ
బుత్రిఁ డి ట్లని ప్రార్థించె మ్రొక్కి కేలు. 42

శా. అజ్ఞానంబున నేను నాజననియుం బ్రారబ్ధకర్మంబు స
ర్వజ్ఞ స్వీడఁగఁ జేయుటన్ మిముఁ గృపాపారీణుల న్వీడి దు
ష్ప్రజ్ఞం బోయితి మెండమావులకు నాసల్ సేసి రక్షింపు మో
ప్రాజ్ఞా! మాయపరాధముల్ సయిచి పుత్రప్రేమ పాటించుచున్.

మత్త. తప్పు చేసితి నంచు నాదగుతల్లి యెంతయు దీనతన్
జెప్పుచున్ భవదంఘ్రియుగ్మముఁ జేరి మ్రొక్కి భజింపఁ గా
నిప్పు డిక్కడ కేగుదెంచె నొకింతయేని భుజింప లే
దప్ప! తప్పు సహించి ప్రోవఁగ ప్రార్థనం బొనరించెదన్. 44

వ. అంతలో నచ్చెంత దుఃఖాక్రాంతచిత్తయై తత్తఱించుచు జాలిం
బడుచున్నమాలతిం గాంచి వెక్కిమ్రింగుచు ని ట్లనియె. 45

శా. అక్కా! నీదగుపల్కు నే వినక నాఁ డమ్మాడ్కి నుక్కీఁడ నై
పెక్కు ల్పల్కుచుఁ దండ్రితో నరిగితిన్ బెంపెక్కునజ్ఞానపుం
జక్కి న్నీ వనినట్లు సర్వమును సంస్కారంబులై పోయె నీ
వాక్కు ల్వేదము లయ్యె నే ఖలుఁడ నై వర్తింతు దుర్వర్తనిన్. 46

ఉ. తమ్ముఁడఁ దప్పు చేతిని దల్లి యెటుండినఁ గన్నబిడ్డ తా
నెమ్మెయి నెమ్మనే గొనుట లెప్డు సనాతనధర్మ మమ్మరో!
నెమ్మది నమ్మును న్నను గణించుచు నయ్యకుఁ జెప్పి ప్రోవఁగా
సమ్మతిఁ జూపు మంచు నిను సాఁగిలి మ్రొక్కి భజింతు నెంతయున్.

వ. అంతఁ జెంతం జేర వచ్చినమధుకరునకు మ్రొక్కి యి ట్లనియె. 48

మ. నిను గర్హించితి నేను నాజననియున్ నీ వెన్న రాజాధిరా
జనుతశ్రీకుఁడ వెట్లు చేసినను నీస్వాధీనమం దుండు దం

డన మోహభావుక ! నీప్రియావరజుఁడన్ స్వాంతంబునం దెంచి నా
జనని న్నన్నను మాధవాద్భుతులకై సాఁగిల్లఁగాఁ జేయవే. 49

వ. అపుడు రాజు ద్విజరాజుం గాంచి యి ట్లనియె. 50

తే. ఆర్యవర్య ! పశ్చాత్తాప మందినపుడు
శుద్ధులే యని శాస్త్రముల్ చూపుఁ బథము
వీరు త ప్పెంతచేసిన వేఁడుచున్న
వారు గావునఁ గరుణింప వలయుఁ గాదె. 51

వ. అనిన మాధవుండు మానవేశ్వరుదిక్కు మొగం బై. 52

—♦ మాధవుఁడు సుధవిని నిరాకరించుట ♦—

శా. ఆర్యోక్తుల్ బహురీతులం బరఁగు నాయారీతులం దుత్తమం
బార్యావర్తమునందు నేది యగు నే నద్దానిఁ బాటించుచున్
భార్యాదండము సేయ నెంచితిని భూపా ! దీని కొండాడ కై
శ్వర్యం బన్న నొసంగుచుంటి ననుచు న్వాకు ఱిత్తు నాచిత్తమున్. 53

చ. ఎఱుఁగఁడు వీఁ డొకింతయును నెన్నియొ చెప్పితిఁ దల్లి తీపి నా
కఱవు ల వన్నియు న్వినక కా దని సర్వము తోసి పోయె ని
త్తెఱఁ గయినం గులాంబుధికిఁ దేప యితం డగుఁ గాన వీనినిం
దొఱఁగను సర్వ మిచ్చెదను దోడ వసింపఁగ సమ్మతించితిన్. 54

క. కా దనిన వీఁడు మధురన్
నాదగుసర్వస్వ మొంది నయవిదుఁ డగుచున్
బోరిది గలం డయి యుండుట
కేదియు నభ్యంతరంబు నే వచియింపన్. 55

తే. ఇదియునుం గాక మల్లిక నితని కిచ్చి
పెండ్లి సేయం దలంపు గావించుచుండె
మితుఁ డట్లు సేయుట నాకు మేల యనుచుఁ
దోఁచె మాలతి కోరు ని ట్లాచరింప. 56

తే. కుండమాఱుపుపెండ్లిండ్లు కూడ వండ్రు
కాని యట్లంట తగ దిందుఁ గానఁబడదు
దోష మింతయు లే దిది తొంటినుండి
నిశ్చితార్థమ యనియును నే వచింతు. 57

క. మల్లిక చచ్చినదే యగు
నల్లంతన బావ చేయునభియోగమునన్
జల్లనిరాజు ననుగ్రహ
మిల్లలి బ్రదికించె దానిఁ బృథివీనాథా ! 59

వ. అని మఱియును. 59

చ. మనశుభలేఖ లందుకొని మామకుమారుఁడు దానిఁ దెచ్చె ని
న్నను మనయింటికిన్ దొర కనంతరమం దెఱఁగింప నుంటి నం
చును బిలిపించి వారలను జూపెను భూపతి కంత నాతఁడున్
గని మధువైరినిం బొగడెఁ గాదిలి గన్గొని మెచ్చె మల్లికన్. 60

క. మల్లిక ధన్యునిఁ గొనఁగా
నుల్లము గావించి మున్న యున్నది గానన్
మెల్లనఁ దనయంగీకృతి
నెల్లరకుఁ నెఱుంగఁ జేసి నింతటిలోనన్. 61

వ. అయ్యవసరంబున మాలతియుఁ బద్మినీమిత్రులును మల్లికయు మధు
వైరియు మాధవుం బొదువుకొని వేఱువేఱువిధంబులఁ బ్రార్థించుచు.

మ. "అపరాధం బొనరించి యుంటిని మహాత్మా ! నన్ను రక్షింపు"మం
చిపుడీ పుత్రునిఁ బుచ్చి మాధవి కడున్ హీనస్థితిం జెంది నీ
దుపదాబ్జంబుల వ్రాలి వేఁడెడిని దద్దుఃఖంబు శాంతింపఁ గాఁ
గృపమై నామె ననుగ్రహింపు మని మే మి ట్లైతి మర్థింపఁగన్. 63

తే. అనిన నతఁ డింకఁ జెప్పకుఁ డట్టివాండ్రి
కిట్లు కాఁ దగు లోకమం దిద్ది పరమ

మైన యాదర్శకం బయి కానఁ బడఁగ
నగు ననుచు వారి శాసించె నాబుధుండు. 64

వ. అనంతరంబ పరిణయోత్సవసందర్భమున రాజు పురం బలంకరింపఁ
జేసె నప్పుడు. 65

తే. పల్లకీ లందలమ్ములు భద్రకరులు
తేరు లశ్వంబు లుష్ట్రముల్ వీరభటులు
దారులఁ సందడింపంగఁ దేరి పురము
పట్టపగ్గము లేకుండఁ బరఁగె నపుడు. 66

—* ప్రజ లుత్సవదర్శనార్థము వచ్చుట *—

తే. తనరుశుభలేఖ లంది భూజనులు రాజ
వరులు బంధువులు న్విప్రవరులు రాఁగ
వారలకు నొప్పువిడిదలు వలయుసత్కృ
తుల నొనర్చిరి మంత్రివర్యులు ప్రియమున. 67

చ. అల మధురాపురీశ్వరుఁ డనంతబలంబులు తన్నుఁ గొల్వఁగా
సలలితగానకోవిదులు సత్కవిచంద్రులు చిత్రలేఖకుల్
బలసి నడన్ సుధీవరులు పజ్జ మెలంగ నమాత్యు లెంతయేఁ
గొలువ మహేంద్రవైభవము కొపు వచించుచు వచ్చె ముచ్చటన్.

సీ. సిరములపైనుండి చీలమండలముదుల్
దాఁకఁ గాషాయవస్త్రములు దాల్చి
యెడమకే ల్క్రిందుగాఁ గుడికేలు క్రిందుగా
దండకమండలుల్ దనరఁ దాల్చి
యురములం గరముల నెటిమీఁదమోముల
భస్మత్రిపుండ్రముల్ పరఁగఁ దాల్చి
త్రిపుటాదితాళముల్ తెలుపుచుండెడునాఁగ
నులిపు పుట్టంగఁ బావలను దాల్చి

తే. అనుకరించుచు సంతల ననుగతు లగు
శిష్యులకు వేదశిఖలను జెప్పుకొనుచు
శోణనది పొంగివచ్చెడు చొప్పు దోఁప
వచ్చిరెం దెందుఁ గలమునివర్యు లటకు. 69

క. గాలవుఁడుఁ భార్గవుఁడున్
వేలకు వే లగుచు శిష్యవిసరము గొలువన్
బ్రోలికి వచ్చిరి పెండిలి
నాలోకింపంగఁ బ్రభువునానతి నంతన్. 70

—✻ వివాహవర్ణనము ✻—

వ. అనంతరం బయ్యనంతనారాయణుండు మకరధ్వజు నలంకరించి యొక్కభద్రదంతావళంబున నెక్కించి హితపురోహితబంధుబృందం బును నానావిధసేనాసమూహంబును బరివేష్టించి నడువ నేగుఁ బెండ్లి గావించి పిదప నొక్కరమణీయభద్రోదవసితాభ్యంతరంబున మాణిక్యఖచితమంటపంబున నధివసింపం జేసె నంత మాధవుం డమందానందంబున నందనకు మంగళస్నానగౌరీపూజాదులు నిర్వ ర్తించి కౌతుకవేదిపయిం దెచ్చి కూరుచుండం బెట్టి భేరీమృదంగ వేణువీణాదినిక్వాణంబులు చెలంగ శుభముహూర్తంబున మంగళ స్నాతుండై సాలంకారుండై మణిగణఖచితపీఠికాతలంబున నాశీనుం డగువరుని శ్రీమహావిష్ణుస్వరూపునిగఁ దలంచుచు యథావిభవవిస్త రంబుగ నర్చించి మధుపర్కం బొసంగి పితృదేవతాప్రీతికరంబుగా దారవోసి సాలంకృతకన్యాదానంబుసేసి కృష్ణానందదత్తచింతామణిన్ దానదక్షిణగా నొసంగె నంత మధుకరుండు మాలతీపాణిగ్రహణం బొనరించె ననంతరంబ. 71

క. తెరచీర లెత్త నైదువ
లిరువురు మోములను జూచి రింపుగఁ దలఁబ్రాల్

శిరముల నిడికొని రంతట
వరుఁ డామెకుఁ దాలిబొట్టు పరఁగం గట్టెన్. 72

వ. ఇట్లు విధిదృష్టవిధానంబున వివాహంబు నిర్వర్తించిన యనంతరంబ మల్లికకును ధన్యవరునకును నిట్లె మహావైభవంబున వివాహంబు గావించి రంత నొక్కశుభముహూర్తంబున. 73

—† పట్టాభిషేక మహోత్సవము †—

సీ. మునుమున్ను కరిఘటల్ ముచ్చటఁ గూర్చుచు
నడగొండలో యన నడచుచుండ
వెనుచక్కి నంచలపిండో కో యన వెలి
మావులు నడయాడి పోవుచుండ
వెనువెంటఁ జెవి కింపు వెంపఁ దౌర్యత్రిక
మును మహోన్నతముగా మొఱయుచుండ
వందిమాగధులు కైవారముల్ సేయుచు
జయజయశబ్దముల్ సలుపుచుండ

తే. మంత్రిసామంతముఖ్యులు మాన్యజనులు
పాదచరు లయి చెంగటం బరఁగుచుండ
మల్లెపూఁబల్లకిని నెక్కి మధుకరుండు
వీథులం దేగుఁ బెండ్లి గావించె నపుడు. 74

వ. ఇట్లేగుఁ బెండ్లి మహోత్సవ మైనపదంపడి. 75

తే. రత్నమాణిక్యఖచితమై రమ్యమై వి
మానతుల్యప్రభాభాసమాన మైన
భద్రసింహాసనంబునఁ బ్రాఙ్ము ఖెల్ల
మాలతీమధుకరులను లీల నిలిపి. 76

వ. పురోహితులు సామ్రాజ్యపట్టాభిషేకమంత్రములతో నభిషేకించి రంత ననంతపురాధీశ్వరుం డగుననంతనారాయణుండు రత్నకిరీటంబు

నోయిటం బూని సింహాసనంబుకడ నిలిచి సభాసదు లెల్లరు విన నుచ్చైస్స్వనంబున నేను నాయీరాజ్యంబు సర్వసంపత్సమేతంబుగా నీమధుకరునకు నొసంగుచున్నాఁడ నని కిరీటంబు వానిశిరంబునం బెట్టె నంత. 77

సీ. ఉభయపార్శ్వంబుల నుండి సామంతులు
వరభక్తి ఛత్రచామరము లిడఁగఁ
బరమమంత్రీశ్వరుల్ పరివారయుక్తులై
ముదమొప్ప నటునిటు మూఁగి కొలువ
వందిమాగధులు కైవారముల్ సేయుచు
నదటుగుండెలతోడ నెదుట నిలువ
నచ్చరలకు దీటువచ్చు వారాంగనల్
నృత్యగీతాదులు నెరపుచుండఁ

తే. గడలఁ బౌరులు బంధుగుల్ గనుచు నుండ
రమణ మెఱయ వివిధతూర్యములు మొఱయ
బ్రహ్మలంతలు వేదమంత్రములు వలుక
పట్టభద్రుఁ డై మధుకరప్రభు వెసంగె. 78

వ. ఇట్లు పట్టాభిషిక్తుండై నమధుకరమహారాజచంద్రుండు రాజ్యసింహాసనాసీనుండై లేచి తల్లిదండ్రులకును మామకును దండప్రణామంబు లాచరించి యనంతనారాయణుకడకుం' జని వానిపొట్టలోఁ దల వెట్టి తదాలింగితుండై సింహపీఠంబునకు వచ్చి నే నెల్లప్రజలం గన్న ప్రజలట్లు కాచి రక్షించెద నధర్మం బడంగఁ ద్రొక్కి ధర్మం బుద్ధరించెద వేదశాస్త్రంబులకుఁ బ్రవర్తనంబు గలిగించి వర్ణాశ్రమ ధర్మంబులును సమ్యగ్విధంబునఁ బొలుపొందం బాలించెద మా ఘ్రాజేంద్రుని బంధుమిత్రు లెల్లరు నాబంధుమిత్రులు నేను వారిని నావారుగా నెంచి సేవించెద మహారాజుచే నాచరింపం బడు నెల్ల ధర్మంబులు నేమఱక నే నాచరించెద నే నెందునేని ప్రమత్తుండనై

యున్న నన్ను నామంత్రు లపరిమత్తునిగఁ జేసి పాలింతురు గాక
యని లోకంబున కభయహస్తం బిచ్చె ననంతరంబ తండ్రి యగు
మిత్రేంద్రుండు తనకు గర్గముని యిచ్చిన మణియుఁ బ్రకృతిశాస్త్ర
ప్రదీపితం బగుపుస్తకంబును రాజేంద్రుం డై సింహాసనం బలంకరించిన
మధుకరున కిచ్చి యెల్లరు విన ని ట్లనియె. 79

మ. ఇవి మాకౌశికమహానివర్యసుతపోహేరాళసామర్థ్యవై
భవసంపాదితముల్ హరించి శపియింపంబడ్డగుండు నీ
దవువంశంబున నుండ నౌ ననుచు నా కర్పించె నీరత్న మే
దివసంబున్ ధన మీను బుస్తకము మే ల్దెల్పంగ రా దేరికిన్. 80

వ. అని యభివర్ణించుచున్నంత మధురాపురీశ్వరుం డగుమధుసూద
నుండు సభామధ్యంబున నిలువం బడి యెల్లరు విన మధుకరరాజు
దిక్కుమొగం బై యి ట్లనియె. 81

— మధురాపురీశ్వరుని ప్రసంగము —

ఉ. నాపురమందుఁ గాపుర మొనర్చెడువారలు మీరు మిమ్ము నే
నోపి భజించుచుండుదు నహో! యిపు డీవును నేనునుం బలెన్
భూపతి నైతి విద్దఱము మ న్నగుసంగతి నేస్తకాండ్రమై
యాపదలందు సంపదలయందును గూడి మెలంగ నొప్పెడిన్. 82

వ. అనిన మధుకరుం డతని కి ట్లనియె. 83

ఉ. ము న్నొకయూర నుంటి మనుముచ్చట మాత్రమె కాదు నాసతిఁ
నన్నును నిట్లు కూర్చుటకు నాఁడు ప్రసర్పితదివ్యకారణం
బెన్న నరేశ్వరా! నెలఁత నిచ్చెటి కా దును రిచ్చి తన్న నౌ
ని న్నొకమిత్రుఁ డం చనక నేను భజింతును బ్రాణదాతఁ గన్. 84

వ. అని పలికినంత మధుసూదనుం డనంతనారాయణాదులయనుమతిం
బడసి తత్పరికల్పితచందనతాంబూలాదిసత్కారంబు లంది సపరి
వారుండై నిజపురంబునకు నిర్గమించెఁ దక్కనుం గలుగు
మిత్రాదులును సత్కృతులై చనిరి పదంపడి గాలవభార్గవప్రభృతు

లును బయనం బయినం గని మాలతీమధుకరులు వారిపాదార
విందంబులకు వందనం బాచరించి యి ట్లనిరి. 85

మత్త. ప్రాణదానము చేసి పిమ్మట నన్నవస్త్రము లిచ్చియున్
సూనులం బలె మమ్ముఁ బ్రేముడిఁ జూచి ప్రోచినమిమ్ము మా
మానసంబుల సంస్మరింతుము మాటికిం దలిదండ్రు ల
ట్లోనిరాకృతదుష్కృతుల్ ! మము నోముచుండుఁ డజస్రమున్. 86

తే. మాప్రభు వసంతనారాయణప్రథితుఁడు
మీకుఁ గా రాజ్యమును బూనె లోక మెన్న
నన్నుఁ బెరవానిఁగా నెంచ కెన్నఁడేని
వలయునన్నియుఁ గైకొనవలయు నిందు. 87

వ. అని వారి నంపి పుచ్చె నంత వసంతనారాయణుండు మాధవమిత్రా
దులయు మాలతీమధుకరులయు మంత్రిసామంతాదులయుఁ బౌర
జానపదులయు సమక్షంబునఁ దనతపోవనప్రయాణం బెఱింగించిన
నెల్లరును దుఃఖాక్రాంతచిత్తులై తమయసమ్మతిం దెలిపిన మీ
రెవ్వరు నేమియుఁ బలుక వలదు మీ కింక నీమధుకరుండె శిక్ష
కుండును రక్షకుండును నేను బోయి వచ్చెద ననుజ్ఞ నిం డని సభా
ర్యుండై కాషాయవల్కలంబులు ధరించి నిలువంబడి యున్నం గని
మధుకరుననుమతంబున రథం బొండు సన్నద్ధంబు చేసి తెచ్చి
రాజదంపతుల నం దధివసింపించి రంత మాలతీమధుకరు లిరుగడ
నిలిచి వీచోపు లిడుచుండ మంత్రిసామంతాదు లెల్లరు వేఱువేఱు
రథంబు లెక్కి వెంటరాఁ గదలి కతిపయప్రయాణంబులఁ దపోవనంబు
దరియ నరిగి యట రథావరోహణంబు గావించి రాజదంపతుల నట
నుటజంబున విశ్రమింపం జేసి సేవించుచుం గొన్నినా ళ్లుండినవుడు
మీర లందఱు నిం దుండ నొప్ప దిప్పుడ కదలిపోఁ గోరుచుంటి
నని రాజయోగి నియోగించినం దదాజ్ఞం గొని మధుకరాదు
లెల్లరుఁ బురంబునకుం జని రంత మధుకరుండు రాజ్యపీఠంబునం

యున్న నన్ను నామంత్రి లపరిమత్తునిగఁ జేసి పాలింతురు గాక యని లోకంబున కభయహస్తం బిచ్చె ననంతరంబ తండ్రి యగు మిత్రుండు తనకు గర్గముని యిచ్చిన మణియుఁ బ్రకృతిశాస్త్ర ప్రదీపితం బగుపుస్తకంబును రాజేంద్రుం డై సింహాసనం బలంకరించిన మధుకరున కిచ్చి యెల్లరు విన ని ట్లనియె. 79

మ. ఇవి మాకౌశికమౌనివర్యసుతపోహేరాళసామర్థ్యనై
భవసంపాదితముల్ హరించి శపియింపంబడ్డగర్గుండు నీ
దవువంశంబున నుండ నౌ ననుచు నా కర్పించె నీరత్న మే
దివసంబున్ ధన మీను బుస్తకము మే ల్దెల్పంగ రా దేరికిన్. 80

వ. అని యభివర్ణించుచున్నంత మధురాపురీశ్వరుం డగుమధుసూద నుండు సభామధ్యంబున నిలువం బడి యెల్లరు విన మధుకరరాజు దిక్కు మొగం బై యి ట్లనియె. 81

— మధురాపురీశ్వరుని ప్రసంగము —

ఉ. నాపురమందుఁ గాపుర మొనర్చెడువారలు మీరు మిమ్ము నే
నోపి భజించుచుండుదు నహో ! యిపు డీవును నేనునుం బలెన్
భూపతి వైతి విద్దఱము ము న్నగుసంగతి నేస్తకాండ్రమై
యాపదలందు సంపదలయందును గూడి మెలంగ నొప్పెడిన్. 82

వ. అనిన మధుకరుం డతని కి ట్లనియె. 83

ఉ. ము న్నొకయూర నుంటి మనుముచ్చట మాత్రమె కాదు నాసతిన్
నన్నును నిట్లు కూర్చుటకు నాఁడు పౌనర్భిసతీద్పుకారణం
బెన్న నరేశ్వరా ! నెలఁత నిచ్చుటె కా దును రిచ్చి తన్న నో
ని న్నొకమిత్రుఁ డం చనక నేను భజింతును బ్రాణదాతఁ గన్. 84

వ. అని పలికినంత మధుసూదనుం డనంతనారాయణాదులయనుమతిం బడసి తత్పరికల్పితచందనతాంబూలాదిసత్కారంబు లంది సపరి వారుం డై నిజపురంబునకు నిర్గమించెఁ దక్కనుం గల్గు మిత్రాదులును సత్కృతులై చనిరి పదంపడి గాలవభార్గవప్రభృతు

లును బయనం బయినం గని మాలతీమధుకరులు వారిపాదార
విందంబులకు వందనం బాచరించి యి ట్లనిరి.                    85

మత్త. ప్రాణదానము చేసి పిమ్మట నన్నవస్త్రము లిచ్చియున్
సూనులం బలె మమ్ముఁ బ్రేముడిఁ జూచి ప్రోచినమిమ్ము మా
మానసంబుల సంస్మరింతుము మాటికిం దలిదండ్రు ల
ట్లోనిరాకృతదుష్కృతుల్! మము నోముచుండుఁ డజస్రమున్. 86

తే. మాప్రభు వసంతనారాయణప్రథితుఁడు
మీకుఁ గా రాజ్యమును బూనె లోక మెన్న
నన్నుఁ బెరవానిఁగా నెంచ కెన్నఁడేని
వలయునన్నియుఁ గైకొనవలయు నిందు.                    87

వ. అని వారి నంపి పుచ్చె నంత వసంతనారాయణుండు మాధవమిత్రా
దులయు మాలతీమధుకరులయు మంత్రిసామంతాదులయుఁ బౌర
జానపదులయు సమక్షంబునఁ దనతపోవనప్రయాణం బెఱింగించిన
నెల్లరును దుఃఖాక్రాంతచిత్తులై తమయసమ్మతిం దెలిపిన మీ
రెవ్వరు నేమియుఁ బలుక వలదు మీ కింక నీమధుకరుండె శిక్ష
కుండును రక్షకుండును నేను బోయి వచ్చెద ననుజ్ఞ నిం డని సభా
ర్హ్యుండై కాషాయవల్కలంబులు ధరించి నిలువంబడి యున్నం గని
మధుకరుననుమతంబున రథం బొండు సన్నద్ధంబు చేసి తెచ్చి
రాజదంపతుల నం దధివసింపించి రంత మాలతీమధుకరు లిరుగడ
నిలిచి వీచోపు లిడుచుండ మంత్రిసామంతాదు లెల్లరు వేఱువేఱు
రథంబు లెక్కి వెంటరాఁ గదలి కతిపయప్రయాణంబులఁ దపోవనంబు
దరియ నరిగి యట రథావరోహణంబు గావించి రాజదంపతుల నట
నుటజంబున విశ్రమింపం జేసి సేవించుచుం గొన్నినా ళ్లుండినపుడు
మీర లందఱు నిం దుండ నొప్ప దిప్పుడ కదలిపోఁ గోరుచుంటి
నని రాజయోగి నియోగించినం దదాజ్ఞం గొని మధుకరాదు
లెల్లరుఁ బురంబునకుం జని రంత మధుకరుండు రాజ్యపీఠంబునం

దధివసించి మంత్రిలమంతనంబునం దొంటిరాజన్యులు పాలిం
పోలికలం బ్రజానురంజకంబుగా నేలం బాలించుచు ధర్మంబునా
పాదంబుల నడపించుచు నప్పు డప్పుడు తపోవనంబునకుం బో
రాజర్షుల దర్శించుచు వారికి వలయునన్నియు నంపిపుచ్చుచుం
దండ్రుల నాదరించుచు మాధవు నజస్రంబు మాధవుని గా
యారాధించుచు ననేకధర్మకార్యంబు లాచరించుచుం బ్రాణ
మాన యగుమాలతిం గూడి రాజ్యం బేలుచు సుఖంబుండె.

క. అని కథకుఁడు శ్రోతలకున్
వినిపించెన్ వీను లలర విశ్రుతఫణితిన్
ఘనుఁ డగుమధుకరుచరితము
వినినం జదివినను మిగుల విజ్ఞాన మగున్.

ఆశ్వాసాంతము.

క. ఋతు శాస్త్రిభోర్వ్యల శక
మతిశయముగ నలరునప్పు డగుతారణ నీ
కృతిఁ బేర్మిని విరచించెన్
గృతి శ్రీపదకృష్ణశాస్త్రి కృతముఖు లెన్నన్.

గ ద్య ము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ
కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ,
విద్యావిశారదాది బిరుదవిరాజమాన
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతం బయిన
మధుకరవిజయం బనుప్రబంధంబున
సర్వంబును షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

మెజస్టిక్ ప్రెస్, రాజమండ్రి:—1955.